# అమ్మ సన్నిధిలో

# నా అనుభవాలు - జ్ఞాపకాలు



కొండముది బాలగోపాలకృష్ణమూర్తి

# అమ్మ సన్నిధిలో

## నా అనుభవాలు - జ్ఞాపకాలు




రచన

కొండముది బాలగోపాలకృష్ణమూర్తి



ప్రచురణ

శ్రీ విశ్వజననీపరిషత్, జిల్లెళ్ళమూడి -522 113

బాపట్ల మండలం, గుంటూరుజిల్లా

ముద్రణ : మే, 2010

కాపీలు : 1000

వెల : రూ. 60

## అమ్మకే అంకితం

నన్నూ, నా కుటుంబాన్నీ ఉద్ధరించటానికి తన సేవకు ఒక ఉపకరణంగా నన్ను ఉపయోగించుకుంటూ నా జీవితం, జీవనం సర్వం ఆక్రమించిన అమ్మకే ఈ గ్రంథం అంకితం. అమ్మ ఇచ్చిన ఈ అక్షర సుమాలు అమ్మపాదాలపైనే సమర్పిస్తున్నాను.

- గోపి

## అభినందనలు

గోపాలన్నయ్యను జిల్లెళ్ళమూడిలో అమ్మకూ, సంస్థ సేవకూ అప్పగించి సంసారభారాన్నంతా తావే భరించిన తండ్రి లక్ష్మీనారాయణ గారికీ, తల్లికంటే ప్రేమగా పెంచిన సవతి తల్లి జ్ఞానప్రసూనాంబకు, పిల్ల నిచ్చిన మేనత్త సీతారామమ్మ గారికీ..

తల్లి తండ్రులకు తగ్గ తనయులుగా గోపాలన్నయ్య, వెంకాయమ్మల పిల్లలు సర్వశ్రీ కొండముది లక్ష్మీప్రసాద్, సత్యనారాయణ, శ్రీనివాస్, నాగేశ్వరరావు, మురళీధర్, వరలక్ష్మి అనసూయలు ఈగ్రంథ ప్రచురణకు తమంత తాముగా ముందుకు వచ్చినందుకు అభినందిస్తున్నాము.

- శ్రీ విశ్వజననీ పరిషత్, జిల్లెళ్ళమూడి

ముద్రణ : శ్రీ లక్ష్మీగణపతి ఆర్ట్ ప్రింటర్స్

2/4 బ్రాడీపేట, గుంటూరు-2.

ఫోన్ : 0863-2235036

# ప్రకాశకుల మనవి

శ్రీ కొండముది బాలగోపాలకృష్ణమూర్తి గారు జిల్లెళ్ళమూడి సోదరీసోదరులకు గోపాలన్నయ్యగా సుప్రసిద్ధుడు. జిల్లెళ్ళమూడి చరిత్రలో సువర్ణాధ్యాయంగా లిఖింపదగిన కృష్ణత్రయంలో (రామకృష్ణ - గోపాలకృష్ణ - రాధాకృష్ణ శర్మ) కీలకమైన పాత్ర గోపాలన్నయ్య పోషించారు.

జిల్లెళ్ళమూడి అందరింటి సేవకు అమ్మ ఎన్నుకొన్న బిడ్డలలో గోపాలన్నయ్య ముఖ్యులు. శ్రీవిశ్వజననీ పరిషత్ ఏర్పడటంలో ప్రధానపాత్రధారి. మాతృశ్రీ విద్యాపరిషత్, మాతృశ్రీ పబ్లికేషన్‌ట్రస్ట్ ఒకటేమిటి జిల్లెళ్ళమూడి అందరింటి అభివృద్ధిలో ఏర్పడిన ప్రతి సోపానంలో అతని శ్రమదానం ఉన్నది. “ఇక్కడ అందరింటి వ్యవహారాలు నీవు చూడరా! నీ సంసారం సంగతి నేను చూచుకొంటాను” అని అమ్మ ఇచ్చిన హామీ అమ్మ నెరవేరుస్తున్నది. అలాగే గోపాలన్నయ్య అమ్మకిచ్చిన మాటను తాను నిలబెట్టుకొంటున్నాడు. భారతంలో కృష్ణుడు లాగా అవసరమైతే ఈ జగన్నాథ రథపు గుఱ్ఱాలు తోలుతాడు. అందరింటి రాజసూయాధ్వరంలో అగ్రపూజకు నీవే అర్హుడవు అంటే ఓహో కాబోలు సరేలే అంటాడు. కాదు అమ్మ వద్దకు వచ్చే సోదరీసోదరులకు కాళ్ళు కడిగి మంచి నీళ్లు ఇచ్చి సేదతీర్చాలి అంటే మహాద్భాగ్యంగా ఆ సేవ చేస్తాడు. ఇది కావాలి ఇది వద్దు అని లేదు. అమ్మ ఏది ఇస్తే దానిని అనుగ్రహంగా భావిస్తాడు. అందుకే అమ్మ విశ్వరూప సందర్శనాన్ని ఆయనకు ప్రసాదించింది. నాకెందుకు ఇచ్చావమ్మా ఈ అనుభవం అంటే నేను ఇవ్వాలనుకున్నాను. ఇచ్చాను అన్నది. అకారణ కరుణామయి అయిన అమ్మ అనుగ్రహం ప్రసరించిన అదృష్టవంతుడు గోపాలన్నయ్య.

గోపాలన్నయ్యలో అమ్మ సందేశం దిగ్దిగంతాల దాకా వ్యాపించాలని ఎంత తపనో! అమ్మ సినిమా తీసాడు. పూర్వం మాతృశ్రీ మాస పత్రికకు, ఇప్పుడు విశ్వజనని మాసపత్రికకు మేనేజింగ్ ఎడిటర్‌గా 78 ఏళ్ళ వయసులోనూ, నిర్విరామంగా శ్రమిస్తూనే ఉన్నాడు. ఈనాడు సంస్థకు సంబంధించి ఏ చారిత్రకాంశములో అనుమానం వచ్చినా తీర్చగల సమర్థుడు గోపాలన్నయే.

గోపాలన్నయ్య చెబితే తప్ప ఇతరులకు తెలియని ఎన్నో అంశాలు ఈ గ్రంథంలో చోటు చేసుకున్నాయి. భవిష్యత్ తరాల వారికి ఈ గ్రంథంలోని విషయాలు ఎంతో అవసరం.

గోపాలన్నయ్యకు నిత్యం అమ్మ సుప్రభాతం చేసే అలవాటు. ఎప్పుడైన అన్నయ్య పాల్గొనకపోతే ఈరోజు సుప్రభాతం చేసినట్లు లేదురా! అనేది అమ్మ. తిరిగి తిరిగి వచ్చిన గోపాలన్నయ్య కాళ్లలో ఎన్ని సీసపు పెంకులు, ఫారెన్ ముళ్ళు దిగాయో కాని అమ్మ అరచేతితో ఆయన అరికాళ్ళు రాస్తుంటే ఆ నొప్పి ఏమైపోయ్యేదో! ఆ ముళ్ళు ఆ పెంకులు ఏమై పోయేవో.. ఎంత అదృష్ట వంతుడు. అమ్మకు మనము సరెండర్ కావడం కాదు. ఇది అమ్మ తన బిడ్డలకు సరెండర్ కావడము. ఇటువంటి ఎన్ని సత్యాలు మన కళ్లకు కట్టించాడో..

"మూకం కరోతి వాచాలమ్ పంగుం లంఘయతే గిరిం

యత్కృపా తమహం వందే పరమానంద 'మాధవం' ".

అనే శ్లోకం ఒకటి ఉన్నది. మాధవం అనేచోట మాతరం అని మార్చి చదువుతుంటాము. అయితే మనం యమదూతలు, అమ్మదూతలు కాకపోతే కదా! అన్న అమ్మమాటలు గుర్తుకు వస్తుంటాయి. నిజమే మాధవుడు మాధవి అమ్మ కాకపోతే కదా! ఏమైనా సాహిత్యం తెలియని అతి సామాన్యుడైన గోపాలన్నయ్య మహాద్భుతమైన ఈ వ్యాసాలు వ్రాయడమేమిటి? ఆశ్చర్యం కలిగించే అంశమే. అయినా అమ్మ వ్రాయించింది. చేతులు గోపాలన్నయ్యవి. చేతలు అమ్మవి.

ఈగ్రంథం ఇలా వెలుగు చూడటానికి సహకరించిన గోపాలన్నయ్యకు, వారి కుటుంబ సభ్యులకు ఈ గ్రంథాన్ని శ్రీవిశ్వజననీపరిషత్ పక్షాన ప్రచురించాలని కోరిన శ్రీ పి.యస్.ఆర్. ఆంజనేయప్రసాద్‌కు అంగీకరించిన కార్యవర్గ సభ్యులకు కృతజ్ఞతలు తెలుపుతూ ........

**- శ్రీ విశ్వజననీ పరిషత్,**

**జిల్లెళ్ళమూడి**

# ప్రేరణ

"అమ్మ సన్నిధిలో నా అనుభవాలు - జ్ఞాపకాలు" అన్న ఈ గ్రంథాన్ని తీసుకు రావటానికి, ఈ ఆర్టికల్సు ధారావాహికంగా "విశ్వజనని" మాసపత్రికలో ప్రచురించటానికి, అసలు ఈ ఆర్టికల్సు వ్రాయటానికి అవసరం ఏమి కలిగింది? అని కొంతమంది మన సోదరులకు అనిపించవచ్చు. ఇది యాదృచ్ఛికంగా జరిగిందే. దీనికి ప్రేరణ అమ్మదే. ఒక్క ప్రేరణే కాదు. నేను 60-70 దశకాలలో అమ్మ సన్నిధిలో ఉంటున్న సమయములో నాకు అప్పట్లో జరిగిన ప్రతిఅనుభవము అమ్మతోనే చెప్తూతూ వుండేవాడిని. అవి అనేక రకాలు. అవి భౌతికం కావచ్చును, ఆధ్యాత్మికం కావచ్చును. అమ్మ ఏమి అనుభవం, అనుభూతి ఇస్తే అది పొందేవాడిని. అంతేకాదు. కొన్ని అనుభవాలు ఇవి నాకెందుకిచ్చావు ? అమ్మా? అని అడిగితే "ఏమో ఇవ్వాలని అనుకున్నాను. ఇచ్చాను" అని అమ్మ పలకటం అమ్మ నాకిచ్చిన పెద్ద అదృష్టం. అనుభవాలు అనేకం అనేకులకు ఇవ్వవచ్చును. కాని అమ్మ వాటిని నేనిచ్చాను అని మనసా వాచా పలకటం నేను వినలేదు. ఒక రోజు "నాన్నా ! నీవు నీ అనుభవాలు వ్రాయి" అన్నది. "అమ్మా ! నాకు అనుభవాలు ఇచ్చావు. కాని పెన్ ఇవ్వలేదు" అని అన్నాను. "నాకు భాషరాదు ఎట్లా రాసేది" అని కూడా అన్నాను. అమ్మ, "నాన్నా! నీవు ఒక టేపురికార్డర్ తీసికొని దానికి డిక్టేట్ చెయ్యి. కావలసిన వాళ్ళు, వాళ్ళే తీసుకుంటారు" అన్నది. "భాషరాదుగా" అని మరల అన్నాను. "దీనికి భాష అక్కరలేదు నీకొచ్చిన భాషతోనే నీ భావాన్ని వ్యక్తీకరించు. ఇక్కడ భావం ముఖ్యం కాని భాషకాదు" అన్నది. సరే ఒక ముహూర్తంలో అమ్మ చెప్పింది కదా అని టేప్‌రికార్డర్ తీసికొని చెప్పటం మొదలు పెట్టాను. 60 నిమిషాలు టేప్ తిరుగుతూనే ఉన్నది. నోటినుండి మాటలేదు. అంతా బ్లాంక్. ఆ ప్రయత్నం మానేశాను. ఒకరోజు విశాఖపట్నం నుండి కుసుమక్కయ్య మా ఇంటికొచ్చి "అన్నయ్యా! నీ అనుభవాలు కొన్ని చెప్పవా ? నేను పుస్తకాలుగా తెస్తున్నాను" అన్నది. కొన్ని చెప్పాను. తర్వాత నేను నా కొచ్చిన భాషతో భావాలు కాగితం మీద నేనే వ్రాయటం మొదలు పెట్టాను. అవి నా ఆత్మీయ సోదరుడు విశ్వజనని సంపాదకుడు అయిన పి.యస్.ఆర్. ఆంజనేయప్రసాద్ విశ్వజననిలో ధారావాహినిగా తీసుకొని రావటం మొదలుపెట్టాడు. వ్రాసేటప్పుడు అట్లా అని

వ్రాయలేదు. కాని అట్లాగే జరిగింది. ఇప్పుడు అవి 60కి పైగా ప్రచురించటం ఇంకా కొన్ని, పబ్లిష్ కాని ఆర్టికల్స్ కూడా కలిపి ఈ పుస్తకంగా తీసుకొని రావాలనే ఆకాంక్ష. పి.యస్.ఆర్, మా పెద్దబ్బాయి లక్ష్మీప్రసాద్‌కు తెలియచేశాడు. మావాడు మా కుటుంబ సభ్యులను సంప్రదించి ఆ పుస్తకానికి ప్రింటింగ్ ఖర్చు, మేమే భరించగలమనీ, దానిని శ్రీ విశ్వజనని పరిషత్ వారు వారి సొంత ప్రచురణగా తీసుకొని వస్తే బాగుంటుందేమో అని చెప్పటం, పి.యస్.ఆర్. మా ఇ.సి. మీటింగ్‌లో ప్రస్తావించి దానికి అనుమతి పొందటం జరిగిపోయింది. ఈ పత్రికలలో వచ్చిన ఆర్టికల్సు చదివిన మా సోదరులైన పాఠకులు ఎప్పటికప్పుడు నన్ను ఆదరించటం, ఉత్సాహపరచటం అమ్మ దగ్గరకు మమ్ములను నీవు తీసుకొని పోతున్నట్లు మేము భావిస్తున్నాము అన్నప్పుడు అమ్మ ప్రేరణకు కారణం ఏమిటో తెలిసింది.

ఈ పుస్తకాన్ని అన్ని విధాలుగా ఆకర్షణీయంగా, సుందరంగా తీసుకొని వచ్చిన మా కుటుంబసభ్యులకు, దానికి కారకులైన నా ఆత్మీయ సోదరుడు పి.యస్.ఆర్.కు, శ్రీ విశ్వజననీపరిషత్ కార్యకర్తలకు, పాఠకులకు, అభిమానులకు, సదా తన ప్రేమ, దివ్య ఆశీస్సులను అందజేయాలని అమ్మను ప్రార్థిస్తున్నాను.

**కె.బి.జి.కృష్ణమూర్తి**

# విషయసూచిక

# మధుకోశము

డాక్టర్ పన్నాల రాధాకృష్ణశర్మ

"అమ్మ సన్నిధిలో నా అనుభవాలు - జ్ఞాపకాలు" అన్న గ్రంథమును ఆ మూలాగ్రం చదివాను. సుమారు 45 సంవత్సరాలకు ముందు అమ్మ సన్నిధిలో అనుభవించిన మధుర సన్నివేశాలను రచయిత గుర్తుకు తెచ్చి ఎంతో సంతోషమును కలిగించారు. ఆయన అనుభవాలలో కొన్నిటికి నాకు గల్గిన అనుభవాలతో సామ్యం ఉండటంవలన నాకు పరమానందం కలిగింది.

ఈ గ్రంథంలో కొన్నివ్యాసాలు ఆపాతమధురాలు, మరికొన్ని ఆలోచనామృతాలు ఆలోచనామృతాలలో కొన్నిటిని సంగ్రహంగా విన్నవిస్తాను.

1. అందరికీ సుగతే, 2. అహంబ్రహ్మోస్మి, 3. జన్మ ఒక్కటే, 4. ఇంతకీ నేనెవరు, 5. ఆత్మసందర్శనము.

మొదటి దానిలో "నేను నేనైన నేను అన్ని నేనులు నేనైననేను" - అన్నది అమ్మ సూక్తులలో తలమానికమయినది. ఇది పరిపూర్ణమయిన అద్వైతమునకు ఆదర్శమనవచ్చు. భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు -

"అహమాత్మాగుడాకేశ। సర్వభూతాశయస్థితః" - అని చెప్పిన వాక్యభావం పయిసూక్తిలో స్ఫురిస్తుంది. "అర్జునా! నేను సర్వభూత హృదయము లందు ఆత్మగా ఉన్నాను" - అని పయి శ్లోకార్థము యొక్క భావము. "ఈ సర్వసృష్టి చేతనము - అచేతనము పరబ్రహ్మస్వరూపమే "ఈ సూక్తి' సర్వం ఖల్విదంబ్రహ్మ -అను మహావాక్యమును, "చిచ్ఛక్తి శ్చేతనారూపా జడశక్తిర్జడాత్మికా" - అన్న లలితా నామములను తలపింపజేస్తున్నది. 'అందరికీ సుగతే' - అన్నవ్యాసమును సావధానంగా పరిశీలిస్తే శ్రీ గౌడపాదుల 'అజాతవాదము' తప్పక స్ఫురిస్తుంది.

రెండవదయిన **'అహంబ్రహ్మోస్మి'** అనే వ్యాసం మొదటిదానికి వివరణ అనిపిస్తుంది. ఈ వ్యాసమును చదువుతుంటే - "సత్యపి భేదా పగమే నాథ! తవాహం నమామకెనస్త్వమ్' సాముద్రోహి తరంగః క్వచన సముద్రో న తారంగః అను శ్రీశంకర భగవత్పాదకృత 'షట్పదీ' స్తోత్రంలోని శ్లోకం గర్తుకు వస్తుంది.

మూడవదయిన 'జన్మ ఒక్కటే' - అన్నవ్యాసంలోని "నేను నేనైన నేను - అన్ని నేనులు నేనైననేను" - అనే సత్యమయిన నేనులో అన్ని నేనులు లీనమయి మిగిలేది ఒక్క 'నేను' మాత్రమే. అదే 'పరమాత్మ, పరంజ్యోతి, పరంధామం', అను విషయమును అనుభవపూర్వకంగా తెలిసికొనటమే అసలు జన్మ. ఆ జన్మ ఒక్కటే. మనము చూచే మిగిలిన జన్మలు అన్నియు 'అహంకార' జన్మలే.

నాల్గవదయిన 'ఇంతకీ నేనెవరు?' అన్న వ్యాసం శ్రీభగవద్రమణ మహర్షి ప్రవచించిన 'నేనెవరు?' - అను విచారమార్గమునకు అద్దం పడుతున్నది.

ఇక అయిదవదయిన 'ఆత్మ సందర్శనము' - అనే వ్యాసం పరిమాణంలో చిన్నదయినా భావంలో అపారమయినది. ఆత్మ నామ - రూప రహితము, జ్ఞానమయము గనుక ఆత్మ సందర్శనమనగా జ్ఞానంకావటమే, అనగా ఆత్మగా ఉండటమే అని మహర్షి వివరించారు.

ఈ గ్రంథమును చదువుతుంటే శ్రీ గోపాలకృష్ణమూర్తిగారు అమ్మను జగన్మాతగా భావించి ఆమెకు సర్వాత్మనా శరణాగతి చేసిన విషయం విస్పష్టంగా గోచరిస్తుంది. ఆయన జీవితం ధన్యం!

"యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్ ।

మమవర్త్మాను వర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః" - అన్న శ్రీకృష్ణ బగవానుని వాక్యం ఈయనపట్ల సార్థకమయింది.

"స్వైరం గృహీతవనితా ఽ వపుషా ఽ ప్రమేయా
భూయాకృతిః పరచితి ర్ధరణీతలేఽ స్మిన్ ।
మాయావిలాసమభినీయ చ యా స్వధామ్ని
లీనా సదా భవతు సా జగతో హితాయ ॥ (స్వీయము)



# అందరి అన్నయ్య

శ్రీ మన్నవ బుచ్చిరాజుశర్మ(రాజుబావ)

శ్రీ కొండముది గోపాలకృష్ణమూర్తి - ఈ పేరుతో ఎవ్వరూ పిలవరు. చాలామంది ఈ పేరు చెపితే కొంచెం ఆలోచించి గోపాలన్నయ్యగారూ! అంటారు. అవును ఇది నిజం. ఆపేరుతోనే ఆయన ప్రసిద్ధుడైనాడు. ఆయన ఆగష్టు 15, 1960వ సంవత్సరంలో అమ్మదగ్గరకు జిల్లెళ్ళమూడి వచ్చాడు. తర్వాత అప్పుడప్పుడు వచ్చాడు. తర్వాత జిల్లెళ్ళమూడిలోనే స్థిరంగా ఉన్నాడు. ఉన్నాడు అనే బదులు అమ్మ రప్పించుకుంది, దగ్గరే ఉండటానికి అవకాశాన్ని అనుగ్రహించింది అంటే బాగుంటుంది.

అమ్మకు ఆయనమీద ఎందుకంత వాత్సల్యం? అమ్మకు చిన్నతనంలోనే తల్లిచనిపోయింది. గోపాలన్నయ్యకూ అంతే. అమ్మ పినతల్లి అనురాగంలో పెరిగింది. గోపాలన్నయ్యకూ అంతే. అపవాదులు, నీలాపనిందలు, అమ్మ అనుభవించినట్లే, గోపాలన్నయ్య కూడా అనుభవించాడు. అన్నిటికీ మించి అమ్మకు ఉన్నది సహజసహనమైతే, గోపాలన్నయ్యకు కూడా సహనంపాలు ఎక్కువే! ఇన్ని పోలికలు ఉన్న అన్నయ్య అమ్మదగ్గర ఉండటంలో ఆశ్చర్యమేముంది.

అయితే ఏమిటి? అని మీరు అడగవచ్చు. ఆ విషయానికే వస్తున్నా. ఈయన ఒక పుస్తకం వ్రాశాడు. "అమ్మ సన్నిధిలో నా అనుభవాలు - జ్ఞాపకాలు" ఈయన 'విశ్వజనని' మాస పత్రికలో ప్రచురించిన వ్యాసాలు ప్రస్తుతానికి 72 అనుభవాలు, జ్ఞాపకాలు, అన్నిటిని గుదిగుచ్చి ఈ పుస్తక రూపంలో వెలుగులోకి తెచ్చాడు. మిగతా 36 తెచ్చి అష్టోత్తర శతం చేయాలని ఆకాంక్షిస్తున్నాను.

ఇందులో అమ్మ మహిమలు, సర్వజనీనమైన నిత్య సత్యాలు, జిజ్ఞాసులను, ఆలోచింపచేసే అమ్మ మాటల ముత్యాలు, వివరణలు మనకు దర్శనమిస్తాయి. గోపాలన్నయ్య ఎంత అదృష్టవంతుడంటే ఆయనకు అమ్మ కలలో పాలు యిచ్చింది. విచిత్రమేమంటే మెలుకువవచ్చిన తర్వాత ఆయన నోరు అంతా పాలవాసన. అంటే వాస్తవంగా ఇచ్చినట్లు కాదా? జ్ఞాపకాల విషయంలో గోపాలన్నయ్య ఎన్నో అద్భుతమైన విషయాలు మనముందు ఉంచుతాడు. హైమ మహాసమాధి అయిన

కొద్దిరోజులకు అమ్మ జన్మదినం రావటం. ఆ రోజే ఒక గ్రంథావిష్కరణ కార్యక్రమం జరగటం. అమ్మ ద్వంద్వాతీత స్థితి వివరిస్తాడు. "అమ్మ పెట్టిన గోరుముద్దలు" వ్యాసంలో, అమ్మ వీరిచేత అన్నం తినిపించిన వివరణ చదివినప్పుడు అమ్మ 1956 లో మూడు పూటలు తినే అన్నం ఒకేసారి నాచే తినిపించిన సంగతి గుర్తుకుతెచ్చి నన్ను ఆ రోజుల్లో అమ్మ సన్నిధిలోకి తీసుకు వెళ్ళింది. ఎంత సారూప్య సంఘటన!

ఈ జ్ఞాపకాలు అనుభవాలు ఆయనవి. వాటిని గురించి ఆయనే ఈ పుస్తకంలో వివరంగా వ్రాశాడు. అందులో ఉన్న వాటి గురించి నేను చెప్పటమేమిటి? ఇవి, అందరూ తప్పక చదవాల్సిన పుస్తకం. మీరూ చదవండి. జన్మ ధన్యం అవుతుంది.

ఏమైనా దాదాపు 25 సంవత్సరాలు అమ్మకు దగ్గరగా ఉండి, ఆరాధించి, అమ్మ స్పర్శచేత శరీరాన్ని పునీతం చేసుకొని, అమ్మ వాత్సల్య జలధిలో పుణ్యస్నానాలుచేసిన అదృష్టమూర్తి ఈ గోపాలకృష్ణమూర్తి. ఆయనతో నా అనుబంధం కొద్దికాలమే అయినా ఎల్లవేళలా గుర్తుండేదే. వయసులో చిన్నవాడైనందున ఆశీర్వదిస్తున్నా. కానీ జ్ఞానంలో పెద్దవాడైనందున వందనీయుడు కూడా.





గోపాలన్నయ్యను సత్కరిస్తున్న శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయప్రసాద్



మనుమరాళ్ళు, మనుమళ్ళతో 'అమ్మ'



అమ్మ పెద్ద కుమారుడు శ్రీబ్రహ్మాండం సుబ్బారావు కుటుంబము



అమ్మ రెండవకుమారుడు శ్రీ బ్రహ్మాండం రవీంద్రరావు కుటుంబము



కొడుకులు, కోడళ్ళు, మనుమలు, మనుమరాళ్ళతో అమ్మ

మాతృశ్రీ మెడికల్ సెంటర్‌లో గోపాలన్నయ్యను పరీక్షిస్తున్న అమ్మ

# సుప్రభాతము

అది యొక స్వర్ణయుగం. అమ్మ దర్శనం కోసం, స్పర్శ కోసం గాలివాన కాని వరదలు కాని లెక్కచేయకుండా కళ్ళు పొడుచుకున్నా కానరాని చీకటిలో, ముళ్ళల్లో, పొదల్లో పడి రాత్రి పూట కూడా అమ్మ దగ్గరకు ఏట్లాగైనా పోవాలని నడిచిపోయే రోజులవి. జిల్లెళ్ళమూడి వెళ్లగానే ఆ రోజుల్లో అమ్మ నివసించే పర్ణ కుటీరం ముందున్న బావి దగ్గర కాళ్ళు కడుక్కొని లోపలికి వెళ్ళి అమ్మని దర్శించగానే "నాన్నా! నీ కోసమే ఎదురుచూస్తున్నానన్న" అమ్మ పలుకులకు పడిన శ్రమంతా ఏమైందో, అమ్మకోసం పడిన ఆతృతంతా ఏమైందో, స్వస్థత తీరి అమ్మ మంచం దగ్గర కూర్చున్నాను. "నాన్నా! నీ అరికాళ్ళేవి" అని అమ్మ మంచం మీద నుండి వంగి నా పాదాలు పట్టుకొని పైకి లేపి తన అరచేతితో నా అరికాళ్ళను రాయటం ప్రారంభించింది. "అబ్బ కాళ్ళలో ఎన్ని ముళ్ళురా? ఈ సీసం పెంకులేమిటిరా" అని అరికాళ్ళు రాస్తుంటే తెల్లవార్లు అమ్మ సేవలో గడిపి మళ్ళా పొద్దున్నే బాపట్ల నడిచిపోయేవాడిని. ఆ ముళ్ళు ఏమైనవో, సీసం పెంకులేమైనవో అమ్మకే తెలియాలి. క్రిందటిసారి తెలియచేసినట్లుగా మా సోదరుడు కొండముది రామకృష్ణ, నేను వంతులువారిగా వచ్చిన రోజుల్లో అమ్మకు సేవ చేయటంలో నాది రాత్రి వంతు. తెల్లవార్లు అమ్మకు ఒక చేతితో నడుం రాస్తూ, ఒక చేతితో విసనకర్ర పెట్టి విసురుతూ కూర్చొనేవాణ్ణి. ఈ రెండింటిలో ఏది ఆగినా అమ్మ లేస్తుంది. కనుక రెండు చేతులు ఆపటానికి వీలు లేదు. రాత్రిళ్ళు, అమ్మను నాన్నగారితో సహా ఎవరు డిస్టబ్ చెయ్యకుండా అమ్మకు పూర్తి విశ్రాంతిని కల్పించాలనేది నా ఆశయం.

అది వేసవి కాలం. అమ్మ అప్పుడుండే పూరింట్లో బయటి వరండాలో మంచం మీద రాత్రిళ్ళు పడుకొనేది. నేను తెల్లవార్లూ అమ్మకు ఎటెండ్ అయి తెల్లవారుఝామున మంచం క్రింద ప్రక్కగా పడుకొనేవాడిని. ప్రతిరోజు ఉదయం గం. 5-40 ని॥లకు ఆవరణలో నున్న సోదరీ సోదరులెల్లరు సుప్రభాత సేవలో పాల్గొనేవారు. అమ్మ ప్రక్కనే అప్పుడే పడుకొన్న నన్ను, సుప్రభాతం టైమ్ అయింది లెమ్మని లేపేది. లేచి ముఖం కడుక్కొని సుప్రభాతంలో అందరితో పాల్గొనేవాడిని. ఇది రోజూ జరుగుతున్న విషయం. ఒకరోజున తెల్లవారు ఝామున గం. 4-30 ని॥లకు సుప్రభాతానికి ఎవరు రాలేదు. ఏమిటా ఎవరు రాలేదని మెల్లగా అమ్మ

పొట్టపైనా చెవిని ఆనించి పడుకున్నాను. ఆ పొట్టలో నుంచి సుప్రభాతం వినపడ్తున్నది. చెవిని పైకి లేపాను. సుప్రభాతం వినపడుట లేదు. మరల చెవిని ఆనించాను. సుప్రభాతం వినపడ్తున్నది. లేచి కూర్చున్నాను. అంతా నిశ్శబ్దంగా యున్నది. మరల పొట్ట నుండి సుప్రభాతం వింటున్నాను. వింతగా ఆవరణలో ఉన్న సోదరీ సోదరుల గొంతులన్ని వినపడుతున్నై. ఈ వింతను ఆలకిస్తున్న అమ్మ మంచం ప్రక్కగా కూర్చున్నాను. ఇంతలో పిల్లలందరు వచ్చి వరసగా నుల్చుని అమ్మపాదాలకు నమస్కరించి వెళ్తున్నారు. అప్పుడు నేను ఏమిటి మీరందరు సుప్రభాతానికి రాలేదని అడిగాను. అప్పుడు రుక్మిణమ్మ అక్కయ్య ఆధ్వర్యంలో పొలం పనులు, బిల్డింగ్ కట్టడాలు అన్నీ మన పిల్లలే చేస్తుండేవాళ్ళు, "మేమంతా పొలంలో సుప్రభాతం చేసి వస్తున్నామన్నయ్యా" అని అన్నారు. "అయితే నేను విన్నాలే" అన్నాను. "ఎట్లా విన్నావు" అని అడిగారు. అప్పటి దాకా పడుకున్న అమ్మ తన పొట్ట చూపిస్తూ "ఇక్కడ నుండి" అని అన్నది. అప్పుడు ఆ ఉదంతం అంతా వాళ్ళకు వివరంగా చెప్పాను. అందరూ ఆనందించారు. అంటే మనం ఎక్కడ నుంచి సుప్రభాతం చేసినా, సంధ్యా వందనం చేసినా, అమ్మ నామం చేసినా అమ్మకు చేరుతున్నాయన్న మాట. అమ్మ తన పర్ణకుటీరం నుండి అందరింటి పైకి వాత్సల్యాలయానికి వెళ్ళిన తర్వాత కూడా నేను అమ్మ ప్రక్కన పడుకుంటే సుప్రభాతం టైమ్ అయిందని నన్ను లేపేది. ఒకవేళ క్రింద నాన్న గారింట్లో పడుకొంటే టైమ్ అయిందని నన్ను లేపమన్నారని పిల్లలు వచ్చి లేపిపోయేవారు. ఒక్కొక్కరోజు నేను ఊర్లో లేకపోతే ఒరే నీవు సుప్రభాతంకు లేకపోతే సుప్రభాతం చేసినట్లే లేదురా! అని అనేది. ఇప్పుడు సుప్రభాతం మనం అమ్మకు అంటే భగవంతునికి చేసినట్లా ? లేక నిద్రాణమైన మనని భగవంతుడు లేపినట్లా !

*– జనవరి, 2004*



# తల్లిపాలు

ఒకప్పుడు నాకు కడుపులో ఏమీ ఇమిడేది కాదు. అల్సరేషన్ వల్లనో మరేమిటో? తెలియదు. అన్నం తింటే వాంతులయ్యేవి. ఏ ఆహారము లోపలికి పోయేది కాదు. బలవంతాన తింటే అంతా వాంతి అయి బయటకు వచ్చేది. అమ్మ "పాలు త్రాగరా!" అన్నది. పాలు త్రాగటం మొదలు పెట్టాను. ఎక్కడకు వెళ్ళినా పాలు త్రాగడమే. నేను సంస్థ పని మీద మద్రాసు వెళ్ళాల్సి వచ్చింది. అమ్మ "నేను పాలిస్తాను రారా!" అన్నది. అమ్మ చుట్టూ జనం ఉన్నారు. అమ్మకు బిడ్డ ఆకలి ప్రధానం గాని ఇంకేవీ పట్టవు. నేనేమో పసిపిల్లవాడిని కాదు కదా! అమ్మ వద్ద పాలు త్రాగడానికి. నా పెద్దరికం నాకు అడ్డం. ఏం చేసేది అమ్మకు నమస్కరించుకుని బయలుదేరాను. బాపట్ల ప్రెస్ దగ్గరకు వెళ్లాను. అక్కడకు వెళ్ళింతర్వాత "అరెరె! పాల ఫ్లాస్కు తెచ్చుకోలేదే మరచిపోయానే" అనుకున్నాను. ట్రైన్ వచ్చింది మద్రాసు రైలు ఎక్కాను. ఇంతలో ప్రెస్ వద్దకు ఒక కారు వచ్చింది. బహుశా అమ్మ వచ్చిందేమో అనుకున్నాను. రైలు కదిలింది. ఆ కారు చీరాల దాకా రైలును వెంబడించి ఆ తరువాత కనుమరుగైంది. చీరాల దాటింతర్వాత నాకు కేటాయించిన బెర్త్‌మీద నేను పడుకున్నాను. నిద్రపట్టింది.

అమ్మ నావద్ద పడుకున్నది. నాకు పాలిస్తున్నది. అమ్మ దర్శనము స్పర్శనము స్పష్టంగా తెలుస్తున్నది. గూడూరు చేరేటప్పటికి నాకు మెలుకువ వచ్చింది. క్రిందకు దిగాను. నోరంతా పాల వాసన - పాలమయం. గూడూరు నుండి మద్రాసు వెళ్ళేదాకా అమ్మ ఆలోచనే అన్ని గంటలు నిలబడి ఉన్నాననే విషయం కూడా అప్పుడు తెలియలేదు నేనీ లోకంలోకి వచ్చేదాకా. మనమంతా అమ్మ పాలిటి వాళ్ళమే. అయినా, అమ్మ నాకు పాలిచ్చింది. ఆ అమృతం త్రాగి అమరుడనైనానేమో! లక్ష్మీకాంత యోగికి మాలపిచ్చమ్మ ఇచ్చినట్లుగా ఎప్పుడో చదివాను ఆంధ్రమహాభక్త విజయంలో. ప్రత్యక్షంగా నేను అనుభవించాను. నేను జిల్లెళ్ళమూడి వెళ్ళింతర్వాత ఆ ఆలాపనలోనే అమ్మ "పాలు తీసుకోకుండా వెళ్ళావు కదురా?" అన్నది. "నీవు ఇచ్చావు కదమ్మా అన్నాను" అమ్మ నా శరీరాన్ని నిమిరింది. అంతే మనమంత తల్లిపాలి వాళ్ళమే కదా!

**- ఫిబ్రవరి, *2003***

# అమ్మా! నిన్ను శ్రీశైలంలో చూశాము

1968కి పూర్వం ఒక ముస్లిం కుర్రవాడు ఖమ్మం నుండి జిల్లెళ్ళమూడికి అమ్మను దర్శించడానికి వచ్చేవాడు. ఒకసారి అమ్మ వద్దకు వచ్చి నమస్కారం చేసుకొని కూర్చున్నాడు. అమ్మ "ఏమిటి నాన్నా! అంత చిక్కిపోయావు" అని అడిగింది. "ప్రాణాయామం చేస్తున్నానమ్మా! అందుకే చిక్కిపోయాను" అన్నాడు. "అయితే ఆ ప్రాణాయామం మానుకో నాన్నా!" అన్నది అమ్మ. "గురువు గారికి చెప్పి ఆపాలి లేకపోతే వారు ఊరుకోరు" అన్నాడు. "మీ గురువుగారికి నేను చెప్పానని చెప్పు నాన్నా! నీవు చేసే ప్రాణాయామం వల్ల ఏ స్థితివస్తుందో అది నేనిస్తానన్నాని చెప్పు. మూడుపూటలా భోజనం చేసి చక్కగా విశ్రాంతి తీసుకో" అని అమ్మ చెప్పింది. అలాగే గురువుగారికి చెప్పాడు ఆ ముస్లిం యువకుడు. గురువుగారు "సరే అమ్మ చెప్పినట్లే చెయ్యి" అన్నాడు. చక్కగా భోజనం చేస్తూ విశ్రాంతి తీసుకున్నాడా కుర్రాడు. ఎక్కడ ప్రాణం పోతుందో అనే స్థితిలో ఉన్నవాడు బాగా ఆరోగ్యంగా తయారయ్యాడు. అమ్మ ప్రాణదానం చేసిందని అందరికీ చెప్పుకున్నాడు.

ఒకసారి వాళ్ళ బంధువులందరితో కలిసి శ్రీశైలం వెళ్ళాడు. అక్కడ ఒక చెట్టు క్రింద అరుగుమీద కూర్చున్న అమ్మను వాళ్ళ బంధువులకు చూపించి ఈ అమ్మ నాకు ప్రాణదానం చేసింది అని చెప్పాడు. అందరూ అమ్మకు నమస్కారాలు చేసి తీర్థప్రసాదాలు స్వీకరించారు.

తర్వాత కొంతకాలానికి అదే బంధువులతో కలిసి జిల్లెళ్ళమూడి వచ్చాడు అమ్మ వద్దకు. "శ్రీశైలంలో చూచిన తర్వాత ఇదేనమ్మా నిన్ను చూడటానికి రావటం మళ్ళీ వీలుపడలేదు ఇంతకాలం" అని చెప్పాడు.

"శ్రీశైలంలో చూడటమేమిటి నాన్నా!" అన్నది అమ్మ. "అవునమ్మా నేనేకాదు మా బంధువులంతా చూశారు నిన్ను. తీర్థప్రసాదములు కూడా తీసుకున్నారు నీ వద్ద" అన్నాడు. వాళ్ళ బంధువులందరూ కూడా "అవునమ్మా నిన్నక్కడ చూశాం" అన్నారు. అప్పుడు అమ్మ "నేను శ్రీశైలం వెళ్ళలేదు నాన్నా! ఇక్కడ వాళ్ళనడుగు నేను శ్రీశైలం వెళ్ళానేమో!" అన్నది. అమ్మ దగ్గర ఉండేవాళ్ళు అమ్మ శ్రీశైలం ఎప్పుడూ వెళ్ళలేదన్నారు.

అపుడా ముస్లిం యువకుడు "అమ్మా నిన్ను శ్రీశైలంలో మేము చూచింది నిజం. వీళ్ళు చెప్పినదాన్ని బట్టి నీవు ఇక్కడ ఉన్నదీ నిజం. నిజానికే నీవు నిజం. నిన్ను అమ్మగా పొందగలిగిన మా అదృష్టం నిజం. ఇంతకన్నా ఏంకావాలి మాకు" అన్నాడు. అమ్మ "అన్నపూర్ణాలయానికి వెళ్ళి అన్నంతిని రండి నాన్నా! అంతకన్నా కావాల్సిందేముంది" అన్నది.

**– అక్టోబర్, 2002**



# జగన్మాత - జగద్గురువు

నేను బాపట్లలో 1955 నుండి 1968 వరకు బుక్‌షాప్ నడుపుతుండేవాడిని. ఆ వ్యాపార నిమిత్తం తరుచూ మద్రాసు వెళ్ళడం జరిగేది. అప్పటికే అంటే 1960 నుండి జిల్లెళ్ళమూడికి “అమ్మను” చూడడానికి వెళ్ళటం, అమ్మతో సాన్నిహిత్యం ఏర్పడింది. అమ్మ దగ్గరకు వెళ్ళిన సందర్భంలో ఒకసారి – “నడయాడే దైవం”గా ప్రసిద్ధిగాంచిన, మహా మహిమాన్విత వ్యక్తిగా కొనియాడబడుతున్న శ్రీశ్రీశ్రీ పరమహంస, పరివ్రాజకాచార్య, కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖర సరస్వతీ స్వాముల వారి వద్ద నుండి వచ్చిన భక్తులు రావడం జరిగింది. మాటల సందర్భంగా వారు – శ్రీ స్వామి వారు అమ్మను గూర్చి ప్రస్తావించినట్లు, యోగక్షేమాలు అడిగినట్లు చెప్పారు. “అమ్మ”ను చూచినతర్వాత – ఇతర దర్శనీయ స్థలాలకు గానీ, ఏ ఇతర ప్రసిద్ధి గాంచిన వ్యక్తులను గానీ దర్శించే అలవాటు లేని నాకు – ఈ సంభాషణానంతరం ఒకసారి శ్రీ స్వాముల వారిని దర్శించవలెనని అభిలాష కలిగింది. అందుకు “అమ్మ” కూడా సమ్మతించి, చూచి రమ్మని ప్రోత్సహించింది.

వ్యాపార నిమిత్తమై, 1964లో మద్రాసు వెళ్ళినప్పుడు మా సోదరుడు కొండముది దత్తాత్రేయ శర్మ ఇంటికి వెళ్ళటం జరిగింది. వాళ్ళు మైలాపూర్‌లోని ఈస్ట్ మేడాస్ట్రేట్‌లో వుంటూ, ఎస్సో పెట్రోల్ బంక్ నడుపుతుండేవాడు. ఆ రోజు ఉదయం వారితో మాటల సందర్భంలో కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాముల వారిని కంచి కెళ్ళి చూచి రావాలని వుందని చెప్పాను. ఆ తర్వాత నా పనుల నిమిత్తం వెళ్ళి సాయంత్రం ఇంటికి వచ్చిన పిదప మా మరదలు, మేనకోడలు అయిన శ్రీమతి లలిత – శ్రీ స్వామి వారు ప్రస్తుతం వారి ఇంటి వెనుక వీధిలో గల ఆర్.ఆర్. సభలో విచ్చేసి వున్నారని, కనుక వారిని ఇక్కడే దర్శించవచ్చని చెప్పింది. అది విన్న వెంటనే శ్రీ స్వామి వారిని చూడాలని వెళ్ళడం జరిగింది.

ఇక అక్కడ, ఆ సభా ప్రాంగణంలో శ్రీ స్వామి వారు వేదికపై ఉన్నారు. వేదికకు ముందు భాగాన ఒక తెర వేయబడి వుంది. అందుచేత వారిని దర్శించటం వీలు కాలేదు. వారిని ఎలాగైనా చూడాలనే తలంపుతో నేను ఆ వేదికకు

సమీపంలో నిలిచి ఉన్నాను. కొద్దిసేపైన తర్వాత అక్కడ వున్న వారిలో ఇద్దరు నాకు చెరొక వైపు చేరి నా చేతులు చెరి ఒకరు పుచ్చుకొని చైనులాగా నిలబడటం, ఇంతలో తెరతొలగి శ్రీ స్వామి వారు రావడం జరిగింది. బయటకు వచ్చిన స్వాముల వారు నడుస్తూ ముందుకు సాగుతుండగా, నన్ను చేయి పట్టుకున్న వారు కూడా చైనులా నడవడం – అలా సాగుతున్న సమయంలో నాకు అత్యంత సమీపంలో అంటే నా ముందుగానే శ్రీ స్వామి వారు నడవటం జరిగింది. అలా వెళ్ళిన శ్రీ స్వామి వారు కొద్ది దూరంలో గల మేడ పై భాగాన వున్న గదికి వెళ్ళి అక్కడే వున్న శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారిని (చిన్నస్వామి వారిని) తోడ్కొని క్రిందకు వచ్చి, మరలా వేదిక వద్దకు అదే విధంగానే వెళ్ళిపోయారు. మళ్ళీ తెర తీయడం జరిగింది. ఇలా రెండు పర్యాయములు శ్రీ స్వామి వారికి అతి సమీపంలో ఎంతో దగ్గరగా నడిచినా వారికి కనీసం నమస్కారం చేసుకొనటానికి కూడా నాకు ఆస్కారం కలుగలేదు. కారణం – నా రెండు చేతులూ ఇరువైపులా ఇద్దరు పట్టుకోవటమే. "అమ్మ" చెప్పినట్లు – "నమస్కారమంటే రెండు చేతులు కలవటమే కాదు" – కదా!

స్వర్ణోత్సవ వేడుకల అనంతరం "అమ్మ" తన బిడ్డల కోరిక మేరకు ఆంధ్ర దేశం నాలుగు చెరగులా పర్యటించటం జరిగింది. అదే సందర్భంలో – అనంత యాత్రలో భాగంగా మద్రాసు సోదరుల కోరిక మేరకు మద్రాసు నగరాన్ని పునీతం చేసింది. మద్రాసులో సోదరులు శ్రీ అచ్యుత్ గారి ఇంట విడిది చేసిన అమ్మ – హేమమాలిని కళ్యాణమండపంలో అశేష జనకోటికి దర్శనభాగ్యం కలుగజేసింది. అదే సందర్భంలో డాక్టర్ పి.యస్. శర్మగారు, తిరువణ్ణామలైలోని శ్రీ గుడిపాటి వెంకటాచలంగారు అమ్మను చూడాలనే కోరిక వెలిబుచ్చినట్లు చెప్పారు. ఆ ప్రకారం అమ్మ శ్రీ చలం గారిని చూడటానికి తిరువణ్ణామలైలోని రమణస్థాన్ వెళ్లారు. అక్కడ అమ్మ – శ్రీ చలం గారిని దగ్గరకు తీసుకొని, తలను స్పృశించి హత్తుకున్నది. అంతే శ్రీ చలంగారు గద్గదస్వరంతో "అమ్మా! నిన్ను దర్శించుకొనటానికి రాలేని అశక్తుడనైన నా దగ్గరకు నీవే రావటం నాకెంతో ఆనందంగా వుంది. ఈ అమ్మ, మరుగున పడుతున్న జ్ఞానము, వెలుగులను లోకానికి ప్రసాదించి, ఒక ప్రత్యేకమైన సందేశాన్ని ప్రసాదించటానికి ఇలా అవతరించింది – గీతాచార్యుని వాక్యం యథార్థమైంది. నేను ఈశ్వరోపాసన చేసాను. ఎవరైనా ఈశ్వరుడెక్కడ అంటే – ఇదుగో ఇక్కడే, ఈ అమ్మే ఈశ్వరుడని"

నాకు చెప్పటానికి ఎంతో సులువైంది" అంటూ అమ్మకు ప్రణామాలు అర్పించారు. ఆ తర్వాత సౌరీస్ దగ్గరకు వెళ్ళి ఆమెను గూడా ఆశీర్వదించింది అమ్మ.

రమణాశ్రమ మేనేజింగ్ ట్రస్టీ గారయిన శ్రీ టి.ఆర్.వెంకట్రామన్ గారి ఆహ్వానం మేరకు "అమ్మ" రమణాశ్రమం వెళ్ళారు. అమ్మ ఆ ఆశ్రమ ప్రాంగణంలో అడుగిడిన మరుక్షణం ముఖద్వారం వద్ద గల శివలింగం చెట్లపై విశ్రమించిన నెమళులు, ఒక్కసారి క్రిందికి దూకి తమ పింఛాలను విదల్చి, తమ ఆనందాతిశయాన్ని వెలిబుచ్చుతూ నాట్యమాడాయి. ఈ దృశ్యం ఎంతో మనోహరమై వెల్లివిరిసింది.

అనంతరం మేనేజింగ్ ట్రస్టీలైన శ్రీ వెంకట్రామన్, శ్రీ గణేశన్‌లు "అమ్మ"ను సాదరంగా ఆహ్వానించి, ఆశ్రమ విశేషాలను తెలియజేస్తూ ఆశ్రమమంతా అమ్మకు చూపించారు. అక్కడ గల సాధకులను, ఆశ్రమవాసులను "అమ్మ"కు పరిచయం చేశారు. అదే క్రమంలో అక్కడే వున్న సోదరుడు జేమ్స్ అమ్మను దర్శించుకొనటం – ఆ తదుపరి జిల్లెళ్ళమూడి వచ్చి స్థిరపడటం జరిగింది.

రమణాశ్రమ పర్యటన తర్వాత 'అమ్మ' కలవాయి అనే గ్రామానికి వెళ్ళారు. అప్పుడు రాత్రి 11.30 గంటలైంది. అప్పటికే అక్కడ వేంచేసి వున్న కంచి కామకోటి పీఠాధిపతులకు "అమ్మ" రాకను గూర్చి ముందుగానే తెలియజేయబడింది. కరెంటు సౌకర్యం లేని ఆ గ్రామంలో – ఆశ్రమంలో ఒక పెట్రోమాక్స్ లైట్ వెలుగుతోంది. అమ్మ రాకను చూచిన ఆశ్రమవాసులు "అమ్మ" ఆగమనాన్ని తెలియజేయగానే – శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతీ స్వాములు (చిన్న స్వామి) వారు 'అమ్మ'ను దర్శించుకొనుటకు వచ్చారు. ఆ లైటు వెలుగులో శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారు మౌనంగా, నిశ్చలంగా, తదేక దృక్కులతో 'అమ్మ'ను చూస్తూ కూర్చున్నారు. అలా కొంత టైము గడిచిన పిదప పెద్ద స్వామి వారిని గురించి అడుగగా, వారు ప్రస్తుతం విశ్రాంతి తీసుకొంటున్నారని, ఇప్పుడు వారిని చూడటం కుదరదని ఆశ్రమ వాసులు తెలిపారు. అనంతరం మేమందరం తిరుగు ప్రయాణానికి సిద్ధమై మా కార్లలో, బస్సులో ఎక్కబోతుండగా, ఒక ఆశ్రమవాసి పరుగున వచ్చి – "పెద్ద స్వామి వారు రాబోతున్నారు, మీరంతా ఉండవలసింది" అని చెప్పారు. ఆ ఆశ్రమ ప్రాంగణం అంతా పందిళ్ళు వేయబడి వున్నాయి. ఆ పందిళ్ళ మధ్య భాగాన నాలుగు వైపులా కర్రలు కట్టి మధ్యన

బెంచీలు అమర్చబడి చిన్న వేదికలా వుంది. శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారు అలా ఏర్పాటు చేసిన బెంచీ పై నిలబడి తమ దండాన్ని కుడి వైపు భుజంపై మోపి, తలను ఆ దండముపై వాల్చి, రెండు చేతులూ శిరము పైకెత్తి, జోడించి అలా సుమారు 15 నిమిషాలు తమ కెదురుగా వున్న 'అమ్మ'ను చూస్తూ నిశ్చేతనులై, తదేక దృష్టితో నిలబడిపోయారు. అమ్మ కూడా వారిని అలా చూస్తూ ఉండిపోయారు.

ఈ మహాద్భుతమై అనిర్వచనీయమైన దృశ్యాన్ని అమ్మతో వచ్చిన మేమంతా అంటే షుమారు 50 మంది, మాతో పాటు ఆశ్రమవాసులు మరికొంత మంది తిలకించి పులకించిపోయారు. ఎంతటి మహిమాన్విత సంఘటన ! నభూతో, నభవిష్యతి !

**–అక్టోబర్, 2003**



# అమ్మ రక్షణ

అమ్మ దగ్గరకు జిల్లెళ్ళమూడి 1960 స్వాతంత్ర్య దినోత్సవం నాడు వచ్చాను మొదటిసారి. అమ్మ నన్ను అప్పికట్లలో చాలాసార్లు చూచింది. నేనూ అమ్మను అంతకు ముందు సుబ్బారావు (అమ్మ పెద్ద కొడుకు) తల్లిగా చూచాను. మా యింట్లో రఘువరదాసు గారు సప్తాహాలు చేస్తుంటే అమ్మ కూడా వచ్చింది. మా యింట్లో వరండాలో కూర్చుని భోజనం చేసానని చెప్పింది. నేను రామకృష్ణ (కొండముది) కలిసి నడిచి పోతుంటే అప్పికట్ల బజారులో నన్ను చూచిందట మొదట. పోలిశెట్టి కుమారస్వామి (గుంటూరు) అమ్మ కొరకు ప్రత్యేకించి పాకా వేసిన క్రొత్తలో నేను జిల్లెళ్ళమూడి వెళ్ళాను. రెండవ సారి స్వాతంత్ర్య దినోత్సవం నాడు రామకృష్ణతో కలిసి వెళ్ళాను. మేం వెళ్ళేసరికి సిరిగిరి సుబ్బారావు (పర్చూరు) గ్రుడ్డివాడు "లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబం" అని శంకరాచార్యులవారి లక్ష్మీనృసింహ స్తోత్రం చేస్తున్నాడు. నిజంగా ఆర్తితో అతడు ఆ స్తోత్రం చేస్తుంటే గజేంద్రుణ్ణి రక్షించడానికి పరుగెత్తిన విష్ణుమూర్తి ఇతడ్ని రక్షించడానికి తప్పక వస్తాడు అనిపించింది. వేదిక పైన ఉన్న అమ్మ, వాడి వద్దకు వచ్చి తల నిమిరి వాడి నెత్తి మీద పూలు చల్లింది. అమ్మే విష్ణుమూర్తా! అనిపించింది. కన్నీళ్ళతో అమ్మ పాదాలు తడిపేశాడు సుబ్బారావు. అమ్మ అనుగ్రహం వాడి మీదకు ప్రసరించింది. నాలో తపన బయలుదేరింది. ఏమైనా చెయ్యాలి ఇక్కడ అని. వచ్చినప్పుడల్లా వడ్డన చేస్తున్నాం. శాశ్వతంగా నిలిచే పని ఏదైనా చేస్తే బాగుండును అనిపించింది.

నాకు బాపట్లలో పుస్తకాల షాపు వున్నది. ఒక ప్రింటింగ్ ప్రెస్ కూడా ఉండేది. అమ్మను లోకానికి తెలియజేసే పుస్తకం ప్రచురిస్తే బాగుంటుంది అనుకున్నాం. అమ్మను గూర్చి రాజు బావ పాటలు వ్రాశాడు అని తెలిసింది. కొన్ని విన్నాం. అమ్మను అడిగాం - అవి ప్రచురిస్తాం ఒక గ్రంథంగా - అని. అమ్మ వాడిని (రాజును) అడగండి అన్నది. రాజు బావ, అందులో నా ప్రమేయం ఏమీ లేదు. వ్రాసింది, వ్రాయించింది అమ్మే అన్నాడు. ఏమైనా ఆ ప్రచురణకు అమ్మ అనుజ్ఞ లేదేమో అప్పుడు జరుగలేదు.

1962లో సుబ్బారావు, రామకృష్ణ, నేనూ, అమ్మ జన్మదినోత్సవానికి ఒక అభినందన సంచిక తేవాలనుకున్నాం. ఆ రోజుల్లో గుంటూరులో పనిచేస్తుండేవాడు సుబ్బారావు. పి.యస్.ఆర్. పనిచేస్తున్న హిందూ కాలేజి హైస్కూలులో. సుబ్బారావు, పి.యస్.ఆర్. కలిసి ప్రసాదరాయ కులపతి, కృష్ణభిక్షు, మిన్నికంటి గురునాథశర్మ వంటి పెద్దలెందరి దగ్గరి నుండో రచనలు సేకరించి తెచ్చారు. ఆర్థికపరమైన అంశమంతా నేను, రామకృష్ణ చూశాము. మా ప్రెస్ (అత్రివాణి) లోనే ప్రింట్ చేశాం. "మాతృశ్రీ" జన్మదినోత్సవ అభినందన సంచికను 1962 ఏప్రిల్‌లో చైత్రశుద్ధ ఏకాదశినాడు అమ్మకు సమర్పించాం. మన్నవలో అమ్మ జన్మదినోత్సవం సందర్భంగా ఆవిష్కరించింది అమ్మ. అమ్మ మా అత్రివాణి ప్రెస్‌ను అది అత్రివాణి కాదురా "అత్రిరాణి" అని అభినందించింది.

ఆ తర్వాత అమ్మ వద్దకు తరచుగా వెళ్ళటం తటస్థించింది. ప్రతి వారం వెళ్ళేవాళ్ళం. చివరకు ప్రతిరోజు రాత్రిపూట అమ్మ దగ్గర మేల్కొని ప్రొద్దుటే బాపట్ల వెళ్ళటం మా నిత్యకృత్యం అయింది. ఆ రోజుల్లోనే అమ్మను విడిచి పెట్టలేనంతగా అనుబంధం పెరిగింది. రెప్పవాల్చకుండా అమ్మను చూడాలనే తపన ఉండేది. ఒక రోజున అలా చూస్తుండగా అమ్మ ముఖం భూమ్యాకాశాలు నిండినట్లుగా అనుభూతి కలిగింది. ఆ విషయం అమ్మకు చెబితే, అదే 'విశ్వరూప సందర్శనం' అంటే అన్నది అమ్మ. అకారణ కరుణామయియై ఏ అర్హతలు లేని నాకు విశ్వరూప సందర్శనం ప్రసాదించింది. యశోదకూ, భీష్మాది మహనీయులకు, మహర్షులకు, అర్జునునకు ప్రసాదించిన ఆ దర్శనం అతి సామాన్యుడనైన నాకు ప్రసాదించడంతో అమ్మ సేవ చేసుకోవాలనే తపన నాలో విపరీతంగా ప్రేళ్ళూనింది. ఒకసారి జిల్లెళ్ళమూడి నుండి బాపట్లకు బస్సులో వెళ్ళుతున్నాను. బస్సులో కూర్చొని ప్రక్కన వున్న పంట పొలాల వైపు చూస్తున్నాను. నా దృష్టి పొలాల పైన లేదు. అమ్మ ఆలోచనలలోకి వెళ్ళింది. అమ్మ మంచం మీద నుండి లేచి పాదుకలు తనే తొడుక్కొని గోడపట్టుకొని నడుస్తూ పడబోయింది. నేను బస్సులో నాకు తెలియకుండానే అయ్యో! అని పెద్దగా అరిచాను. అందరూ నన్ను ఏమైంది అని ప్రశ్నించారు. ఏం లేదు లెమ్మని సర్దుకొని కూర్చున్నాను. మళ్ళీ కొంతసేపటికి అదే దృశ్యం నా మనోయవనిక పై. అమ్మ వద్ద అమ్మను పట్టుకోవటానికి ఎవరూ లేరు. మళ్ళీ అదే రీతిలో పెద్దగా అరిచాను. బస్సులో అందరూ ఆశ్చర్యపోయారు. ఏమైంది - ఈయనకు అని నా వంక చూచారు విచిత్రంగా. అమ్మ వద్దకు

తిరుగు టపాలో వెళ్ళి అమ్మను అడిగాను. ఇలా రెండుసార్లు దర్శనమైంది. ఏమిటమ్మా? అని. అమ్మ 'అదంతా జరిగింది నిజమే' అన్నది. అప్పటినుంటి అమ్మ వద్ద ఎవరో ఒకరు ఉండి తీరాలి ప్రక్కన అని నేను, రామకృష్ణ నిర్ణయించుకున్నాం. ఆ రకంగా అమలు చేశాం. రాత్రింబవళ్ళు ఎవరో ఒకరం ఉండే వాళ్ళం.

ఆ రోజుల్లో ప్రెస్-పుస్తకాల షాపు అమ్మేసి అమ్మ తన సమక్షంలోనే ఉండమన్నది. అయితే సంసారమూ, పిల్లలు ఉన్నారు కదా! అనుకుంటుంటే అమ్మ పిలిచి "ఇక్కడి సంసారం నీవు చూడు, నీ సంసారం సంగతి నేను చూచుకుంటాను" అన్నది.

ఒకసారి అమ్మ వెళ్ళమంటే పొత్తూరి వెంకటేశ్వరరావు గారిని కలవటానికి హైదరాబాదు వెళ్ళాను. వారి దగ్గరే దిగమన్నది. అక్కడే దిగాను. వారితో కలసి మాట్లాడుతూ గాంధీభవన్‌కు వెళ్ళాం. వారక్కడ పత్రికలో పనిచేస్తుంటే. మాటల్లో అర్ధరాత్రి 12 గంటలయింది. అమ్మ విషయాలు మాట్లాడుతుంటే సమయమే తెలిసేది కాదు. అప్పుడు మైసూర్ కేఫ్ కెళ్ళాను. అక్కడ ఏమన్నా తిని వెళ్ళదాం జిల్లెళ్ళమూడికి అని. తీరా అక్కడికి వెళ్ళేసరికి పాత్రలు కడుగుతున్నారు. ఇక వాళ్ళనేం అడుగుతాంలే అని తిరిగి వస్తుంటే పిలిచి 'దేనికి' అని అడిగారు. చెప్పాను 'భోజనం చేద్దామని వచ్చాను' అని. 'కట్టేశాం హోటల్, అయినా ఉండండి' అని కొద్దిగా అన్నం పెరుగు వేసి పెట్టారు. డబ్బులు కూడా తీసుకోలేదు ఇస్తానన్నా. అక్కడి నుండి బయటకు వచ్చానో లేదో "విజయవాడకు ఒక సీటు ఖాళీగా వుంది వస్తారా" అని ఒక చిన్నకారు వాడు అడిగాడు. అమ్మే ఈ ఏర్పాటు చేసింది అనుకుంటూ ఎక్కాను. సూర్యాపేటకు కొంచెం దూరంలో కారు ఆక్సిడెంటు అయింది. కారు నుజ్జు నుజ్జు అయింది. అందరూ కారు చుట్టూ మూగారు. నన్ను ఒకళ్ళు బయటకు లాగారు. డ్రైవరుతో తగాదా ఆడుతున్నారు. దొరికితే చితకబాదే రీతిలో ఉన్నారు చుట్టూ. ఇంతలో ఒక లారీ డ్రైవర్ నా సంచీని నన్ను దూరంగా తీసుకెళ్ళి విజయవాడకు పోయే మరో లారీ ఎక్కించి పంపాడు. నాకు దెబ్బలు పెద్దగా తగల్లేదు. కాళ్ళు వాచినయ్యని ఆ లారీ సూర్యపేటలో దిగింతర్వాత కాని తెలియలేదు. అలాగే విజయవాడ వచ్చి, బాపట్లలో హాస్పిటల్‌కు తీసుకెళ్ళుతామంటున్నా ఆగకుండా జిల్లెళ్ళమూడి చేరాను. అమ్మ నన్ను చూచి

నాకెదురుగా పరుగెత్తుకుంటూ వచ్చి "బ్రతికొచ్చావా" అని కౌగిలించుకుంది. అంటే అమ్మకు అన్నీ తెలుసన్నమాట. నా వెంటనే ఉండి నన్ను రక్షిస్తున్నది అనిపించింది.

సామాన్యంగా మా అమ్మ వైపు బంధువులు నన్ను గోపీ అని పిలిచేవారు. అమ్మ కూడా నన్ను గోపీ అని పిలిచేది. ఆ రోజున అమ్మ అర్ధరాత్రి రెండుమూడు సార్లు రామకృష్ణను గోపి వచ్చాడా అని అడిగిందట. రామకృష్ణ, "ఊరికెళ్ళాడు కదా! వస్తాడు లేమ్మా!" అని చెప్పాడట. అమ్మ గదిలో గడియారం అర్ధరాత్రి 2.30 కు ఆగిపోయి వుంది. మా కారుకు యాక్సిడెంటు అయిన సమయం అదే. దీన్ని బట్టి కూడా అమ్మ నా వెంటనే వున్నది నన్ను కాపాడుతున్నది అనిపించింది.

"అమ్మ" ఇంగ్లీషు పిక్చర్ అయి తర్వాత మద్రాసు నుండి హౌరా ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరాను. నెల్లూరు దగ్గరకు వచ్చేటప్పటికి ట్రెయిన్‌కు ఆక్సిడెంట్ అయింది. నేను ఇంజన్ ప్రక్కన కంపార్ట్‌మెంటులో వున్నాను. ఆ కంపార్ట్‌మెంట్ నేను కూర్చున్నంతవరకు నుగ్గునుగ్గై ఒరిగిపోయింది ఒక ప్రక్కకి. అందులో నుండి కిటికి పగుల గొట్టుకొని బయటకు వచ్చి చూస్తే అంతా భీభత్సము, భయానకము. అందరూ పచ్చడి పచ్చడయి రక్తం ప్రవహిస్తున్నది. ఇంగ్లీషు పిక్చరు ఫైళ్ళను అక్కడికి వచ్చిన వాళ్ళలో ఒకడిని బయటకు తెమ్మన్నాను. ఎవరూ రైలు లోపలికి పోయి తేవడానికి సిద్ధపడలేదు. అక్కడ ఉన్నవారిని బస్సులో ఎక్కించి నెల్లూరుకు చేర్చారు. నేను డాక్టర్ శిష్టా సుబ్బారావు గారింటికి వెళ్ళాను. నాకు మత్తు ఇచ్చి పడుకోబెట్టారు. నాకు నిద్ర పట్టలేదు. నేను అమ్మను చూడాలనుకున్నాను. పునర్జన్మ ఎత్తి వచ్చిన నన్ను ఒంటరిగా బయటకు పంపడం ఇష్టంలేక వాళ్ళ కారులో కుటుంబం అంతా బయలుదేరి జిల్లెళ్ళమూడి వచ్చి నన్ను అమ్మకు అప్పజెప్పారు. అప్పుడు కూడా ఆ ట్రెయిన్ ఆక్సిడెంట్ చూసిన వాళ్ళు ఎవ్వరూ నన్ను బ్రతికి వస్తాడని అనుకోరు. కాని అమ్మ రక్షణకవచం నాచుట్టూ దుర్భేధ్యంలా వుంది. ఏ అప మృత్యువూ నన్నంట లేదు అనే విశ్వాసం ఇంకా బలపడింది.

1975 డిసెంబర్ 30 అర్ధరాత్రిన జిల్లెళ్ళమూడిలో నక్సలైట్లు పడ్డారు. నేను ఉస్మానియా హాస్పిటల్‌లో ట్రీట్‌మెంట్ తీసుకొని అంతకు ముందే జిల్లెళ్ళమూడికి వచ్చాను. అన్నపూర్ణాలయంలో భోజనం చేస్తుండగా అరుపులు, బాంబుల మోతలు రాగా నేను, పి.యస్.ఆర్. అన్నం వదలి పరుగెత్తుకొని నాన్నగారింట్లోకి

వెళ్ళాము. తలుపులు గడియ పెట్టాము. ఆ గదిలో వున్న అమ్మను ప్రక్కగదిలోకి పంపించాము. తలుపులు గొడ్డళ్ళతో పగులగొడ్తుంటే అక్కడే వున్న బీరువా తలుపుకు అడ్డంగా పెట్టి మేమిద్దరము నిలువరించాము. అయినా వారి ధాటికి అవి ఆగలేదు. తలుపులు బద్దలైపోతుంటే పి.యస్.ఆర్ పక్క గదిలోకి పోదాం రమ్మన్నాడు. నేను వెళ్ళలేదు. వాళ్ళు వచ్చినా అమ్మ వద్దకు పోకుండా వాళ్ళను కాసేపైనా నిలువరించ వచ్చులే అని నా ఆలోచన. తలుపులు బద్దలుగొట్టి లోపలకు వచ్చి నన్ను వరండాలోకి లాక్కెళ్ళారు. నా చుట్టూ చేరి గునపాలు, బరిసెలు నా మీదకు ఎత్తారు. ఒక బరిసెను నా గుండె మీదకు విసరేడు. 'అమ్మా' అని పెద్దగా కేకలేసాను. ఆ బరిసె నా చేతి ఉంగరానికి తగిలి చేతికి తగిలి పొట్టకు గీచుకుంటూ పోయింది. నా ఉంగరం, గడియారం తీసుకున్నారు. బీరువా తాళపు చేతులడిగారు. నా దగ్గర లేవన్నాను. బద్దలు కొట్టి అమ్మ నగలన్నీ తీసుకున్నారు. పక్కగదిలో అమ్మ ఉన్నది. ఈ కాలయాపనలో వారి దృష్టి అమ్మ మీదకు పోకుండా ఉండాలి ! అదే నా ఆలోచన. ఏమైనా మొత్తం మీద వాళ్ళు అప్పుడు కూడా నన్ను చంపకుండానే వదలివెళ్లారు. ఇన్ని సంఘటనల్లో కూడా అనుస్యూతంగా వున్నది నాకు అమ్మ రక్షణ. నన్నే కాదు నా కుటుంబాన్ని కూడా అలాగే రక్షిస్తున్నది ఇప్పటివరకు.

అమ్మను లోకానికి తెలియజేయాలనే నా ఆకాంక్ష 1962 అమ్మ జన్మదినోత్సవ సంచికతో మొదలై 1966 దాకా సాగి 1966 నుండి మాతృశ్రీ మాసపత్రికగా పరిణామం చెంది రెండు పుష్కరాలు నిరాఘాటంగా ప్రచురింపబడటమే కాక, మాతృశ్రీ పబ్లికేషన్స్ పేర ఎన్నో గ్రంథాలు ప్రచురించి, అమ్మ సినిమా తీసి మానవాళికి ఎంతో సేవ చేసే అవకాశాన్నిచ్చి తరింపజేసింది అమ్మ. నా యీ జీవితం, జీవనం అమ్మది.

– జులై, ***2002***



## నీవు నన్ను పూజించినట్లే

నేను జిల్లెళ్ళమూడిలో ఉండే రోజులలో సుప్రభాతంలో పాల్గొనేవాడను. నాకు చాలా ఇష్టమైన పని అది. కొన్ని పనుల కారణంగా బాపట్లలో కూడా అప్పుడప్పుడు ఉంటుంటాను. బాపట్లలో ఉన్నప్పుడు కూడా సుప్రభాతం చేస్తుండేవాడిని. సుప్రభాతంతో పాటు సుబ్రహ్మణ్యేశ్వర సహస్రనామం కూడా చదవటం అలవాటైంది. దానికి అమ్మకు ఉన్న నాగేంద్ర బంధమే కారణం. అమ్మ భర్త నాగేశ్వరుడు - అమ్మ జీవిత చరిత్రలో పాములతో ఉన్న సంబంధం ఘనమైనది.

అమ్మ పసితనంలో గొల్లనాగమ్మ ఇంటికి పోయినప్పుడు కానీయండి, చిదంబరరావు తాతగారి మీదకి పాకినప్పుడు కానీయండి, ముసలితాతను కరచినప్పుడు కానీయండి, మన్నవ దేవాలయంలో కానీయండి, బాపట్లలో నాగులచవితి నాడు కానీయండి, నాన్నగారింట్లో జాడీలో నాగేంద్రుడు కనబడటం కానీయండి, అమ్మ పూజా సమయంలో పాము రావటం కానీయండి ఎన్నో సమావేశాలలో అమ్మకు పాములతో సంబంధం ఉన్నట్టు కనిపిస్తుంది. అమ్మ మన వెన్నుపూసే పాము అంటుంది. అందువల్లనే వెన్నుపాము మనల్ని అంటుకొనే ఎప్పుడూ ఉన్నదంటుంది. ఇవన్నీ మనస్సులో మెదలటం వల్లనో ఏమో నాకు సుబ్రహ్మణ్య సహస్ర నామాలు చదవటం అలవాటయింది.

ఈ మధ్య విశ్వజనని పత్రిక పనుల వల్ల కానీయండి, జిల్లెళ్లమూడిలో వేరే ఆఫీసు పనుల వల్ల కానీయండి నాకు సుబ్రహ్మణ్య సహస్ర నామం చదివే తీరిక దొరకటం లేదు. అప్పుడప్పుడు మానేయాల్సి వస్తున్నదే అనే చింత మనస్సులో ఉంది. జిల్లెళ్ళమూడిలో ఒకరోజు మధ్యాహ్నా భోజనం చేసి కాసేపు పడుకొని విశ్రాంతి తీసుకుంటున్నాను. అంతలో ఒక కల వచ్చింది.

బాలసుబ్రహ్మణ్యేశ్వర స్వామి కనిపించాడు. ఎంత అందంగా ఉన్నాడో. ఆ రూప సౌందర్యాన్ని వర్ణించడానికి మాటలు చాలటం లేదు. ముద్దుగా సుకుమారంగా శూలం పట్టుకొని త్వరత్వరగా నడుస్తున్నాడు. నేను ఆయనతో నడవలేక పరుగెత్తుతున్నాను. రొప్పుతూ రోజుతూ కాస్త నెమ్మదిగా నడవండి స్వామీ! అన్నాను. స్వామి ఇంగ్లీషులో మాట్లాడుతున్నాడు. నేనూ ఇంగ్లీషులోనే

సమాధానం చెబుతున్నాను. స్వామి తేజస్సు, వర్చస్సు నడక వేగమూ చూస్తుంటే అమ్మ జ్ఞాపకం వచ్చింది. వెంటనే నేను "స్వామీ! మీరు అమ్మేనా?" అని అడిగాను. స్వామి నడక వేగం తగ్గింది. వెనుకకు తిరిగి నా వైపు చూడకుండా "Yes, exactly" అంటూ, "నీవు నిత్యం అమ్మ స్మరణ, సేవలో ఉన్నావు కదా! నన్ను పూజించినట్లే - అమ్మ నీమీద పెట్టిన బాధ్యతను నెరవేర్చు. నా నామాలు చదవలేదనే చింత అక్కరలేదు" అన్నాడు.

"సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి" అని పెద్దలు చెబుతారు. "ఏ పాదాలకు నమస్కారం చేసినా నా పాదాలకే చెందుతుందని" అమ్మ చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చి నా సందేహం, చింతా పటా పంచలై పోయాయి. ఇప్పటికీ ఆ సన్నివేశం కళ్లముందు కదలినట్లే ఉన్నది. పగటి కలలా లేదు.

– సెప్టెంబర్, *2002*



## "తనను తాను విమర్శించుకోవటం వివేకం ఇతరులను విమర్శించటం అవివేకం"

అమ్మ అర్కపురి వైకుంఠ నగరిలో పర్ణకుటీరంలో వున్న రోజులవి. ముందు హాలులో కూర్చుని అందరికీ దర్శనం ఇస్తున్నది. హాలునిండా సోదరీ సోదరులు నిండి ఉన్నారు. అందులో నుండి ఒక సోదరుడు శ్రీ సత్యసాయిబాబా గారిని గురించి ప్రస్తావన తెచ్చేడు. "అమ్మా! సత్యసాయిబాబా మహిమల గురించి పెద్దగా చెప్పుకోవలసినది ఏమీ లేదమ్మా. ఆయనకు అష్టసిద్ధులున్నై. అంతకంటే ఏమీ లేదు. అష్టసిద్ధులు ఆధ్యాత్మిక పథంలో అత్యల్పాలు" అని అన్నాడు. అప్పుడు అమ్మ "నాన్నా నీకు అష్టసిద్ధులు వచ్చా" అని అడిగింది. "అష్టసిద్ధులంటే అదేం పెద్ద విషయం కాదమ్మా" అని అన్నాడు. అమ్మ మరల "అది సరే. అవైనా నీకు వచ్చా" అన్నది. అమ్మ గట్టిగా అడిగేసరికి 'నాకు రావనుకో' అన్నాడు. అప్పుడు అమ్మ "నాన్నా ఆధ్యాత్మిక పథంలో అష్టసిద్ధులు అత్యల్పాలు అన్నావు కదా అవైనా నీకు రావు గదా. అటువంటప్పుడు నీకు రానివి ఆయనకు వచ్చు కదా! అంటే నీ కంటె గొప్పే గదా! కనుక అనవసరంగా విమర్శించక అంతవరకైనా ఆయనకు నమస్కారం చేయి నాన్నా" అని సున్నితంగా మందలించింది. ఎవరైనా ఇతరులను విమర్శిస్తే అమ్మకు నచ్చేది కాదు. కాని ఒకసారి చాలామంది అమ్మను దర్శించుకునే సమయంలో ఒక సోదరుడు అమ్మ దగ్గరకు వచ్చి కూర్చుని ఏడవటం ప్రారంభించాడు. "ఏం నాన్నా ఎందుకు ఏడుస్తున్నావని అమ్మ అడిగింది. దానికి ఆ సోదరుడు "అమ్మా నీకు ఏమి చెప్పాలో ఎట్లా చెప్పాలో అర్థం కావటం లేదు' అని అన్నాడు. "ఫరవాలేదు నాన్నా! చెప్పు ఏం జరిగింది" అని అడిగింది. దానికి ఆ సోదరుడు గద్గద స్వరంతో "అమ్మా తెనాలిలో ఒక స్వాముల వారు ఉపన్యాసం చెపుతూ అందులో 'జిల్లెళ్ళమూడి అమ్మ నాకు పచ్చి భోగందిగా కనబడుతున్నది" అని అన్నాడు. "నీవు అనుమతిస్తే వాడి అంతు తేలుస్తా"నన్నాడు. అప్పుడు అమ్మ అన్నది. "స్వాముల వారికి అందరూ అమ్మగా కనపడవలసింది అమ్మే అట్లా కనపడుతుందంటే ఆ పని నేను చేయవలసిందే నాన్నా. చిన్నపిల్లవాడు మలమూత్రాలు విసర్జించి వాటిని చిందులు కొట్టుంటే అది చూచి తల్లి ఆనందిస్తుంది. అవి పోయి వాడి మీద పడుతుంటే వాటిని తీసి శుభ్రపరుస్తుంది.

కాని అసహ్యించుకోదు. అదీ తల్లీ అంటే. ఆ శుభ్రపరచే బాధ్యత నాదే నాన్నా. నీవేమీ బాధపడకు" అన్నది. ఒకసారి అమ్మ దొంగనోట్లు ప్రింటు చేస్తున్నారని రూమరు వొచ్చింది. అమ్మను, నన్ను, రామకృష్ణను అరెస్టు చేసారని విపరీతంగా చెప్పుకొన్నారు. క్రొత్త జనం జిల్లెళ్ళమూడికి రావటం ప్రారంభించారు. వచ్చిన వాళ్ళు అమ్మకు నమస్కారం చేసి అటూ ఇటూ చూస్తుండేవారు. ప్రింటింగ్ మిషన్లు అమ్మకాలు క్రింద వున్నాయని ఎవరో చెప్పారుట. బాపట్ల మన ప్రెస్‌లో కూడా విపరీతంగా జనం వచ్చి చూస్తుండేవాళ్ళు. జిల్లెళ్ళమూడికి వచ్చిన వారందరికి భోజనాలు పెట్టడం తప్పేది కాదు. అందరూ క్రొత్తవాళ్ళే. ఎప్పుడూ జిల్లెళ్ళమూడి రాని వాళ్ళు, అమ్మంటే ఎవరో తెలియని వారు తండోప తండాలుగా వచ్చేవారు. వారిని చూచి ఏమిటమ్మా వీరంతా ఎందుకు ఇట్లా వస్తున్నారు ఈ వదంతులేమిటమ్మా అంటే "మీరు అమ్మను గురించి తెలియజేయటానికి పత్రికలు పెట్టి, వ్రాసి పుస్తకాలు పబ్లిష్ చేసినా రాని జనం ఇటువంటి వార్తలతో ఎట్లా వస్తారో చూడు. ఎట్లాగైతేనేం అమ్మను చూచి, భోజనం చేసి వెళ్ళుతున్నారుగా. మీరు చేయలేనిది వాళ్ళు చేసారుగా నాన్నా! ఇటువంటి వార్తలు తాటాకు మంటల్లాంటివి. ఎట్లా వస్తాయో అట్లాగే పోతాయి" అని అమ్మ నవ్వుతూ చెప్పింది. అమ్మను స్తోత్రం చేసినా, దూషించినా ఎటువంటి మార్పు ఉండేది కాదు. అటువంటి స్థితప్రజ్ఞ అమ్మ. నక్సలైట్లు అమ్మ నివాసంపై దండయాత్ర చేసి తలుపులు బ్రద్దలు కొట్టి లోపలికి ప్రవేశించారు. అక్కడ వున్న నన్ను బయట వరండాలోనికి లాక్కు వెళ్ళి మారణాయుధంతో చంపబోయారు. అప్పుడు నేను 'అమ్మా' అని కేకవేస్తే "నిన్ను అమ్మ బొమ్మ ఎవరూ రక్షించలేరు. నీవు నా చేతుల్లో చస్తున్నావురా ? అని అంటూ నన్ను చుట్టుముట్టి, ఆ 10 మందిలో ఒకడు బరిసెతో నా గుండెలలో పొడిచాడు. ఆ బరిసె ఎట్లా తప్పిందో, వాళ్ళ మనసులను మార్చి అమ్మ నన్ను ఎట్లా కాపాడిందో అది ఒక పెద్ద గాథ. వాళ్ళందరూ వెళ్ళిన తర్వాత డాక్టర్ సత్యం గారింట్లో ఉన్న అమ్మతో 'అమ్మా నేను చూస్తుండగానే, నన్ను మారణాయుధాలతో బంధించి ఇనుప బీరువా బ్రద్దలు కొట్టి నీ సొమ్మంతా దోచుకెళ్ళారమ్మా. నేనేమీ చేయలేకపోయాను అని అన్నాను. "సొమ్ము పోతే పోయిందిలే నాన్నా! నీవు బ్రతికేవు నా సొమ్ము పోతే మళ్ళీ వస్తుంది. నీ ప్రాణం పోతే మళ్ళీ వస్తుందా! "తల్లికి బిడ్డే సొమ్ము" అని వారించింది. " నీ కేక నాకు వినపడ్డది నాన్నా. వీళ్ళంతా నా కాళ్లు పట్టుకొని నన్ను బయటకు రానివ్వలేదు.

నేన రాలేకపోయాను" అన్నది. "అమ్మ రాకపోతేయేం; అలనాటి కేకతో గజేంద్రుడు కాపాడబడినట్లుగా ఇప్పుడు అమ్మా అనే నా కేకతో నేను కాపాడబడ్డాను" అనే తెలుస్తోంది. ఒకసారి అవధూతేంద్ర సరస్వతి స్వామి వారితో ఎందుకు మీరు వాసుదేవా! నారాయణా! అంటూ అంత పెద్దగా కేకలు వేస్తారు" అని అడిగితే ఆయన అన్నారు "వాడికి చెవుడు. వాడిని మనకు మల్లే కేకలు పెట్టేవాళ్ళు అనేకులుంటారు. మనకేకవాడు వినాలిగా అందుకు" అన్నారు.

ఒకసారి 1964లో మద్రాసులో నేను చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామివారిని దర్శించిన రోజున తెల్లవారు ఝామున 4.30 గంటలకు ఆయన మైలాపూర్ ఈస్టు మేడా స్ట్రీట్‌లో అమ్మవారిని చూస్తూ నడుస్తూ మేళతాళాలతో వెళ్ళుతున్నారు. నేను కొంత దూరం వారితో వెళ్ళి వచ్చి మా సోదరుడు దత్తు వాళ్ళింటిలో పడుకున్నాను. నిద్రపట్టింది. నిద్రిస్తున్న నన్ను ఎవరో నాతలపై తలపెట్టి ముద్దుపెట్టుకున్నారు. వారి జుట్టు నా ముఖంపై పడింది. వళ్ళు జలదరించింది. కళ్ళు తెరిచాను. అది సత్యసాయిబాబా. చామనచాయగా నున్నారు. చర్మం అమ్మ శరీరం లాగా అతి సున్నితంగా లేదు. కొంత రఫ్‌గా కనపడింది. మొత్తానికి నేను ఊహించినట్లుగా లేరు. కాని ఆయన గురించిన ఆలోచన నాకు లేనే లేదు. కాని ఈ దృశ్యం ఎందుకు సాక్షాత్కరింపబడిందో తెలియదు. అప్పటి నుండి ఒకసారి ఆయనను చూడాలనిపించింది. 1980లో మేము అనంతపూర్ కలెక్షన్ డ్రైవ్‌కు వెళ్ళినప్పుడు పుట్టపర్తి వెళ్ళి సాయిబాబాను చూచాను. నేను 1964లో కలకత్తాలో మదరాసులో చూచినట్లుగానే ఉన్నారు. నేను 1980లో చూచిన పుట్టపర్తికి ఇప్పటి పుట్టపర్తికి సంబంధమే లేదు. కొన్ని వందల కోట్ల రూపాయిలతో ప్రజాహిత.ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వర్తిస్తున్నారంటే ఎన్ని వేలమంది హృదయాలలో ఉన్నారో తెలుస్తున్నది. అయినా ఇప్పటికీ ఆయననీ విమర్శించే వాళ్ళు ఉంటూనే వుంటారు. అందుకే అమ్మ అన్నారు" విన్నవాడు విమర్శిస్తాడు - కన్నవాడు వివరిస్తాడు"అని.

– ఏప్రియల్ *–2004*



# "అందరికీ సుగతే"

నేనెవరు ? అసలు నేనెవరు ? అని తన్నుతాను ప్రశ్నించుకోవటం విజ్ఞుల లక్షణం.

"నేను నేనైన నేను. అన్ని నేనులు నేనైన నేను"

నేను ఎక్కడ నుండి వచ్చాను ? ఎక్కడకు పోతాను ? అని మీ మాంస.

"ఎక్కడ నుండి వచ్చామో అక్కడికే పోతాము".

"ఎవ్వరూ నా ఒడిని విడిచి లేరు. నా ఒడిని విడిచి ఎక్కడకూ పోలేరు".

"అందరికీ సుగతే, కాస్త ఇటూ అటుగా"

"ఇది ఏమిటి ? పంచాక్షరి. అసలు ఇది ఏమిటి ? అష్టాక్షరి" అన్నది అమ్మ.

"అంతా అదే. ఏది చూచినా, ఏది తాకినా, ఏది విన్నా అది తప్ప నాకేదీ కనపడటం లేదు నాన్నా" అన్నది అమ్మ.

"అది ఏమి ? అంతా అదే. ఈ సర్వ సృష్టి చేతనము అచేతనము పరబ్రహ్మస్వరూపమే".

"ఒకానొక శక్తి దానిని దైవమనండి లేదా నేనే అనండి ఈ సర్వాన్ని నడిపిస్తున్నది."

"సర్వానికీ సర్వమూ ఆధారం"

"అమ్మ అంటే ఈ జిల్లెళ్లమూడిలో ఈ మంచం మీద కూర్చున్నదే కాదు. అమ్మ అంటే అంతులేనిది అడ్డులేనిది అంతా ఐనది, అర్థంకానిది అన్నింటికీ ఆధారమైనది" అని వివరణ యిచ్చింది. అంతటితో వదలకుండా "నేను మీకు అమ్మను. మీరు నాకు బిడ్డలు. బిడ్డలే కాదు. మీరంతా నా అవయవాలు అని మనల్ని కని తనలోనే కలుపుకొన్నది.

ఎవరినైనా మనము "నీవెవరు ?" అని అడిగితే, నేను గోపాలకృష్ణను, నేను రామకృష్ణను, నేను సుబ్బారావును, నేను హైమను, నేను కొండను, నేను గుహను, నేను సింహాన్ని, నేను కుక్కను, నేను కాకిని, నేను అగ్నిని, నేను వాయువును, నేను చిలుకను అని తనను గూర్చి చెపుతారు. వాటిలో నేను అనేది ఒకే కామన్

ఫాక్టర్. ఈ ఆన్నింటిలో ఉన్నటువంటి నేను ఈ అన్నీ అయినటువంటి నేనే. అంటే ఈ సర్వం నేనే. సర్వం ఖల్విదం బ్రహ్మ.

ఈ సర్వసృష్టి పంచ భూతాత్మకమైనది. మనము పంచభూతాల నుండి ఉద్భవించి పంచ భూతాలలోనే లయమౌతున్నాము. మహా సముద్రము నుండి పుట్టిన అలలు, బుడగలు, నురుగు మళ్ళీ సముద్రములోనే కలిసి పోతున్నవి. ఈ అలలు, బుడగలు, నురుగు సముద్రము నుండి వేరు కాదు. అట్లాగే మనము ఆ పరమాత్మ నుండి ఉద్భవించి పరమాత్మలోనే లయమౌతున్నాము. ఆ పరమాత్మ నుండి పుట్టిన మనకు ఆయుర్దాయము జీవిత విధానము ముందుగనే నిర్ణయింపబడుతుంది. వాడు చేసిన నిర్ణయాలకు ఆ చేసినవాడు కూడా బద్ధుడే.

పుట్టిన వాడు గిట్టక తప్పదు. కనుక మన జీవితంలో మృత్యువు నశింప చేసేది కాదు. అది ఒక పరిణామమే. కనుక మనము మృత్యువుని చూచి భయపడనవసరం లేదు. మృత్యువు అంటే భయపడకపోవటమే మృత్యుంజయత్వం కాని, మృత్యువు లేకుండా పోవటం కాదు. ఎవరు చేసిన కర్మ వారనుభవించక ఎవరికైనను తప్పదన్నా అని అన్నారు. కర్మకు కర్త ఉండాలి. ఆ కర్తకు కర్త ఎవరు ? అందుకే అమ్మ అన్నారు "తోచిందేదో చేయి తోపింపచేసేది వాడేగా". వాడంటే పరమాత్మ అనండి, పరబ్రహ్మ అనండి, శక్తి అనండి లేక అంతా నేనే అనండి, ఏదైనా ఒక్కటే. వాడు నామరహితుడు అంటే అన్ని నామాలు తానైనవాడు. వాడు గుణరహితుడు అంటే అన్ని గుణాలూ తానైనవాడు. కనుక అన్ని నామాలు తానైన వాడు అన్ని గుణాలు తానైనవాడు ఆడే ఆటలో మనము పావులమన్నమాట. అన్నీ తానైతే అందులో మనం భాగం అన్నమాట. అద్వైత దృష్టితో చూస్తే మనము వాడి నుండి వేరు కాదు. ఇది తెలుసుకోవటమే జ్ఞానం. ఈ జ్ఞానం కలిగినవాడికి పునర్జన్మ లేదన్నమాట. ఈ జ్ఞానం లేకపోవటమే అజ్ఞానం. అజ్ఞానికి పునర్జన్మ వున్నది అనిపిస్తుంది. దానికి కారణం ఆ జ్ఞానం వాడికి లేకపోవటమే.

ఒక జీవి పుట్టుటకు కారణము అకారణము. భగవంతుని ఆజ్ఞ, కరుణ లేనిదే జీవికి పుట్టుక ఉండదు. పర్వతముల నుండి ఉద్భవించి వచ్చిన నదులు ఏరకంగా నైతే మహాసముద్రంలో కలిసి తన నామములను ఉనికిని కోల్పోయి మహాసముద్రములో భాగమై పోతున్నవో మరల ఆ సముద్రపు నీరు ఎండ వేడికి ఆవిరై మేఘములుగా మారి వాటికి చల్లటి గాలి తగలగానే వర్షాలుగా కురిసి

నదులుగా ప్రవహిస్తూ మరల సముద్రంలోనే కలుస్తూ ఇది ఒక సైక్లిక్ ఆర్డర్‌గా నిరంతరము జరుగుతున్న ప్రక్రియ. దీనిని మనము పునర్జన్మ అనటం లేదు.

భగవంతుడు ఆడే జగన్నాటకములో మనము పాత్రధారులుగానే ఉన్నాము. భగవంతుడు ఆడే ఈ పరమపద సోపానపటములో మనము పావులుగా మాత్రమే యున్నాము. ఈ పరమపద సోపాన పటములో ఉన్న పావులు పాములు కరచి క్రిందకు వస్తున్నవి. నిచ్చెనలు ఎక్కి పైకి పోతున్నవి. కాని ఆ పావులకు ఎటువంటి కర్తృత్వము లేదు. కర్తృత్వము ఆడేవాడిదే. ఈ ఆటలోని నిచ్చెనలు, పాములు మన జీవితము లోని పాప పుణ్యములు, కష్ట సుఖముల లాంటివే. ఏ రకంగా నైతే ఈ పటంలోని పావులకు నిచ్చెనలు ఎక్కటంలోను పాములు కరవటంలోను కర్తృత్వము లేదో అట్లాగే ఈ జీవిచే చేయించబడుతున్న పాపపుణ్యములకు కర్తృత్వము లేదు. తద్వారా వచ్చే పునర్జన్మలకు కర్తృత్వము లేదు. కనుక పుట్టిన ప్రతి జీవి భగవంతునిలో లీనమై తమ నామములను ఉనికిని పోగొట్టుకొని సుగతినే పొందుతున్నవి.

ఒకసారి శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు, వీరమాచనేని ప్రసాదరావుగారు. కొం|| రామకృష్ణ అమ్మతో నలభై రోజులు సంభాషణలు గావించారు. అందులో పునర్జన్మ అంశము ఒక్కటి. ఒకరోజు నేను అమ్మని అడిగాను. "అమ్మా.... ఇన్ని రోజులు వీరు తర్జన భర్జనలు పడుతున్నారు. ఇంతకీ పునర్జన్మ ఉన్నదా లేదా" అని, అమ్మ అన్నారు. "వారి సంగతి నీకెందుకు నీకు లేదు" అని.

ప్రశంగవశాన అమ్మ నాతో పలికిన ఈ సత్యము అందరికీ వర్తిస్తుంది. అమ్మ వాక్యాలన్నీ ఆణిముత్యాలే నిత్య సత్యాలే. ఇవి అనేక మందితో అమ్మ మాట్లాడుతున్నపుడు రాలిన రవ్వలే. అమ్మ వాక్యాలన్నీ తన నిజజీవితము నుండి అనుభవించి పలికినవే. వాటిని అన్వేషిస్తే సమస్త జీవకోటికి చెందినవే అవుతాయి. అనుభవం శాస్త్రాన్నిస్తుంది. కాని శాస్త్రం అనుభవం ఇవ్వదు అని అమ్మ అన్నట్లుగా. దేనికైనా నమ్మకం ప్రధానం. అందుకే అమ్మ అన్నారు "నమ్మకమే భగవంతుడని, మనం శాస్త్రాన్ని నమ్మినా మహామహుల్ని నమ్మినా మనం నమ్మినవాడే భగవంతుడు. ఇది ఏ మతాలవారికైనా వర్తిస్తుంది. ఎవరికైనా వర్తిస్తుంది" అందుకే అమ్మ "అందరికీ సుగతే" కాస్త అటు ఇటు తేడాతో అన్నారు. ఈ తేడా బహుశ నేను పైన చెప్పిన అజ్ఞానానికి ఉన్న కాలము తేడా ఏమో. **- ఆగష్టు, 2004**

# "అర్థం కావడమే అనుభవం"

డాక్టర్ ఎస్.వి. సుబ్బారావు గారు నెల్లూరులో అమ్మకు ఆప్తుడైన ముద్దుబిడ్డడు. అమ్మకు పర్సనల్ ఫిజీషియన్ కూడా. అమ్మకు ఎటువంటి శారీరక అస్వస్థత వచ్చిన వెంటనే అమ్మ ఆయనను వెంట పెట్టుకొని రమ్మనమని నాకు చెప్పేది. అట్లాగే నెల్లూరు వెళ్ళి ఆయనకు చెప్పగా హాస్పిటల్ ఎంత రద్దీగానున్నా హాస్పిటల్ క్లోజ్ చేసి కారులో ఫామిలీతో నన్ను వెంబడి పెట్టుకొని వచ్చేవాడు. ఆయన జిల్లెళ్ళమూడి వెళ్ళేటప్పటికి అమ్మ చక్కగా మంచంమీద కూర్చుని అందరితో కబుర్లు చెప్పుతుండేది. మరి ఆ అస్వస్థత ఏమైనట్లు ? అమ్మ తనను చూడటానికే అట్లా చేసిందేమో అని అనుకుండేవారు. అమ్మా! నీవెట్లా వున్నావమ్మా ? అని డాక్టరు గారు అడిగితే నీవు పాముల నర్సయ్యవురా. నా అస్వస్థత గురించి నీకు తెలియంగానే నాకు తగ్గిపోయింది అని చెప్పేది. అట్లా ఆయన ఎన్నిసార్లు జిల్లెళ్ళమూడికి పరిగెత్తుకుంటూ వస్తూ వుండేవాడో చెప్పలేను. అది 1985 జూన్ 12వ తేదీ. ఆయన చివరిసారిగా జిల్లెళ్ళమూడికి వచ్చింది. అమ్మ భౌతిక దేహం చాలించిన తర్వాత ఇక్కడకు రావటం మానేశాడు. మానేయటమే కాదు ఒక ఉత్తరం రామకృష్ణ పేర వ్రాసాడు. అమ్మపోయిన తర్వాత తనకు జిల్లెళ్ళమూడికి ఎటువంటి బంధము లేదని జిల్లెళ్లమూడికి రానని, మీరు నా దగ్గరకు రావద్దని, ఈ విషయం గోపాలన్నయ్యకు కూడ చెప్పవలసిందని. ఇంక మేము నెల్లూరుకు వెళ్ళవలసిన అగత్యమే లేకుండా పోయింది. ఒకవేళ పోయినా ఆయనను చూడటానికి వీలులేదు. కారణం ఏమైయుంటుందో తెలియదు. వెళ్ళి ఆయనను బాధపెట్టటం ఇష్టంలేకపోనే మానేశాము. తర్వాత రెండుమూడుసార్లు ఇన్‌కంటాక్స్ అసెస్‌మెంట్స్ కోసం నెల్లూరు వెళ్ళాను. ఆ ఐ.టి.ఓ ఆఫీస్‌లో నున్న సూపరింటెండెంట్ "మీరు డాక్టర్ సుబ్బారావు గారిని కలిసారా ? బాగున్నారా ? వారింట్లోనే అమ్మను చూచాను అని చెప్పుతుండేవాడు. నేను వెళ్ళలేదని చెప్పటం నాకే నామర్దా. అందుకనే మౌనం వహించేవాడిని. 1986 జూన్ 10వ తేదీన రావల్సిందిగా ఇన్‌కంటాక్స్ ఫైనల్ అసెస్‌మెంట్ నోటీస్ వచ్చింది. అప్పటికి 2 సార్లు ఐ.టి.ఓ. ట్రాన్స్‌ఫర్ కావటం మూలంగా ఎడ్జర్న్‌మెంట్ అయి వున్నది. దీనికి వెళ్ళక తప్పదు. పోతూ ఒంగోలులో ఆడిటర్ గారిని కలుపుకు పోతూ

ఫైళ్ళన్నిటితో జీపులో వెళ్దామని బయలుదేరాను. ఒంగోలులో ఆడిటర్ లేరు. అయినప్పటికి నేను వెళ్ళక తప్పదు. ఐ.టి.ఒ. క్రొత్తవారు వచ్చాడు. ఆయన మనస్తత్వం ఎట్లా వుంటుందో తెలియదు. ఆడిటర్ లేడు. అయినప్పటికి నేనే హాజరైనాను అమ్మ దయనే ఆశించి అసెస్‌మెంట్ కంప్లీట్ అయింది. ఆయన అడిగిన వాటన్నింటికి సమాధానం చెప్పాను. కావల్సిన కాగితాలు సమర్పించాను. ఇక జిల్లెళ్ళమూడికి జీప్ బయలుదేరింది. పెన్నానది వరకు వెళ్లాను. బ్రిడ్జి దాటలేదు. దాటటానికి మనసొప్పలేదు. కారణం డాక్టర్ సుబ్బారావుగారిని చూడలేకపోవటమే. జీవు వెనుకకు త్రిప్పమన్నాను. ఆయన ఏమనుకొన్నప్పటికీ ఆయనను చూడవలసిందే అని దృఢ నిశ్చయం నెలకొన్నది. నేరుగా ఇంటికి వెళ్ళాను. తలుపు తట్టాను. తలుపులు తీశారు. నన్ను చూచి వాళ్ళు ఆశ్చర్య పోయారు. అయినప్పటికి నన్ను సాదరంగానే లోపలికి ఆహ్వానించారు. హాస్పిటల్‌లో నున్న డాక్టర్ గారికి కబురు చేసారు గోపాలన్నయ్య వచ్చారని. ఆయన కూడా వచ్చారు. మంచినీళ్ళు యిచ్చారు. కాఫీ ఇచ్చారు. అది వరకు మామూలుగా వాళ్ళింటికి వెళ్ళినపుడు నన్నెట్లా ఆదరించి ఆప్యాయంగా మాట్లాడేవారో అట్లాగే మాట్లాడారు. తేడా ఏమీ కనిపించలేదు. నేను అక్కడ వున్నంతసేపూ అమ్మను గూర్చే మాట్లాడారు. సరే నే వస్తానని బయలుదేరాను. లేచాను. అన్నయ్యా ! నీవు ఇట్లాగే మరలా వస్తూ వుండు అని డాక్టర్‌గారు అన్నారు. ఈ సంవత్సరంలో నేను 2, 3 సార్లు వచ్చాను. కాని మీరు రావద్దన్నారని నేను రాలేకపోయాను అన్నాను. మిమ్మల్ని అనలేదు కదా అన్నారు. కాని నాకు తెలియ చేయమని వ్రాసారు కదా అన్నాను. అప్పుడు డాక్టర్ గారితో అన్నాను. ఇప్పుడు నేను రావటానికి కారణం మిమ్మల్ని చూడకుండా నెల్లూరు దాటలేకపోయాను. కారణం మీరు అమ్మను చూచి రేపు 12వ తేదీకి సంవత్సరం కావస్తున్నది. బహుశా అమ్మ మిమ్ములనూ నా కళ్ళద్వారా చూడాలని తీవ్ర ఆకాంక్ష పొందిందేమో. ఇప్పుడు మిమ్మల్నందరిని చూస్తున్నది నేను కాదు అమ్మే', అని నాకనిపిస్తుంది" అన్నాను. ఆయన ఆనందంగా నా చేయిపట్టుకున్నారు. ఇక బయలుదేరి ఆకాశంలో ప్రయాణం చేస్తున్నట్లుగా జిల్లెళ్ళమూడి చేరాను.

ఈ మధ్య 24.9.04 న శుక్రవారం ఉదయం 11 గంటలకు గుంటూరులో కంటి కేటరాక్టు ఆపరేషన్ జరిగింది. నేను జిల్లెళ్ళమూడి నుండి 10వ తారీకున బయలుదేరి శ్రీకాకుళం వెళ్ళి వస్తూ గుంటూరులో ఆపరేషన్ చేయించుకున్నాను.

ఈ విషయం జిల్లెళ్ళమూడికి ఫోన్ చేసి లక్ష్మణరావు గారికి, బాపట్లలో డాక్టర్ ఇనజకుమారికి, హైమకు, హైదరాబాదులో మన రవికి, స్వీటీకి ఆపరేషన్ జరిగినట్లుగా చెప్పాను. అనుకోకుండా ఐ.ఆర్.కె. బెంగుళూరు నుండి ఆరోజు మూడుసార్లు ఫోన్ చేసాడు. కాని ఆదివారం వరకు ఎవరి దగ్గరి నుండి కూడా ఎట్లా వుందని ఫోను ఎంక్వయిరీ కూడా లేదు. కాని నాకు ఒక క్షణం నిజంచెప్పాలంటే బాధ కూడా వేసింది. అంతటితో మర్చిపోయాను. ఆదివారం సాయంత్రం 4 గంటలకు వాన కురుస్తున్నది. ఆ వానలో ఫోను వచ్చింది. రవి ఫోను చేసాడు. మేమంతా హైదరాబాద్ నుండి కార్లో జిల్లెళ్ళమూడికి రాచర్ల లక్ష్మీనారాయణ గారి పుట్టినరోజు సందర్భముగా వస్తున్నామనీ, 4 రోజులనుండి అనేక హోమాలు, సుదర్శన హోమం మొదలగునవి జరుగుతున్నవనీ అందుకు పోతూ దార్లో గుంటూరుకు రూటు మార్చుకొని వచ్చి నిన్ను చూచి జిల్లెళ్ళమూడికి పోతామని చెప్పాడు. ఇంటి అడ్రసు చెప్పమన్నారు. అడ్రసు చెప్పాము. 10 నిమిషాలలో రవి, ధర్మసూరి, దినకర్, వై.వి.శ్రీరామమూర్తి, డి. కామరాజు, వి.మోహనకృష్ణ, ఈమని శంకరశాస్త్రి గారి అల్లుడు వచ్చారు. వీళ్ళను చూచేటప్పటికి నాకు అమిత సంతోషం వేసింది. కారణం వీళ్ళందరి కళ్ళల్లో నుంచి అమ్మే నన్ను స్వయంగా చూడటానికి వచ్చింది అని. సహస్రాక్షి, సహస్రపాద్ అంటే వెయ్యి కన్నులు, వేయి పాదాలు కలది అని కాదు. అందరి కన్నులు, అందరి పాదాలు తనవే అని చెప్పటమే. అందుకే అమ్మ "ఏ పాదాలకు నమస్కరించినా ఆ పాదాలకే చేరుతాయి" అంటుంది.

– *అక్టోబర్, 2004*



# ప్రభాకర ఉమామహేశ్వర పండితుడి పునర్జన్మ

అమ్మ పూరింట్లో వుండే రోజులవి. (అనగా 1968 కు పూర్వపు రోజులు) ఆ రోజుల్లో జిల్లెళ్ళమూడికి తరుచుగా వచ్చే మన సోదరులు స్వర్ణయుగమని అంటారు. అప్పుడు ఎక్కువగా వచ్చే వారికి ఒక పర్యాటక కేంద్రానికి వెళ్ళుతున్నట్లుగా కాని, ఒక పుణ్యక్షేత్రాన్ని వెళ్ళుతున్నట్లుగా కాని కాక తన ఇంటికి, తన తల్లిని, తన వారిని చూడటానికి వెళ్తున్నట్లుగా తహతహలాడుతూ పోయేవారు. అప్పుడు జిల్లెళ్ళమూడికి పోవటమే ఒక సాధన. పోవటం అంత తేలిక కాదు. అందుకే అమ్మ అనేది "మీరు అనుకుంటే ఇక్కడకు రాలేరు. నేను అనుకుంటేనే వస్తా"రని. ఆ వచ్చేవారికి అనేక దర్శనాలు, నిదర్శనాలు ఎక్కువగా వుండేవి. అక్కడకు వెళ్ళిన దగ్గర నుండి ఏదో పనిలో నిమగ్నమై యుండేవారు. వాళ్ళు అక్కడ పనులు చేస్తున్నామన్న ధ్యాసే యుండేది కాదు. అక్కడ చేసే పనులు తమ కొరకు అమ్మ కొరకు చేస్తున్నట్లుగానే ఉండేవి. అక్కడ అమ్మను చూడటం అమ్మతో కొంతకాలం గడపటం ఒక ధ్యాసే. అందుకే అమ్మ అన్నారు. "ధ్యాసే ధ్యానం" అని. ఒక రోజు బాపట్ల నుండి ఒక ఫోను వచ్చింది. హిందూ మతోద్ధారకుడు, ఉపన్యాసచక్రవర్తి ప్రభాకర ఉమామహేశ్వర పండిట్ అమ్మ దర్శనార్థమై వస్తున్నాడని. ఆయన ఉపన్యాసాలకు జనం మంత్రముగ్ధులయ్యేవారు. ఆయన ఎక్కువగా జన్మలను గురించి, కర్మలను గురించి చెప్తూ క్రిస్టియన్ మిషనరీలను, వారు హిందువులను, క్రిస్టియన్లుగా మార్చే విధానాన్ని ఆయన నిరసించటమే కాదు, వాళ్ళను పచ్చి బూతులు తిట్టినట్లుగానే ఉండేది.

అమ్మ సాహిత్యములో జన్మలు లేవని, కర్మకు బాధ్యత వాడిదేనని చెప్పటం కనపడుతున్నది. కనుక జన్మపరంపర అనేది ఒక వివాదాంశం. అటువంటప్పుడు అమ్మతో ఆయన ఏమని మాట్లాడుతాడో. దానికి అమ్మ ఆయనకు ఏమి సమాధానం ఇస్తుందోనని నా బోటివారికి సందేహం. తహ తహ. నేను అప్పటికే మాతృశ్రీ పత్రికకు ప్రచురణ కర్తను. మేనేజింగ్ ఎడిటర్‌ను కనుక సహజంగా పత్రికకు Important matter కొంత వస్తుందని ఆశ. ఆ విషయ సేకరణకు డైరీ రైటర్సును అలర్టు చేసాము. టేపు రికార్డర్ రెడీగా పెట్టాము.

ఇంతలో కారు వచ్చింది. శ్రీ ఉమామహేశ్వర పండిట్, వారి సతీమణి, ఇంకా కొంతమంది వారితో వచ్చారు. అమ్మ పూరింట్లో స్నానం చేసి వచ్చి మంచం మీద కూర్చున్నది. వాళ్ళందరు బావి దగ్గర కాళ్ళు కడుక్కుని అమ్మ దగ్గరకు వచ్చి అమ్మకు దగ్గరగా కూర్చున్నారు. అమ్మ తన సహజమైన ప్రేమతో వారిని స్పృశించింది. అమ్మకు వాళ్ళు తెచ్చిన పూలదండ వేసి పూలు అమ్మ పాదాల మీద సమర్పించారు. 'అమ్మా! ఈ రోజు బాపట్లలో భావనారాయణ స్వామి ఆలయంలో నాకు సన్మానము జరుగుతుంది. అందుకు ముందుగా మీ ఆశీర్వాదం కొరకు వచ్చాము"ని చెప్పారు. అమ్మ అరటిపండ్లు వలచి వారిద్దరకు, వారితో వచ్చినవార్కి నోటికి అందించింది. "నాన్నా! నీకు ఇక్కడే ఇప్పుడు ముందుగా నేను సన్మానం చేస్తా"నని చెప్పి ఆయనకు ఆమెకు గుడ్డలు పెట్టి కట్టుకురమ్మంది. ఆ గుడ్డలు కట్టుకొని అమ్మ దగ్గర వాళ్ళిద్దరు కూర్చున్నారు. అమ్మ ఆయనకు పెట్టిన ఉత్తరీయమును కిరీటము లాగా చుట్టి ఇద్దరికి కలిపి తన మెడలోని దండతీసి వారికి వేసి పుష్పవృష్టి గావించింది. వారు ఆనంద పులకాంగితులై అమ్మ ఒడిలో వ్రాలిపోయారు. కన్నీటితో అమ్మ ఒడిని తడిపివేసారు. తర్వాత అమ్మ దగ్గర సెలవు తీసుకొని బయలుదేరి వెళ్ళారు. తర్వాత నేను అమ్మను అడిగాను. ఆయన ఏడ్పుకు కారణమేమై యుంటుందని. అమ్మ అన్నది. "పిల్లలు పుట్టంగానే ఎందుకు ఏడుస్తారో దీనికి అదే కారణమై ఉంటుంది".

ఆయన దివ్య మాతృదర్శనం, స్పర్శనం పొందిన తర్వాత అవి ఆయన అశ్రుధారలో లేక ఆనంద భాష్పాలో ఏవో మనం చెప్పలేం. కాని అమ్మ ఒడి మాత్రం తడిసిపోయింది. ఆయన అమ్మలో కలిసిపోయారు. ఇంకా ఆయనకు పునర్జన్మ ఏముంటుంది, లేదు ? వుండదు. *– నవంబర్, 2004*



## "ఏది చేసినా అది మన తృప్తికోసమే"

ఒకరోజు అమ్మ దర్శనానికి ఒక సోదరుడు వచ్చాడు. అమ్మ వాత్సల్యాలయంలో దర్శనం ఇస్తోంది. వచ్చేటప్పుడు దండ, పూలు కూడా తెచ్చుకొన్నాడు. తనవంతు కోసం ఎదురు చూస్తూ అమ్మ దగ్గరే నిల్చున్నారు. అమ్మ అతని వంక చూస్తూ "నాన్నా! నీవు దండవేసుకో" అన్నది. వెంటనే అతను ఆ దండ తన మెడలో వేసుకున్నాడు. అక్కడ నున్న వాళ్ళంతా నవ్వుకున్నారు. అతని ముఖము వెలవెలపోయింది. కాని అమ్మ నవ్వుతూ "ఫర్వాలేదు నాన్నా! నీవు చేసింది తప్పేమి కాదు. రా!" అంటూ లాలించి దగ్గరకు తీసికొంది. ఆ తెచ్చిన మిగతా పూలతో అమ్మకు పూజ చేసుకున్నాడు. ఒక రోజున ఒక సోదరుడు "అమ్మా! నీవు రాజరాజేశ్వరి అవతారమట కదా!" అన్నాడు. అమ్మ దానికి "నాన్నా! మీరు కానిది నేనేదీ కాదు" అన్నది.

అమ్మకు పూజ జరిగే సమయంలో అమ్మ తన చేతులతో తనే పూలను, పూలరెక్కలను తన పాదాల మీదనే చేసుకుంటూ కూర్చున్న దృశ్యం అనేకమంది సోదరులు గమనించే ఉంటారు అంటే తనలోని దైవత్వాన్ని తాను తెలుసుకోవడమే అన్నమాట. ఇది మాటలతో చెప్పకుండా క్రియతో మనకు తెలియ చేస్తున్నది.

ఒక సోదరుడు ఒకనాడు తాను వచ్చేటప్పుడు పూలు, దండ, అమ్మకు చీర తెచ్చుకున్నాడు. అవి ఒక సంచీలో పెట్టుకొని అమ్మ దగ్గరగా కూర్చున్నాడు. ఆ గదిలోనున్న వాళ్ళంతా పూజ చేసుకున్న తర్వాత మెల్లగా ఆ సంచీలో నున్న దండను తీసి అమ్మకు వేసాడు. పూలు తీసి పూజ చేసుకున్నాడు. మిగతా సంచీ అక్కడ పెట్టాడు. అమ్మకు నమస్కరించాడు. అమ్మ అతనిపై పూలు వేసి ఆశీర్వదించింది. కాని అమ్మ కళ్ళన్నీ ఆ సంచీ మీదనే వున్నాయి. అమ్మ అన్నది "ఆ సంచీలో ఇంకా ఏమైనా వున్నాయా? నాన్నా!" అని. ఏమీ లేదమ్మా అంటూ తటపటాయించాడు. అమ్మ ఆ సంచీ తనకు ఇవ్వమన్నది. మెల్లగా ఆ సంచీ అమ్మకు ఇచ్చాడు. అమ్మ మంచం మీద నుండి లేచింది. పాదుకలు వేసుకొని లోపలి గదిలోకి పోయి ఆ చీర కట్టుకొచ్చింది. అతని ఆనందానికి అవధులు లేవు. అది జనతా చీరె. అది అమ్మకు ఎట్లా పెట్టడం ? అనేది అతని బాధ.

ఉన్న తాహతు అంతే. కాని అమ్మకు ఆ పట్టింపులు లేవు. అతని మనస్సే ముఖ్యం. దానికి పూలు అక్కరలేదు. దండలు అక్కరలేదు. పట్టుచీరెలు అక్కర్లేదు. మనస్సే ముఖ్యం. అది మానసపూజైనా కావచ్చు. ఏది చేసినా అది మన తృప్తికోసమే.

– *నవంబర్, 2004*



# "నమస్కారం అంటే రెండు చేతులు కలపడమే కాదు"

నేను మొదటగా సంస్థాగత పనుల మీద హైదరాబాద్ తరచు వెళ్తూ వుండేవాడిని. హైదరాబాద్ వెళ్ళినపుడు పొత్తూరు వెంకటేశ్వరరావు గారింట్లోనో (అప్పుడు వెంకటేశ్వరరావు గారు చిక్కడపల్లిలో వారి అన్నగారింట్లో వుంటుండేవారు). విద్యానగర్‌లో టి.ఎస్.శాస్త్రి, రాధగారింట్లోనో లేక సికింద్రాబాద్‌లో సి.వెంకటకృష్ణ గారింట్లో ఎక్కడో ఒకచోట దిగుతూ వుండేవాడిని అమ్మ ఆదేశాల మేరకు. అప్పటికి సంస్థల నిర్మాణం జరుగలేదు. సంస్థల నిర్మాణ ఆవశ్యకత మాత్రం వుండేది. హైదరాబాద్ వెళ్ళినపుడు దాదాపు జిల్లెళ్ళమూడికి వచ్చే మన సోదరులందరినీ కలవటం ఒక అలవాటుగా వుండేది. అక్కడకు వెళ్ళిన పనులు అయిన తర్వాత బస్సులో జిల్లెళ్ళమూడి వెళ్ళే ప్రయత్నంలో బస్సుస్టాండ్‌కు మన సోదరులందరు 10, 15 మందికి తక్కువ కాకుండా నన్ను పంపటానికి వచ్చేవారు. నేను బస్సులో ఎక్కి బస్సు బయలుదేరే టైములో అన్నయ్యా అమ్మకు నానమస్కారము చెప్పుమని వారందరు నన్ను ఒక్కరొక్కరు చెప్పటం ప్రారంభించేవారు. సరే, సరే, సరే అనే వాడిని. బస్సు బయలుదేరుతుంటే ఏదో చెప్పలేని బాధ అందరికీ వెన్నంటేది. ఆ ఆప్యాయతల తీరు చెప్పనలవి కాదు. అనుభవించి తీరవలసిందే. నేను జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మను కలవగానే, నాన్నా హైద్రాబాద్‌లో మనవాళ్ళంతా ఎట్లావున్నార"ని అమ్మ అడిగేది. "అమ్మా ! శాస్త్రి, రాధ, వెంకటకృష్ణగారు, వెంకటరత్నంగారు అప్పుడు బస్సు దగ్గరకు వచ్చి నమస్కారాలు చెప్పమని నన్ను కోరిన వారందరి పేర్లు చెప్పి నీకు నమస్కారాలు చెప్పమన్నారమ్మా అని అన్నాను అమ్మ అంది "అవి అన్నీ ఎప్పుడో చేరాయి. నీవే లేటుగా వచ్చావని."

మనము తలచినంత మాత్రానే అవి అమ్మకు చేరాయా? లేక అవి అమ్మ తలిస్తేనే మనం తలచామా! నమస్కారం చేయించింది, చేయించుకున్నది ఒకటేనా? అమ్మ భావనా మాత్ర సంతుష్ట కదా!

## అంతా నా దయే !

ఒకసారి వాత్సల్యాలయంలో అమ్మ మంచం మీద కూర్చుని పూజలందుకుంటోంది. ఒక సోదరుడు అమ్మకు పూలదండ వేసి, పూలతో పాదాలకు పూజ చేసి, పాదాలకు మ్రొక్కాడు. "అమ్మా నీ దయవల్ల ఈ సంవత్సరం 10వ తరగతి పాసయ్యానమ్మా" అని అన్నాడు. అమ్మ అతని మీద పూలరేకులు చల్లింది. అతనిని చేతితో నిమిరింది. అతనికి పండు ప్రసాదంగా యిచ్చింది. అతనెంతో ఆనందం పొందాడు. అమ్మ అతనితో అన్నది "నాన్నా ఈ సంవత్సరం నీవు పదవతరగతి పాస్ కావటం నాదయే. నిరుడు పదవ తరగతి తప్పటం కూడా నా దయే" అని.

**– జనవరి, *2005***



# యద్ భావం తద్భవతి

మా ఐదవ కుమారుడు మురళీధర్ శ్రీకాకుళంలో (జిల్లా) మాథ్స్ లెక్చరర్గా పనిచేస్తున్నాడు. వాడికి అనిరుధ్ అనే ఐదు సంవత్సరాల కుమారుడు ఉన్నాడు. వాడికి అమ్మను గూర్చి ఎక్కువ ఆలోచనలున్నాయనటంలో ఎట్టి అతిశయోక్తి లేదు. ఒకరోజు మా మనవడు చిరంజీవి అనిరుధ్ వాళ్ళ నాన్నతో జిల్లెళ్ళమూడి వచ్చాడు. వాళ్ళిద్దరినీ అమ్మ ఆలయములోకి, హైమాలయము లోకి, తీసికెళ్ళి దర్శనం చేయించాను. తర్వాత హైమాలయము వెనుక ఉన్న పూర్వపు పూరిపాకగా నున్న అమ్మ ఇంట్లోకి తీసికెళ్ళాను. నేను జిల్లెళ్ళమూడికి మొదటిసారిగా 1960 ఆగష్టు 15న అమ్మను చూచినప్పటి నుండి 1962-63 నుండి 1970 దాకా నేను అక్కడనే అమ్మతో వుండటం మూలంగాను ఆ ఇంటితో నాకు ఎక్కువగా అవినాభావ సంబంధం వున్నది. అక్కడ నేను అమ్మతో గడిపిన జీవితంలోనే ఎక్కువ సంతృప్తి వుండేది. నాకు ఎక్కువ అనుభవాలు అక్కడనే వుండేవి. అక్కడే అమ్మ నాకు విశ్వరూప సందర్శనము ఇచ్చిన సంఘటన జీవితంలో అపురూపమైన అనిర్వచనీయమైన అనుభవము. ఇప్పటికీ రోజూ ఆలయాలకు వెళ్తే అక్కడ ఉన్న అమ్మ మంచం వద్ద కొంతకాలం అయినా గడిపితే గాని తృప్తిగా వుండదు. అట్లాగే అక్కడకు వాళ్ళను తీసికొని వెళ్ళి అమ్మకు నమస్కరించి కాసేపు కూర్చున్నాము. మా అనిరుధ్ "తాతయ్యా! ఈ మంచం ఏమిటి" అని అడిగాడు. "ఇది అమ్మ పడుకున్న మంచంరా" అని సమాధానం చెప్పాను. "అమ్మ ఇప్పుడు కూడా ఇక్కడే పడుకుంటుందా ?" అని అడిగాడు. "ఆ పడుకుంటుంది" అని సమాధానం చెప్పాను. అప్పుడు మధ్యాహ్నం 12 - 1 గంట అవుతున్నది. మంచి ఎండగా ఉన్నది. చాలా వేడిగా ఉన్నది. అయితే "ఇంత వేడిలో ఆ ఆలయంలో ఒంటరిగా ఉక్కపోస్తూ ఎంత సేపని కూర్చుంటుంది ఆ అమ్మను, ఈ రెండో ఆలయంలో ఉన్న దేవుడిని ఈ మంచం మీద పడుకోమని చెప్పు తాతయ్యా!" అని అన్నాడు. "వాళ్ళు రాత్రిపూట పడుకుంటారురా ఇప్పుడు పడుకోరు" అన్నాను. "అట్లా కాదు తాతయ్యా నీవు గట్టిగా పిలువు వాళ్ళు వచ్చి పడుకుంటారు" అని అన్నాడు. వాడికున్న విశ్వాసం నాకు లేదేమో. అట్లా పిలిస్తే వాళ్ళు వచ్చి పడుకుంటారని భావన నాకు తట్టకపోవడం ఆ విశ్వాసం నాకు నిండుగా లేకపోవటం నాకు

చాలా బాధ అనిపించింది. సరే పిలుస్తానులే అని వాళ్ళను భోజనాలకు తీసికెళ్ళాను. తర్వాత వాళ్ళు శ్రీకాకుళం వెళ్ళిపోయారు.

అప్పుడు అనసూయేశ్వరాలయం చుట్టూ వున్న ఇటికరాళ్ళతో కట్టిన గోడను తీసివేసి కొండరాళ్ళను చెక్కించి కొండరాళ్ళతో చుట్టూరా గోడలు కడుతున్నారు. దానికి చిలకలూరుపేట క్వారీస్ నుండి రాళ్ళు చెక్కేవాళ్ళు ప్రత్యేకంగా వచ్చారు. వాళ్ళందరు రాత్రి పూట రెడ్డి సుధతో పాటు ఆలయాల వెనుక అమ్మ ఇంటి ముందర మధ్యలో పడుకుంటూ వుండేవాళ్ళు – అదేరోజు రాత్రి అమ్మ ఆలయం నుండి, హైమ ఆలయం నుండి ఇద్దరు వ్యక్తులు కాళ్ళకు గజ్జల పట్టాలు పెట్టుకొని ఆ గజ్జల పట్టాలు సవ్వడితో మధ్య పడుకున్న వీళ్ళందరిని దాటుకుంటూ అమ్మ పాకలోకి వెళ్ళి పడుకున్నారు. ఎవరికి వాళ్ళు వారిని దాటిపోవటం గమనిస్తూనే ఉన్నారు. కాని ఒకరితో ఒకరు చెప్పుకోలేదు. మరల తెల్లవారుఝామున దాదాపు 4 గంటలకు మళ్ళీ లేచి అదే విధముగానే వాళ్ళను దాటుకుంటూ వాళ్ళ వాళ్ళ ఆలయాలలోకి వెళ్ళారు. ఇంతలో 4 గంటలకు జేగంట కొట్టటం, బ్రహ్మాండం శేషక్కయ్య, పద్మావతి అక్కయ్య, లక్ష్మివాళ్ళు అమ్మ, హైమలకు ఆలయాలలో మామూలుగనే స్నానాలు చేయించటానికి రావటం జరిగింది. తెల్లవారింతర్వాత దాదాపు ఉదయం 9 గంటలకు నేను గుంటూరు "విశ్వజనని" ఆ నెల పత్రిక పని మొదలు పెట్టటానికి వెళ్ళాలని ఆటో ఎక్కాను. ఆటో బయలుదేరుతుండగా "రెడ్డి సుధ అన్నయ్యా!" అంటూ కేకలు పెట్తూ పరిగెత్తుకొని వస్తున్నాడు. "ఏమిటిరా?" అని వాడిని అడిగాను. పై సంగతి వాడు చెప్పాడు. "సరే నేను మళ్ళీ జిల్లెళ్ళమూడి వచ్చిన తర్వాత ఆ చిలకలూరిపేట నుండి వచ్చిన వాళ్ళను కూడా విచారించి పత్రికలో ఆర్టికలు రాస్తానులే" అని చెప్పాను. "నేను వచ్చిన తర్వాత వాళ్ళను పిలిపించు" అని చెప్పాను. నేను పత్రిక పూర్తి చేసికొని రావటానికి 4 రోజులు పట్టింది. వచ్చిన వెంటనే సుధకు కబురు చేసాను. కాని వాళ్ళందరు చిలకలూరిపేట వెళ్ళిపోయారు, కొత్తవాళ్ళు వారి స్థానంలో పనిచేయటానికి వచ్చారు. మీరు వస్తారు కదా అని వాళ్ళ పేర్లు వివరాలు తీసికోలేదని చెప్పాడు. నేను వాళ్ళను స్వయంగా విచారించి వాళ్ళ పేర్లు, వివరాలతో ఆర్టికలు రాస్తే అది చరిత్రగా వుంటుంది గదా అని ఆలస్యం చేసాను. కాని ఇది ఒక అనుభవంగా మాత్రమే మిగిలిపోయింది. అమ్మను హృదయంతో గట్టిగా పిలిస్తే పలుకుతుందనే అనుభవం 1975వ సంవత్సరం 30వ తేది అర్థరాత్రి అమ్మ ఇంటిమీద నక్సలైట్లు

దాడి చేసి నన్ను మారణాయుధాలతో చంపబోయినప్పుడు అమ్మా! అని గట్టిగా కేకవేసిన నన్ను 'నిన్ను మీ అమ్మ, బొమ్మ ఎవరూ రక్షించలేరురా, నీవు నా చేతులలో చస్తున్నావని' బరిసె పెట్టి నా గుండెలలో పొడిచినప్పుడు ఏ రకంగా నేను వారి నుండి రక్షింపబడ్డానో అమ్మ చరిత్రలోనే ఒక సువర్ణాక్షరాలతో లిఖింపవలసిన ఘట్టము. అటువంటి ప్రత్యక్ష అనుభవము నాకున్నా అది constant awareness గా లేకపోవటం, అది మా మనువడు చిన్నపిల్లవాడైనా జ్ఞాపకం చెయ్యటం అదీ నాకు ఒక అదృష్టమేమో. అదే రోజు ఈ సంఘటన జరగటం ఆశ్చర్యకరమైన విషయం.

**– జులై, *2005***



# అహం బ్రహ్మాస్మి

"చతుస్సాగర పర్యంతం గో బ్రాహ్మణేభ్యః శుభం భవతు. కాశ్యప, వత్సార, నైధృవ రేభ, రైభ, శిండిల, శాండిల్య, సప్తా ఋషేయ ప్రవరాన్విత కాశ్యపస గోత్రస్య కొండముది బాల గోపాలకృష్ణమూర్తి శర్మ నామధేయస్య అంహాంభో అభివాదయే" అని పీఠాధిపతుల వద్దకు, యతుల వద్దకు, పెద్దవారి వద్దకు మనం వెళ్ళినపుడు మనని గురించి మనం ప్రవర చెప్పుకుని నమస్కరించటమనేది ఒక సంప్రదాయ పద్ధతి. దీనిని పాటించటం ఒక రకమైన సంస్కారము. ఎవరీ బాలగోపాల కృష్ణమూర్తి అనెడు జీవి ? తన జననీ జనకులకు పుట్టిన తరువాత దాదాపు 21 రోజుల లోపుల నామకరణోత్సవం (బారసాల) చేస్తారు. అప్పటి నుండి పై పేరుతోనో లేక దానికి సంబంధించిన ఇతర పేర్లతోనూ అనగా, బాలకృష్ణమూర్తి, గోపాలకృష్ణమూర్తి, కృష్ణమూర్తి, గోపి, కె.బి.జి.కృష్ణమూర్తి, కె.బి.జి. అనే వివిధ నామాలతో పిలుస్తూంటారు. ఎవరు ఏ పేరుతో పిలిచినా తననే పిలుస్తున్నారని అవగాహనయై ఓయ్ అని పలుకుతునే ఉంటాడు. పై జీవిని ప్రత్యేకంగా గుర్తించటానికి పెట్టుకున్న పేర్లే పైవన్నీ. ఈ సృష్టిలో అనేక కోట్ల జీవరాశులలో ఇతను ఒకడు. ఇతడు భగవంతుని ఆదేశానుసారము మానవుడై పుట్టాడు. ఒక్క భార్యాభర్తల కలయిక వల్లనే పిల్లలు పుడతారనే నమ్మకమేమీ లేదు. అనేక మంది భార్యాభర్తలు నిస్సంతువులై ఉన్న అనేక దాఖలాలు మనము చూస్తూనే ఉన్నాము. ఇందులో భార్యా భర్తల యొక్క ప్రత్యేకమైన ప్రతిభ ఏమీ లేదనే చెప్పవచ్చును. ఈ జీవికి పంచభూతాత్మకమైన శరీరము ఆత్మతో కలసి యుంటుంది. ఈ పంచభూతములు సృష్టిలో నున్న పంచ భూతములే. ఈ ఆత్మ అంతటా నిండియున్న పరమాత్మ స్వరూపము నుండి ఉద్భవించినదే. ఈ సర్వసృష్టి పంచభూతాత్మక మైనదే. ఈ పరమాత్మనే పరబ్రహ్మమని కూడా అంటారు. ఈ సర్వ జీవులన్నీ సృష్టిలోని భాగాలే. అందుకే ఈ సృష్టిని పరబ్రహ్మమని. పరమాత్మ స్వరూపమని ఈ కనపడేదంతా 'అదే' అని 'అది' తప్ప నాకేది కనపడటం లేదని అమ్మ చెప్పిన దాంట్లో ఎంత సత్యమున్నదో ఒక దార్శకునికే తెలుస్తుంది. అందుకే అందుకు తార్కాణంగా "నేను అమ్మను మీరు బిడ్డలు. అంతే కాదు. మీరు నాకు అవయవాలు" అంది. "అమ్మ అంటే ఈ జిల్లెళ్ళమూడిలో ఈ మంచం మీద కూర్చున్న అనసూయయే కాదు అంతా అయినది, అర్థం కానిది, ఆది అంతములు లేనిది, సర్వానికీ ఆధారమైనది" అని పలికింది. అటువంటి సర్వసృష్టి తానైన అమ్మ "నేను నేనైన నేను, అన్ని నేనులు నేనైన నేను"

అని తా నెవరో మనకు స్పష్టంగా తెలియపర్చింది. ఒక్క చిన్న జీవిని అన్ని పేర్లతో పిలుస్తుంటే ఓయ్ అని పలుకుతుంటే సర్వము తానైన అమ్మను ఏ పేరు పెట్టి పిలిచినా ఓయ్ అని ఎందుకు పలకదు. తెలుసుకొనటానికి తగిన హృదయం కావాలి, పిలిస్తే పలుకుతుంది. అని తనమీద నమ్మకం తనకే వుండాలి. ఉన్నది భగవంతుడు ఒక్కడే వాడు రూపరహితుడు, నామ రహితుడు. అంటే అన్ని రూపములు, అన్ని నామములు తానే యైన వాడు కనుక ఏ రూపములో ఆరాధించినా, ఏ నామంతో పిలిచినా పలుకుతాడు. ఏ రూపమైనా ఉన్నది శక్తి ఒక్కటే అందుకే "యాదేవీ సర్వభూతేషు శక్తి రూపేణ సంస్థితా, నమస్తస్యై నమస్తస్యై, నమస్తస్యై, నమోనమః యా దేవీ సర్వ భూతేషు బుద్ధి రూపేణ, జ్ఞాన రూపేణ, ఇచ్ఛారూపేణ సంస్థితా నమస్తస్యై నమస్తస్యై నమోనమః అని వివిధ రకములుగా దేవీ సప్తశతిలో వున్న ఒక్క శక్తినే అనేకంగా స్తుతించారు. అమ్మ అన్నారు "అన్ని గుణాలూ ఆయనవే కనుక గుణరహితుడు అన్ని సంకల్పాలూ వాడివే కనుక సంకల్ప రహితుడు" అని నాణానికి రెండో వైపు కూడా చూపారు. "ఉత్తమమైనటు వంటిది తానైతే అల్పం తాను కాదా ? ప్రజ్ఞానం బ్రహ్మ అయితే అజ్ఞానం ఎందుకుకాదు ? అన్నం పరబ్రహ్మ స్వరూపం అయితే అశుద్ధమెందుకు కాదు? శబ్దం బ్రహ్మ అయితే సైలెన్సూ బ్రహ్మే" అంటే సర్వం బ్రహ్మమయం. అది కానిది ఏదీ లేదు అని స్పష్టంగా తెలియచేసారు. ఒక జీవి, తాను పుట్టింతరువాత బాల్యం, కౌమారం, యవ్వనం, వార్ధక్యం అనే దశలను పూర్తి చేసికొనో లేక అంతకంటే ముందుగనే జీవితానికి చరమదశ అయిన మరణ ప్రాప్తిని పొందుతున్నారు. మరణం అంటే పరిణామమే. నాశనం అని కాదు. తరుణం అంటే తప్పనిసరి అంటే తప్పించుకోవటానికి వీలు లేనిది అని అర్థం. ప్రారబ్ధం అంటే భగవంతుడే. ప్రారబ్ధం మీ చేతులలో లేదు. చేతులు చేతలు వాడివే. చేతులు నీ వనుకుంటున్నావు కనుక చేతలు నీవే అనుకుంటున్నావు. జరిగే పనంతా కర్మే. చేయించేదంతా కర్తే. జన్మకు కారణం అకారణం. నా సంకల్పంతోనే మీరు జన్మ ఎత్తి నాలోనే లీనం అవుతారు. మహాసముద్రం నుండి వచ్చిన అలలు ఆ మహాసముద్రములోనే కలిసినట్లుగా. అలలు ఆ మహా సముద్రము నుండి వేరు కావని తెలిసికోవటమే జ్ఞానం. ఈ సర్వ సృష్టీ తానై యుండగా దేవుడుని ఎక్కడని దేవులాడుతావు. అందుకే అమ్మ అన్నది – దేవులాడినా దొరకనివాడే దేవుడని. "అందరూ నా ఒడిలోనే తిరుగుతున్నారు. నా ఒడిని విడిచి ఎవరూ లేరు" అని అమ్మ ప్రత్యేకముగా మనని ఎన్నుకొని, "కని" ఆ అమ్మనుండి మనము వేరుగామని చాటిన బ్రహ్మయే మనమని తెలుసుకొందాము. – **ఆగష్టు, 2005**

# అమ్మ నన్ను ఎట్లా చూచిందో?

10.1.05 రోజు మధ్యాహ్నం శ్రీ విశ్వజననీ పరిషత్ ఆఫీసులో కూర్చొని సెక్రటరీ శ్రీ లక్ష్మణరావు గారితో మాట్లాడుతున్నాను. ఇంతలో ఎవరో వచ్చి అన్నయ్యా! కుర్చీ నుండి క్రిందకు రక్తం కారుతుంది ఏమిటో చూడమన్నాడు. కుర్చీలో నుండి లేచి చూడగా, కుర్చీనిండా రక్తం, డ్రాయర్, ధోవతి, షర్టు మొత్తము తడిసియున్నది. అది చూడగానే ఒక నిమిషం ఏమీ తోచలేదు. అప్పుడు అన్నపూర్ణాలయంలో పిల్లలంతా భోజనం చేస్తున్నారు. ఆఫీసులోను, వరండాలోను చాలామంది వున్నారు. నేను వెంటనే లేచి ప్రక్కనే ఉన్న మా ఇంట్లోకి వెళ్ళాను. నేను వెళ్తున్నప్పుడు ఆ రక్తం వీళ్ళంతా ఆశ్చర్యకరంగా చూస్తున్నారు. నేను బాత్‌రూమ్‌కు వెళ్ళి గుడ్డలన్నీ తీసివేసి, శుభ్రం చేసుకొని రక్తం ఆగిన తర్వాత నీరసంగా వుంటే గదిలో పడుకొనున్నాను. తర్వాత మెడికల్ సెంటరు డాక్టరు గారు గాని, హోమియో డాక్టరు గారు గాని వున్నారేమో అని హాస్పిటల్సుకు వెళ్ళి చూస్తే రెండు హాస్పిటల్సు తాళాలు వేసియున్నవి. తిరిగి వస్తుండగా డా॥ కోన సత్యం ఎదురపడి ఏమిటని అడిగేడు. విషయాలు చెప్పాను. ఒక హోమియో మందు డోసు తీసికొచ్చి యిచ్చి వీలైనంత త్వరలో దీనిని Investigation చేయించుకోమని సలహా ఇచ్చేడు. ఇంతలో మెడికల్ సెంటర్ డాక్టరు గారికి ఎవరో చెప్పారుట ఆయన నర్సుతో సహా వచ్చి శరీరంలో నుండి ఎక్కడ నుండి రక్తం వస్తున్నా ఆగేటట్లుగా ఇంజక్షన్ చేసి దీనిని పరీక్ష చేయించవలసినదిగా సలహా చెప్పారు. ఏ నొప్పి లేకుండా, బాధ లేకుండా తనకు తెలియకుండానే ఇంత రక్తస్రావం కావటం మంచిది కాదని చెప్పారు. తర్వాత బాపట్ల, గుంటూరు డాక్టర్లు కూడా ఇదే సలహా చెప్పి విజయవాడలో నాగార్జునా హాస్పిటల్సులో టెస్ట్ చేయించమని అక్కడ నున్న డా కె.జగన్మోహనరావు గార్కి లెటరు వ్రాసి యిచ్చారు. అట్లాగే నాగార్జునా హాస్పిటల్సుకు విజయవాడ వెళ్ళి Gastroenterologist వద్ద colonoscopy 27.1.05న చేయించగా intestineలో నుండి రక్తం రాలేదని, కాన్సరు కాదని, వచ్చిన రక్తం Internal piles నుండే వస్తుందని చెప్పారు. అంత రక్తం Piles నుండి వస్తుందా అని ఆ డాక్టర్ గారిని అడిగితే అటువంటి కేసులు 1% మాత్రమే వుంటాయని అది మీకు వచ్చిందని చెప్పారు. ఈ Internal Piles ఆపరేషన్ ఈ వయసులో చెయ్యటం మంచిది కాదని కావలసియుంటే pads వేస్తామని చెప్పారు. చివరకు

Internal blood piles అని నిర్ధారణ చేసిన తర్వాత హోమియో మందు తీసికొందామని నిర్ణయం చేసికున్నాను. గుంటూరులో డాక్టరు రాఘవరావు గారు సత్యసాయి హోమియో క్లినిక్‌లో ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారి శిష్యుల దగ్గర మందు తీసికుంటున్నాను. ఈ మందు ఉదయం రాత్రి తీసుకోవలసియుంది. ఈ మందు ఆహారం తీసికొన్న తర్వాత 1 గంట తర్వాత గాని తీసికోకూడదు. నేను రోజు దాదాపు మధ్యాహ్నం 1 గంట భోజనం చేసిన తర్వాత పడుకోవటం ఈ మధ్య అలవాటైనది. అట్లాగే పడుకోగా ఒకరోజు మద్యాహ్నం 3 గంటల వరకు నిద్ర మెలకువ రాలేదు. నేను నిద్రపోతూ వుండగా "పెదనాన్నా ! 3 గంటలైంది ఇక లేచి మందు వేసుకోమని వరసగా రెండుసార్లు అమ్మ మాట వినపడింది. అమ్మ మాట వినగానే ఒక్కసారి నిద్రలేచి చూడగా అప్పుడు 3 గంటలైంది. ఆ గదిలో నేను ఒక్కడినే పడుకొని నిద్రపోతున్నాను. అవతల గదులలో మిగతావాళ్ళంతా పడుకొని నిద్రపోతున్నారు. తలుపులన్నీ వేసి వున్నాయి. బయటకు వెళ్ళి చూడగా ఆఫీసులోను, వరండాలోను, అన్నపూర్ణాలయం షెడ్‌లోను ఎవరు లేరు. ఆశ్చర్యం వేసింది. మందు వేసుకునే టైమ్ అయిందని అమ్మ నన్ను లేపటం. నన్ను ఎంతగా అమ్మ కనిపెట్టి వున్నదో అనిపించింది.

అట్లాగే ఒకరోజు రాత్రి నిద్రపోతున్నాను. తెల్లవారు ఝామున "అన్నయ్యా 4 గంటలైంది సుప్రభాతం టైమ్ అయింది" అని అమ్మ గొంతు ఒకటికి, రెండుసార్లు వినపడింది. లేచి చూస్తే తెల్లవారుఝామున సరిగ్గా 4 గంటలైంది. అప్పుడు బాలమ్మ గారు 4 గంటలకు జే గంట రోజులాగే కొట్టారు. మామూలుగానే శేషక్కయ్య, పద్మావతి అక్కయ్య వాళ్ళు అమ్మకు కాఫీ పెట్టుకొని ఆలయాలకు వెళ్ళి అమ్మకు హైమకు స్నానాలు చేయించి,కాఫీ నివేదన పెట్టడం నిత్యం వాళ్ళకున్న అలవాటు. ఒకరోజు అమ్మ తనకు ప్రొద్దునే కాఫీ యివ్వటంలేదే అని పద్మావతి అక్కయ్యను అడిగిందట. అందువల్ల అప్పటినుండి అమ్మకు, హైమకు కాఫీ తెల్లవారి ఝామునే నివేదన పెట్టుతున్నారు. ఇట్లా మన నిత్యకృత్యాలలో కూడా నిరంతరం అన్నీ చూస్తున్న అమ్మను మనం ఎట్లా చూడాలో ఆలోచించండి.

– *అక్టోబర్, 2005*

# మనం అమ్మను ఎట్లా చూడాలి ?

అమ్మను ఎట్లా చూడాలి?అనే అంశంలో అమ్మను చూడటము అనేది ఇపుడు ఒక మీమాంస. అమ్మ స్వరూపంలో వుంటే అమ్మను చూచే విధానము వేరుగా వుంటుంది. అమ్మతో తమ జీవితాలను గడిపి, అమ్మకు తమచేతనైనంత సేవ చేసిన మహనీయులెంతమందో అమ్మ చరిత్రలో యున్నారు. అమ్మ ఎవరు ఏమి చేసినా వారి తృప్తి కొరకే. వారికోసమే చేస్తున్నారు అని అంటుంది. అదైనా అమ్మ నిర్ణయం వరకే జరుగుతుంది కాని మనం చేద్దామంటే మనమేమీ చేయలేము. భౌతికంగా అమ్మను ఎట్లా చూడాలనే విషయం మనకు కొంత అవగతమవుతుంది. కాని సర్వము తానైన అమ్మను మనం ఎట్లా చూడాలి అనే విషయం అంత తేలిక కాదు. కాని సర్వం తానైన అమ్మ మనల్ని అనుక్షణము చూస్తున్నది అనే స్ఫురణ ఏ మాత్రము మన జీవితాలలో అవగాహన చేసుకుంటున్నా మనకు తెలుస్తునే యుంటుంది. మరి అమ్మ మనని చూస్తున్నది గదా ? మనము ఎందుకు చూడలేము ? అనేది నాకు నేను వేసుకున్న ప్రశ్న ? ఇది ఎట్లా సాధ్యం ? నాకు తోచిన లేక తోపింపచేసిన విషయాలను ఇక్కడ ప్రస్తావిస్తున్నాను.

ఒకసారి అమ్మను చిన్నప్పుడు తన పినతండ్రి మన్నవ రామబ్రహ్మం గారు వాసుదాసస్వామి వారి దగ్గరకు తీసికెళ్ళి ఆశీర్వదించమని కోరుతారు. అప్పుడు ఆ స్వామి "అమ్మా ! నిన్ను ఏమని ఆశీర్వదించమంటావు?" అని అమ్మను అడుగుతారు. అంత అమ్మ స్వామీ "నన్ను ఎవరు ప్రేమించినా ప్రేమించకపోయినా నేను అందరిని ప్రేమించేటట్లుగా ఆశీర్వదించండి" అని చెప్తుతుంది. ఆయన ఆశ్చర్యపోతారు. ఏమిటీ కోరిక ? ఎవరైనా తనను ప్రేమించిన వారిని ప్రేమించటం సహజం. కాని తన్ను ప్రేమించినా, ద్వేషించినా తాను ప్రేమించటం - ఇది అసాధారణమైన కోరిక. కాని అమ్మ జీవితాన్ని మనం పరిశీలిస్తే, ఇది సాధ్యమే అని తన అనంత ప్రేమ స్వరూపాన్ని మనకు అవగతమయ్యేటట్లుగా చేసింది.

ఒకసారి 1975లో ఒక సోదరుడు మామీద పాంప్లేట్స్ వేసి మమ్మల్ని అప్రతిష్ఠపాలు చేయటానికి ప్రయత్నించాడు. అప్పుడు నేను, మా సోదరుడు రామకృష్ణ శ్రీ విశ్వజననీ పరిషత్ కార్యదర్శకులుగా వున్నాము. ఇంకా ఎన్నో నా పర్సనల్ విషయాలు కూడా విమర్శించాడు. అప్పుడు నాకు చాల బాధవేసి ఈ

పదవుల నుండి తప్పుకుందామని జిల్లెళ్ళమూడిలో వుండటం విరమించుకుందామని నిర్ణయం చేసుకున్నాను. ఇది తెలిసిన అమ్మ నన్ను వాత్సల్యాలయానికి పిలిపించి "నాన్నా! నీకు నేను ఒక బ్రహ్మోపదేశం చేస్తాను. అది నీవు అనుసరించు" అని నా గడ్డం పట్టుకొని తల నిమురుతూ అడిగింది. ఆ బ్రహ్మోపదేశమేమిటో తెలియదు. ఏమి చెపుతుందో తెలియదు కాని అమ్మ నన్ను అడిగిన తీరును బట్టి నేను సరే అన్నాను.

"నాన్నా! నీ హృదయం ఒక గంగాళం పాల లాంటిది. ఆ పాలలో ఒక చుక్క విషయం పడ్డా గంగాళం పాలు విషయపూరితం అవుతాయి. కనుక ఆ విష బిందువు నీ హృదయంలో పడనీయబోకు" అని చెప్పింది. అయితే ఆ క్షణం నుండి నా మనస్సు ఆ ఉపదేశం మీదే వున్నది. అప్పటి నుండి ఎవరు ఏమి అన్నా, ఏమి చేసినా ఆ క్షణంలో ఆవేశంలో కోపం వచ్చినా మరుక్షణం, వాళ్ళు నాతో మాట్లాడకపోయినా వాళ్ళను మాట్లాడించటం వారిని ప్రేమించటం ఒక అలవాటైంది. దీనికి నా జీవితంలో అనేక సంఘటనలు చోటు చేసుకున్నవి. అవి నేను ఇక్కడ ప్రస్తావించటం లేదు. అమ్మ నా కిచ్చిన ఈ బ్రహ్మోపదేశము నా కొక్కరికే కాదు ఇది అందరికీ వర్తిస్తుంది.

ఈ బ్రహ్మోపదేశం మన సోదరులందరు ఆచరించగలిగితే మనము ఇతరులకు విరోధులము కావచ్చేమోకాని మనకు విరోధులంటూ ఎవరు ఉండరు. మన సోదర ప్రేమకు అంతరాయము లేదు. శ్రీపాద గోపాల కృష్ణమూర్తి గారు మన సోదరీ సోదరులను "మీ తోడబుట్టిన వారు" అని సంబోధించేవారు. అమ్మ మనలను బిడ్డలుగా ప్రేమిస్తే మనలో అదే ప్రేమను ఈ తోడబుట్టిన వారు అవి పంచుకుంటే అంతకంటే ఆనందం ఏమి వుంటుంది ? ఇప్పుడు చాలా కుటుంబాలలో ఈ ప్రేమలు అంతరించాయి. ఇదే తల్లిదండ్రులను ప్రేమించటం, అక్కచెల్లెళ్ళను ప్రేమించటం, అన్నదమ్ములను ప్రేమించటం ఇక అందరిని అన్నిటిని ప్రేమించటం అలవాటైతే అదే విశ్వ ప్రేమ దివ్య ప్రేమ అవుతుంది. ఇది చేయకలిగితే అమ్మను కొంతవరకు చూచినట్లే. అమ్మ మనకు శారీరకంగా దూరమైన రోజులలో 1985లో మన సోదరుడు వెస్టర్‌లెండ్ అమెరికా నుండి నాకు ఒక లెటరు వ్రాశారు. అందులో Mother has not gone anywhere, She is very much here, She is very much with us. She is embodiment of love. Love is God.

అని వ్రాశాడు. సద్గురు శ్రీ కందుకూరు శివానందమూర్తి జిల్లెళ్ళమూడిలో మాట్లాడుతూ అమ్మ ఒక పరంజ్యోతి. ఆ జ్యోతిని మనము వెయ్యి జ్యోతులుగా వెలిగించాలి. ఆ వెలుగు ఇంటి ఇంటికి ప్రసారం చేయాలి. మనం వెయ్యి జ్యోతులు వెలిగించినా ఆ జ్యోతి అట్లాగే నిశ్చలంగానే వుంటుంది. అమ్మ కాలస్వరూపిణి కాళిక. కాళిక అమ్మవారిలో ప్రత్యేకత ఏమిటంటే మనకు జన్మ నిస్తుంది. మళ్ళీ తనలోనే కలుపుకుంటుంది. అందుకే అమ్మ అంది మిమ్ములను కన్నది నేను, మీరు నా ఒడి విడిచి ఎక్కడకు పోలేరు. ఇంతవరకు మనము ప్రేమ చేయకలిగితే కొంతవరకు అమ్మను చూస్తున్నట్లే. అమ్మది స్ఫటికమైన, నిర్మలమైన నిష్కలంకమైన, నిస్వార్థమైన ప్రేమ. ఆ ప్రేమకు మనం వారసులం. మన జీవితాలను అందులోనే పునీతం చేయవలసి వుంది. **- డిసెంబర్, 2005**



# అమ్మ హైమను మహాసమాధి చేయటంలో అంతరార్థం

అది 1963వ సంవత్సరం. అమ్మ శేషగిరిరావు అన్నయ్య చేత కట్టించబడిన పూరింట్లో వుంటూ వుండేది. నేను, మా సోదరుడు కొండముది రామకృష్ణతో కలిసి 1960 ఆగస్టు 15వ తేదీ మొదటిసారిగా జిల్లెళ్ళమూడి వచ్చాను. తర్వాత 1961 ఆగస్టు 15వ తేదీ వచ్చాను. 1962లో అమ్మ జన్మ దినోత్సవానికి రామకృష్ణ, బ్రహ్మాండం సుబ్బారావు ప్రేరణతో "మాతృశ్రీ జన్మదినోత్సవ సంచిక" ప్రింటు చేసి ప్రచురించటం మొదలు పెట్టాము. అది మన్నవలో అమ్మ జన్మదినోత్సవం రోజున అమ్మచే ఆవిష్కరింప చేశాము. అప్పటినుండి 1963, 64, 65, 66 అమ్మ జన్మదినోత్సవ సంచికలు తీసుకొచ్చాము. తర్వాత మాతృశ్రీ మాసపత్రికగా అవిచ్ఛిన్నంగా 25 సంవత్సరాలు ప్రచురించడం అందరికీ తెలిసిన విషయమే. ఇంతకీ 1963 దాకా నేను ఎప్పుడు వచ్చినా రామకృష్ణతో కలిసి రావటమే కాని ఒంటరిగా జిల్లెళ్ళమూడి రాలేదు. ఒకరోజు నేను మా పుస్తకాల షాపులో వుండగా అమ్మ నాకు కబురు చేసింది. నీవు ఇక్కడకు రావటానికి రామకృష్ణతోనే రావలసిన అవసరం లేదు. నీవు ఒంటరిగా ఈరోజు రాత్రి జిల్లెళ్ళమూడి రావలసింది అని. అమ్మ ఎందుకు కబురు చేసారో నని షాపు మూసిన తర్వాత రాత్రి 9-10 గం॥ పెదనందిపాడు బస్సులో బయలుదేరాను. 7వ మైలు రాయి దగ్గర దిగి చూచేటప్పటికి గాడాంధకారంగా వున్నది. వంతెన దిగిన తర్వాత జిల్లెళ్ళమూడి పోవటానికి దారి కనపడలేదు. అట్లాగే రోడ్డు మీద నిల్చున్నాను. 5 నిమిషాల తర్వాత ఆ డొంకలో సన్నగా దారి కనబడటం ప్రారంభించింది. గుట్టల మీదగా పుట్టల మీదగా జిల్లెళ్ళమూడి ఎట్లాగో చేరాను. అమ్మ ఆ పూరింట్లో హాలులో మంచం మీద కూర్చుని ఉన్నది. అక్కడ ఎదురుగా నున్న బావి దగ్గర కాళ్ళు కడుక్కొని అమ్మ దగ్గరకు చేరి అమ్మకు నమస్కరించాను. నీకేం భయం లేదు ఒంటరిగా వస్తుండవచ్చు అన్నది. అప్పుడు అమ్మ దగ్గర సోదరి వరలక్ష్మి ఉంటూ ఉండేది. నాకు ఇంత అన్నం తెప్పించి అమ్మే పెట్టింది. తర్వాత అమ్మ దగ్గర తెల్లవార్లూ కూర్చునే ఉన్నాను. ప్రసంగంలో రామకృష్ణకు మృత్యు గండం వున్నదని శ్రీ ఎక్కిరాల వేదవ్యాస రామకృష్ణ మొహం చూసి చెప్పాడని చెప్పింది. దీనికి ఏం

చేయాలో నీవే ఆలోచించి చెయ్యమన్నది. రామకృష్ణను నీకెవ్వరైనా ఆత్మీయులు ఉన్నారా అని అడిగితే నీ పేరు చెప్పాడు. అందుకు నిన్ను పిలిపించానని చెప్పింది. నాకు రామకృష్ణ బంధువు కంటే ప్రాణస్నేహితుడు. ఈ వార్త తెలిసిన క్షణంలో నాకు దుఃఖం ముంచుకొచ్చింది. తెల్లవార్లూ ఏడుస్తూ అమ్మ దగ్గరే కూర్చున్నాను. అమ్మతో "ఇప్పుడు ఎట్లాగమ్మా నన్ను ఏమి చేయమంటావు ? నీవు ఏమి చెప్తే అది చేస్తాన"ని చెప్పాను.

ఈ విషయం రామకృష్ణ తల్లియైన అన్నపూర్ణమ్మ గారికి కూడా తెలిస్తే మంచిదని చెప్పించి. ఈ విషయం ఆమెతో ఎట్లా చెప్పేటట్లు ? ఇక గత్యంతరం లేక అప్పికట్ల వెళ్ళి ఆమెతో ఈ విషయం మెల్లిగా చెప్పాను. నాకే అంత దుఃఖం వస్తే ఆమె సంగతి చెప్పాలా ? ఆమె, రామకృష్ణ తాత 30 సం॥లకు పోయారని, వాళ్ళ నాన్న కూడా 30 సం॥లకు పోయారని, వీడికి కూడ ఈ వయస్సులోనే మృత్యు గండం రావడమేమిటని, కరణీకం వాళ్ళ కుటుంబానికి అచ్చి రాలేదని, కరణీకం వద్దన్నా వాడు వినకుండా కరణీకమే చేస్తున్నాడని ఏడ్చింది. తర్వాత వాడికి నీకంటే ఆప్తుడు ఎవరూ లేరని, నీవే ఏదో చెయ్యమని చెప్పింది. తర్వాత నేను బాపట్ల వెళ్ళి మా కుటుంబానికి సన్నిహితులైన చుండూరు రాఘవయ్య గారితో సంప్రదించాను. ఆయన శివునికి అభిషేకాలు చెయ్యడం మినహా వేరే గత్యంతరం లేదన్నాడు. అప్పుడు రామకృష్ణతో ఈ విషయం చెప్తే అమ్మ పాదాలకు తప్ప ఎవ్వరికీ అభిషేకాలు చేయనన్నాడు. ఈ విషయం అమ్మతో చెప్తే తగిన ఏర్పాట్లు చెయ్యమన్నది. బాపట్ల నుండి పురోహితులను తీసుకొని, మహన్యాసపూర్వక ఏకాదశ రుద్రాభిషేకం ప్రతి ఆదివారం రామకృష్ణ చేత చేయించేవాడిని. ఆదివారం మాషాపుకు సెలవు. కాబట్టి ఆదివారం ఎంచుకున్నాను. ప్రతి ఆదివారం బాపట్ల నుండి వచ్చి 10 వారాలు అభిషేకాలు చేయించాను. 11వ వారం మహా రుద్రాభిషేకం చెయ్యాలని నిర్ణయించాము. శివుడు గుడిలో అభిషేకాలు చేస్తాము. బ్రాహ్మణులు వస్తారు కాని అమ్మ పాదాలకు అభిషేకం చేయించడానికి ఎవరూ ముందుకు రాలేదు. అటువంటి స్థితిలో మహారుద్రాభిషేకానికి 11 మంది బ్రాహ్మణులు కావాలి. ఎట్లా ? మొత్తానికి మహా రుద్రాభిషేకం చేయించటానికి నిర్ణయమైంది. ఆ అభిషేకానికి ద్వాదశ నదీ పుష్కర తీర్థాలు తీసుకొచ్చి చేస్తే బాగుంటుందని కొంతమంది సలహా చెప్పారు. అన్ని నదులు సముద్రములోనే కలుస్తాయి కనుక బంగాళా ఖాతము, హిందూ

మహా సముద్రము, అరేబియా సముద్రము కలిసే కన్యాకుమారి నుండి సముద్ర జలాన్ని మహాతీర్థం అంటారు. అక్కడ నుండి తీర్థం తీసికొచ్చి మహారుద్రాభిషేకం చేయమని కొందరు సలహా యిచ్చారు. చివరకు కన్యాకుమారి వెళ్ళటానికి నిర్ణయమైంది. కన్యాకుమారికి వెళ్ళే ముందర మధుర వెళ్ళటానికి నిర్ణయమైంది. కన్యాకుమారికి వెళ్ళే ముందర మధుర వెళ్ళి తర్వాత కన్యాకుమారి వెళ్ళమని అమ్మ సలహా చెప్పింది. మధుర వెళ్ళి మీనాక్షీ అమ్మవారిని దర్శనం చేసుకొని అక్కడ నుండి కన్యాకుమారి వెళ్ళాను. కన్యాకుమారిలో కన్యాకుమారి అమ్మ వారి దర్శనం కోసం ఆలయానికి వెళ్ళాను. అక్కడ గర్భాలయంలో అంతా చీకటిగా వుంది. ఆ చీకటిలో నూనెతో దీపం వెలిగించిన దీపాల కాంతులతోను, అమ్మవారికి హారతులిచ్చే కాంతులతోను అమ్మవారిని దర్శించాను. ఆమె కన్య. ఆమె పరికిణి కట్టి ఓణీ వేసిన ఒక యుక్త వయస్సు గల అమ్మాయిని చూచినట్లు ఉన్నది. ఆ విగ్రహాన్ని చూచిన వెంటనే నాకు జిల్లెళ్ళమూడిలోని మన సోదరి హైమే జ్ఞాపకం వచ్చింది. అక్కడ నుండి మరునాడు ఉదయం ప్రస్తుతం వివేకానంద రాక్ వున్న ప్రదేశం నుండి మూడు సముద్రాలు కలిసే చోట ఒక పాత్రను నా చేతిలో పట్టుకోగా ఒక పెద్ద అల వచ్చి ఆ పాత్రను నింపింది. నేను సముద్రంలో పాత్ర ముంచవలసిన అవసరం రాలేదు. ఆ తీర్థం తీసికొని జిల్లెళ్ళమూడి చేరాను. నేను వచ్చేటప్పటికి మహారుద్రాభిషేకానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేయించే ఉన్నవి. అభిషేకము మొదలు పెట్టే సమయానికి 10 మంది ఋత్విక్కులు మాత్రమే వచ్చారు. అమ్మ అభిషేకం మొదలుపెట్టమన్నారు. అభిషేకం మొదలైంది. మహన్యాసం పూర్తి అయ్యే సమయానికి 11వ బ్రాహ్మణుడు పరుగు పరుగున వచ్చి బావిలో స్నానం చేసి మహాన్యాసం ఎత్తుకోగా రుద్రం 11 మంది అందుకున్నారు. నా ఆనందానికి అవధులు లేవు. కారణం అమ్మ ఆరోగ్యం ఏమీ బాగులేదు. 3 గం॥ కూర్చోవటమే చాలా కష్టం. ఒక్కసారి 11 మంది ఋత్విక్కులు లేకపోతే రెండుసార్లు చెప్పవలసి వచ్చేదట. అప్పుడు అమ్మ 6 గంటలు కూర్చోవలసి వస్తుంది. ఇది కేవలం రామకృష్ణ ప్రాణ రక్షణకు, నేను చేసే కృషికి ఫలితంగా నాకు తృప్తి యివ్వటానికి అమ్మ ఒప్పుకుందేమో! అమ్మ అన్నారు "ఒరే నీవు కన్యాకుమారిలో అమ్మవారిని చూచినప్పుడు మన హైమను చూచినట్లు లేదా ?' అని. అవునన్నాను. అప్పుడు హైమ అక్కడే వున్నది. అంటే హైమాలయంలో ప్రతిష్ఠ చేయబడే హైమ కన్యగా కన్యాకుమారిలో లాగానే పూజలందుకుంటుందనే భావన హైమ సిద్ధి

పొందటానికి 4 సంవత్సరాల ముందరే మనకు ఇచ్చినట్లే గదా! హైమకు యుక్త వయస్సు వచ్చింది గదా, పెండ్లి చేయరా ? అని అడిగిన మన సోదరీ సోదరులకు, నాన్నగారికి దానికి 25 సం॥లు దాటిన తర్వాతనే పెండ్లి చేస్తానన్న దాంటో "అంతరార్థం హైమ అమ్మతో" అనేకసార్లు "నీలో నన్ను కలుపుకో, నీ నామం నేనెప్పుడూ వింటూ ఉండాల"నే కోరికను తీర్చటానికే తన యింటి ముందరే మహాసమాధి తనే చేసిందా! ఈ మహా సమాధి చేయటానికి నాన్నగారు ససేమిరా ఒప్పుకోలేదు. నీవు పదిమందికి ఆదర్శమైన దానివి. నీవు చేసినట్లే నిన్ను కొలిచే వాళ్ళు ఇట్లా సమాధులు చేసుకుంటూ పోతే దేశం స్మశానం కాదా? అని అడిగారు. అప్పుడు అమ్మ "నేను చేసినట్లు అందరూ అన్ని పనులు చేస్తే దేశం స్మశానం అయినా ఫర్వాలేదు. ఏమి జరుగబోతున్నదో, నేను ఏమి చేయబోతున్నానో మీరు అట్లా చూస్తూ ఉండండి" అని చెప్పింది. నాన్నగారు తలవంచుకొని వెళ్ళిపోయారు. తర్వాత అమ్మ హైమను ఎట్లా జీవసమాధి చేసారో మనకందరకు తెలిసిన విషయమే. ఈ సమాధి చేసిన తర్వాత "హైమను నేను కన్నాను. నేను పెంచాను. నేనే చంపుకున్నాను" అని చెప్పిన మాటలు సృష్టి, స్థితి, లయకారిణి అయిన జగజ్జనని పలికిన పలుకులు. హైమకు నేను దైవత్వం ఇస్తున్నాను. ఇది ఒక మహాపుణ్యక్షేత్రం అవుతుంది. ఇక్కడకు అనేకమంది పీఠాధిపతులు వస్తారు. ఇది ఒక పెద్ద తపోవనం అవుతుందని అమ్మ పలికిన పలుకులు మన చెవులల్లో ఘంటారావాలుగా గింగురుమంటూనే యున్నవి.

తను కన్న, పెంచిన హైమను మహాసమాధి చేసి నేను దైవత్వం యిస్తున్నాను అని పలికిన దానిలో అంతరార్థం "మీరు అంతా నేనే, ఇది అంతా నేనే, మీరు నాకు అవయవాలు, నాకంటే మీరు వేరు కాదు, మీరు నాకు బిడ్డలు, నేను మీకు అమ్మను" అని అంటూ హైమకు దైవత్వం ఇచ్చినట్లే అమ్మ బిడ్డలమైన మన అందరికి దైవత్వం ప్రసాదించింది. అందుకే "అందరికీ సుగతే" నన్నది, కాస్త వెనకా ముందుగా. అంటే అది మనం గ్రహించే దాకానే.

మన హైమాలయం మనమందరం దైవత్వం పొందటానికి అమ్మ వేసిన పునాదిరాయి. ఇక దీనిమీద తత్త్వమసి మహాసౌధాన్ని నిర్మాణం చేసుకోవలసిన బాధ్యత మన అందరి మీద వుంది.

***– నవంబర్, 2003***

# అమ్మ నాకిచ్చిన హామీ

1971వ సంవత్సరంలో అమ్మ జన్మదినోత్సవాలు జరుగబోతున్నవి. ఆ సమయములోనే నేను మదరాసుకు ఏదో పనిమీద పోవలసి వచ్చింది. అప్పుడు ఆల్వార్‌పేటలో నున్న చుండూరు శీతారామయ్య తాతయ్యగారి కుమారుడు అచ్చుతరామ్ గారింట్లో దిగాను. అచ్యుతరామ్ నేను బాపట్ల హైస్కూలులో క్లాస్‌మేట్సుము. అచ్యుత్ మదరాసులో ప్రముఖ ఆర్కిటెక్టుగా స్థిరపడి పోయాడు. జరుగబోయే అమ్మ జన్మదినోత్సవాల కార్యక్రమాలను గూర్చి చర్చించు కుంటున్నాము. ఇంతలో ఈ జన్మదినోత్సవాలను సినిమాగా తీస్తే ఎట్లా వుంటుంది అనే అభిప్రాయం నాకు కలిగింది. వెంటనే తాతగారితోను అచ్యుత్ భార్య జ్యోతితోను సంప్రదించాను. జ్యోతికి సినిమా వాళ్ళతో మంచి పరిచయాలున్నవి. జ్యోతి వెంటనే తన సోదరుడైన చంద్రమోహన్ (సినీ కెమారామన్)కు ఫోను చేసి పిలిపించింది. చంద్రమోహన్‌తో తాతగారు మన అభిప్రాయాన్ని గూర్చి చర్చించారు. ఆయన ఈ ఉత్సవాలను 35 mm Black & White లో కవరేజ్ చేయటానికి దాదాపు 10, 15 వేల రూపాయల దాకా ఖర్చువుతుంది అని అంచనా ఇచ్చారు. ఆ పైకమును తను భరించటానికి సీతారామయ్య తాతగారు ముందుకొచ్చారు., సరే వెంటనే సుందరలాల్‌నహతా గారి యూనిట్సు, ఫిలింతో సహా తగు ఏర్పాటు చేసాము. నేను జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మతోను, రామకృష్ణతోను జరిగిన విషయము చెప్పాను. వాళ్ళు ఎంతో సంతోషించారు. జన్మదినోత్సవమంతా రెండురీళ్ళలో తీశాము. శ్రీ కొంగర జగ్గయయ్యగారు కామెంటరీ యివ్వగా శ్రీమతి ఎస్.జానకి "జిల్లెళ్ళమూడిలో స్త్రీరూపాధారిణియై" అన్న డాక్టర్ శంకర శ్రీరామారావు గారు వ్రాసిన పాటను టైటిల్ సాంగ్‌గా పాడగా శ్రీ పామర్తి వెంకటేశ్వరరావు గారు సంగీతము సమకూర్చగా, జెమినీ కోటేశ్వరరావు గారు జెమినీ రికార్డింగ్ థియేటరులో రికార్డు చేసారు. ఆ రెండు రీళ్ళు డాక్యుమెంటరీ పిక్చర్ చాలా థియేటర్సులో 1973లో జరుగబోయే అమ్మ స్వర్ణోత్సవాలకు అమ్మను బహుళ జనములకు పరిచయము చేయటానికి బాగా ఉపయోగపడ్డది.

దీనిని గూర్చి చాలా బాగుందని ప్రశంశలు వచ్చిన తర్వాత పూర్తి నిడివి గల సినిమా కలర్‌లో అమ్మ మీద తెస్తే బాగుంటుందని మన సోదరులు ఆలోచనలు చేసారు. అమ్మతో సంప్రదిస్తే అమ్మ సరేనంది. ఈ సినిమా తీయటానికి మాతృశ్రీ పబ్లికేషన్స్ ట్రస్ట్ మేనేజింగ్ ట్రస్టీ నైన నన్ను ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్‌గా అథరైజ్

చేసారు. ఈ సినిమాను అమ్మ బాల్యం నుండి తీసికొని రావలెననే నా ఆలోచనను అమ్మతో సంప్రదించాను. అమ్మతో చిన్న పిల్లను తీసికొచ్చి అమ్మ వేషము వేయించి బాల్యంలోని కొన్ని సంఘటనలతో ఫీచర్ ఫిలిం మొదలు పెట్టే ఎట్లా వుంటుంది అని అమ్మను అడిగాను. "అది అమ్మ వేషం అవుతుంది గాని అమ్మకాదుగా" అన్నది. అయితే చిత్రకారునితో అమ్మ బాల్యంలోని చరిత్రను చిత్రములుగా వేయించి పిక్చర్స్ చేస్తే ఎట్లా వుంటుంది అని అమ్మను అడిగాను. కాని అమ్మ "అవి చిత్రకారుని ఊహా చిత్రాలే అవుతవి కాని అమ్మకాదుగా" అన్నారు. అయితే మరి ఏమి చేయమంటావమ్మా అని అడిగాను. ఏమీ అక్కర్లేదు. ఇప్పుడు మీరు ఏమి చూస్తున్నారో అవి అన్నీ ఉన్నవి ఉన్నట్లుగా తీయండి. ముందు తరాలవార్కి అమ్మను చూపాలంటే ఇది తప్ప వేరే మార్గం లేదు" అని అన్నారు. ఇది పూర్తి నిడివి డాక్యుమెంటరీ తీయాలంటే 2 నుండి 3 లక్షల రూపాయల దాకా కావలసి వస్తుంది. దానికి నెల్లూరు వాస్తవ్యులు శ్రీ నూనె ఆది శేషయ్య గారు అమ్మ మీద ఉన్న భక్తి విశ్వాసాలతో దశల వారీగా అప్పు ఇవ్వడానికి అంగీకరించార్రు. 15 రీల్సు పూర్తి నిడివి గల ఈ కలర్ సినిమా తీయడానికి 3 సంవత్సరాలు పట్టింది. 1 సంవత్సరంలో జిల్లెళ్ళమూడిలో జరిగే అన్ని కార్యక్రమాలు, పండుగలు, అమ్మ వివిధ ప్రదేశాలకు వెళ్ళిన దృశ్యాలు, అమ్మ స్వర్ణోత్సవ సంరంభాలు లక్షమందికి పైగా ఒక్క పంక్తిన భోజనాలు చేస్తూ వుంటే 60 ఎకరాల వైశాల్యంలో వేసిన పందిళ్ళు, షామియానాలు, ఏర్పాట్లు అమ్మ స్వయంగా తిలకించిన తీరు వర్ణింపలేని దృశ్యాలు సాటిలేని చరిత్రగా డాక్యుమెంటరీగా చిత్రీకరించాము. దీనికి శ్రీ పామర్తి వెంకటేశ్వరరావుగారు, ఎమ్.ఎస్.ఎన్.మూర్తిగారు, శ్రీ నాగిరెడ్డి గారు (వాహినీ స్టూడియోస్) సాయపడ్డారు. గాయకులుగా శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావుగారు, ఎమ్. బాలమురళీకృష్ణ, శ్రీ ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, శ్రీరామకృష్ణ, శ్రీమతి ఎస్.జానకి, శ్రీమతి పి.సుశీల, శ్రీమతి పి.లీల తోడ్పడ్డారు. శ్రీ పి.జె.శర్మగారు కామెంటరీ ఇచ్చారు. శ్రీ ప్రసాదరాయకులపతి, డాక్టర్ పన్నాల రాధాకృష్ణశర్మ, డాక్టర్ శంకర శ్రీరామరావు, శ్రీ నదీరా మొదలగు వారు పాటలతో పాటు సాహిత్యమంతా ఒక వంతు అయితే ఈ సినిమాకు రామకృష్ణన్నయ కామెంటరీ రచన అప్పటి సెన్సారు బోర్డులో సభ్యురాలైన మాలతీచందూర్ లాంటి ప్రముఖుల ప్రశంసల్ని పొందడం మకుటాయమానంగా నిలచింది. ఈ సినిమా ప్రివ్యూ చూచిన వారంతా సినిమాను వేయినోళ్ళ పొగిడారు. కాని వ్యాపార రీత్యా ఫ్లాప్ అయింది. దానికి కారణం డిస్ట్రిబ్యూటర్సును మేము పూర్తిగా నమ్మటం. వాళ్ళు

అసలు సహకరించకపోవటం. పిక్చర్ ఫెయిల్ అయి డబ్బాలు తిరిగి రాగానే నేను అమ్మ దగ్గరకెళ్ళి శ్రీ ఆదిశేషయ్య గారింట్లో జరిగే సన్నివేశాలు ముందరగనే ఊహించి అమ్మ పరువు ప్రతిష్ఠలు దెబ్బతింటాయని, అమ్మ కాళ్ళు పట్టుకొని విపరీతంగా ఏడ్చాను. అమ్మ నాకు హామీ ఇచ్చింది. ఈ అప్పు ఎట్లాగైనా తీరుస్తానని. పిక్చర్ ఫెయిల్ అయ్యేటప్పటి కల్లా శ్రీ ఆదిశేషయ్య గారింట్లో నేను ఊహించినట్లే కలకలం ఏర్పడ్డది. మీ అమ్మ నిన్ను ముంచింది అని వారి ఫ్యామిలి లోనే అందరు ఆయనను వ్యతిరేకించారు. అమ్మను దుర్భాషలాడారు. అది భరించలేక ఆయన అమ్మ దగ్గరకు వచ్చి మొరపెట్టుకున్నాడు. ఆయనకు అమ్మ చెప్పింది "నాన్నా! నీకు వడ్డీ ఇవ్వలేడేమో కాని నీ అసలు మాత్రం ఒక్కసారిగానే తీరుస్తాడు లేరా, నీవు దశలవారిగా వాడికిచ్చినా అంది. వెంటనే నన్ను పిలిచి ఆ విషయం శ్రీ రిచర్డు షిఫ్‌మెన్ (యు.యస్.ఎ.)కు లెటర్ వ్రాయమంది. అట్లాగే లెటర్ వ్రాశాను. మనము ఇవ్వవలసిన మొత్తం రిచర్డు పంపాడు. వెంటనే శ్రీ ఆదిశేషయ్య గారిని పిలిపించి బాకీ అసలు పూర్తిగా ఇచ్చి వేసి ఆయనకు బాకీ లేదనిపించు కున్నాను. నేను నా క్రిందట వ్యాసంలో వ్రాసినట్లుగా అమ్మ నాకిచ్చిన బ్రహ్మోపదేశమునకు తోడుగా అమ్మ అన్నది "నేను నీకు ఒక కవచం యిస్తున్నాను. ఎవ్వరూ నిన్ను ఏమీ చేయలేరు. నీకేమీ కాదు" అని. నేను హైదరాబాద్ ఎకౌంట్సు ఆడిట్‌కు వెళ్ళినపుడు అనారోగ్యం పాలై ఉస్మానియా హాస్పిటల్‌లోను, వరంగల్ కలెక్షన్ డ్రైవ్‌కు వెళ్ళినపుడు గాంధి హాస్పిటల్లోను 20 రోజుల చొప్పున వుండవలసి వచ్చింది. డాక్టర్లు ఆపరేషన్ చెయ్యాలన్నా ఆపరేషన్ వద్దని పిలపించి వేసింది. ఒకరోజు జిల్లెళ్ళమూడిలో కడవలు, కడవలుగా రక్తం కక్కటం ప్రారంభించాను. నన్ను డాక్టరు ఇనజకుమారి ఆధ్వర్యం క్రింద మన మాతృశ్రీ మెడికల్ సెంటర్‌లో ఇన్‌పేషంటుగా చేర్చారు. నేను నా జీవితం మీద ఆశలు వదలుకున్నాను. రామకృష్ణను పిలిపించి సంస్థాపరంగా మనం ఇంకా చేయవలసినవి వాడితో ప్రస్తావన చేసాను. వాడు అమ్మతో ఏమీ మాట్లాడాడో ఏమో కాని మదరాసు నుండి మా బావగారైన బందా వెంకటేశ్వర్లు గారిని వారి కుటుంబంతోను, బాపట్ల నుండి మా కుటుంబ సభ్యులను మా కుమారుడు లక్ష్మీప్రసాద్‌తో సహా పిలిపించి నన్ను హాస్పిటల్ నుండి అమ్మ తన గదికి తీసుకొని వచ్చి వాత్సల్యాలయంలో - అమ్మ మంచం మీద కూర్చుండపెట్టుకొని తన దుప్పటిని కప్పి మా లక్ష్మీప్రసాద్‌కు, మా కోడలు విజయకు వివాహము చేయటానికి తనే నిర్ణయం చేసి మా బావగారితో నిశ్చయ తాంబూలాలు యిప్పించింది. అప్పుడే నెల్లూరు నుండి డాక్టర్ ఎస్.వి.

సుబ్బారావుగారిని కూడా పిలిపించి వారితో నన్ను మదరాసుకు పంపి అక్కడ ఆపరేషన్ చేయించటానికి ఏర్పాట్లు చేసింది. నన్ను డాక్టర్ గారు కారులో తీసికొని వెళ్ళటానికి ఏర్పాట్లు అన్ని అయినాయి. ఈ తతంగం అంతా వాత్సల్యాలయంలో కిక్కిరిసిన సోదరీ సోదరుల సమక్షంలో జరిగింది. నన్ను కార్లో పంపటానికి అమ్మే నాతో వాత్సల్యాలయం నుండి మొదట అంతస్తు బాల్కనీ దాకా వచ్చింది. నన్ను కార్లో కూచో పెట్టారు. కారు నాలుగు టైర్ల క్రింద నిమ్మకాయలు కోసి కుంకుమ పూసి కారుకు కొబ్బరికాయ దిగతుడిచి హారతిచ్చి ఆ కొబ్బరికాయ పగలు కొట్టించి కారు బయలుదేరేటట్లుగా అమ్మ ఆదేశాలు ఇచ్చింది. నన్ను వదల లేక వదలలేక పంపుతున్నట్లుగానే పంపింది. ఆ దృశ్యము చూచిన వారెవరైనా నేను మరల బ్రతికి తిరిగి వస్తానని ఊహించి వుండరు. నాతో రామకృష్ణ కూడా డాక్టరు గారి కుటుంబంతో కారులో వచ్చారు. మేము నెల్లూరు వెళ్ళాము. నెల్లూరులో అన్ని టెస్టులు చేయించుకొని మదరాసు వెళ్దామని డాక్టరుగారన్నారు. సరే టెస్టులకు పంపారు. ఈ టెస్టుల రిజల్టు వచ్చే లోపల ఊరికినే వుండి ఏమి చేస్తాములే అని నేను, రామకృష్ణ సినిమా మాట్నీకి వెళ్ళాము. ఈ లోపల అమ్మ డాక్టరు గారికి ఫోను చేసారు- వాడెట్లా వున్నాడని. వాళ్ళిద్దరు సినిమాకెళ్ళారని డాక్టరు గారు చెప్పారు. అక్కడకు వచ్చిన పరిస్థితి ఏమిటి, వాళ్ళ సినిమాకు వెళ్ళటం ఏమిటి ? - అన్నది అమ్మ. టెస్టు రిజల్ట్సు తీసికొని నన్ను డాక్టరు గారు మదరాసు తీసికెళ్ళారు. మదరాసులో కూడా డాక్టర్లు రిపోర్టులు చూసి అంత అర్జంటుగా ఆపరేషన్ చేయవలసిన అవసరం లేదని, మందులు కొంతకాలం వాడవచ్చునని చెప్పారు. మరల జిల్లెళ్ళమూడి తిరిగివచ్చాము. మరల కొంతకాలానికి అదే పరిస్థితి. అమ్మ మా ప్రసాద్‌ను పిలిపించి హైదరాబాద్ పోయి డాక్టర్ సి.ఆర్.ప్రసాదరావు గారి చేత ఆపరేషన్ చేయించవలసిందిగా కబురు చేసింది. నేను హైదరాబాద్‌లో ఉస్మానియాలో చేరినప్పటికి ఆయన అక్కడ ఛీఫ్‌గా ఉన్నారు. నేను వరంగల్లులో చేరేటప్పటికి ఆయన అక్కడ సూపరింటెండెంట్‌గా యున్నారు. ఇప్పుడు ఆయన డైరెక్టరు ఆఫ్ మెడికల్ సర్వీసెస్. ఇప్పుడు ఆయన డైరెక్టర్‌గా ఆపరేషన్ను చేయటానికి వీలు లేదు. అందుకని గుంటూరు జనరల్ హాస్పిటల్స్‌లో వున్న చీఫ్ డాక్టరు డబ్ల్యు శర్మగార్కి లెటర్ వ్రాసి పంపారు. ఆయనను అందరు దేవుడు డాక్టర్ అంటారు. ఆయన తన అసిస్టెంట్ ప్రొఫెసరైన డాక్టర్ సత్యమూర్తిగారిని, డాక్టర్ ఇనజకుమారి గారిని post operative period లో నన్ను attend కమ్మని చెప్పి నన్ను special ward లో పెట్టి ఆపరేషన్ conduct చేసారు. నాకు గుంటూరు

గవర్నమెంట్ హాస్పిటల్‌లో ఆపరేషన్ చేయించటం అమ్మకు ఇష్టం లేదు. కారణం అక్కడ హైమ పోవటమే. కాని డాక్టర్ శర్మగారు ప్రయివేటు హాస్పిటల్‌కు రానన్నారు. అందుకే డాక్టర్ల పర్యవేక్షణలో ఏర్పాటు చేసారు. తర్వాత కొంతకాలానికి మదరాసు నుండి హౌరా ఎక్స్‌ప్రెస్‌లో బాపట్ల వస్తుంటే నెల్లూరు వద్ద వేదాయపాలెంలో పెద్దరైలు ఏక్సిడెంట్ అయి ఇంజన్ పచ్చడైంది. తర్వాత గూడ్సు వేగన్. అది ఇంజన్ మీదకు ఎక్కింది. దాని ప్రక్కనే వున్న బోగీలోనే నేనున్నాను. ఈ బోగిలోని వాళ్ళు నెల్లూరులో దిగటానికి డోర్‌లో నుంచున్నారు. ఆ 10 మంది చనిపోయారు. తర్వాత వుంది నేనే ఈ బోగి పల్టీలు కొట్టి క్రిందకు పడ్డది. నన్ను కిటికీ చువ్వలు కోసి బయటకు లాగారు. మైనర్ దెబ్బలు తోనే బయటపడ్డాను. డాక్టర్ ఎస్.వి.సుబ్బారావు గారి కుటుంబం నన్ను కార్లో జిల్లెళ్ళమూడి తీసికెళ్ళి అమ్మకు అప్పగించి బాపట్ల ప్రెస్‌లోను, జిల్లెళ్ళమూడిలోను స్వీట్సు పంచారు. హైదరాబాద్ నుండి రాత్రి 12 గంటలకు టాక్సీలో విజయవాడ వస్తుంటే యాక్సిడెంట్ అయి మైనర్ గాయాలతో జిల్లెళ్ళమూడి చేరాను. అమ్మ నాకు ఎదురుగా పరిగెత్తుకుంటూ వచ్చి బ్రతికి వచ్చావా నాన్నా, అని పలకరించే దాకా విషయం ఎవ్వరికీ తెలియదు. తరువాత జిల్లెళ్ళమూడిలో జరిగిన నక్సలైట్ ఎటాక్‌లో ధీరోదాత్తునిగా నిల్చింది 30 సంవత్సరాల క్రిందట డిసెంబర్ 30 రాత్రి 12 గంటలకు ఎట్లా బ్రతికి బయటపడ్డానో అందరికీ తెలిసిన విషయమే. ఎవరైనా నాతో ప్రయాణం చేయాలంటే భయపడేవాళ్ళు. నీకేం నాయనా, నీవు బాగానే వుంటావు పోయేది మేమే గదా అనేవాళ్ళు. అమ్మ నన్ను ఎమ్.ఎ. పట్టభద్రుణ్ణి గావించింది. ఎమ్.ఎ. అంటే మాస్టర్ ఆఫ్ యాక్సిడెంట్సు అని అర్థం చెప్పింది. అందరు ఇక్కడకు వచ్చి డొనేషన్సు ఇస్తుంటే, నేను ఇవ్వలేకపోతున్నానే అనే బాధ వుండేది. ఒకరోజున అమ్మతో ఈ ప్రస్తావన చేశాను. అమ్మ అంది "నువ్విచ్చింది ఎవరిచ్చారు రా ! ఎవరైనా లక్షరూపాయలు ఇస్తే 2 లక్షలిచ్చిన వాడికంటె తక్కువే. నువ్వట్లా కాదు నీవు నా కోసం నీ ప్రాణాన్ని లెక్క చెయ్యలేదు. నీకంటె భాగ్యవంతుడెవడురా ? నీకు రత్నాల్లాంటి పిల్లలున్నారు. నీవు నన్ను ఎప్పుడూ చూస్తున్నావు కాబట్టి నిన్ను నీ ఫామిలీని అహర్నిశలు నేను చూస్తుంటాను. నీకేదైనా తక్కువైతే నన్నడుగు" అంది. భాగ్యవంతుడంటే ధనవంతుడు కాదు. నిత్యతృప్తి, నిత్యానందం కలవాడు అని అర్థం. "తృప్తేముక్తి" గదా ! ఇకనీకు జన్మలేదని నాకు ప్రత్యేకంగా చెప్పి "అందరికి సుగతేనని నా సంకల్పంతోనే మీరు జన్మ ఎత్తి నాలోనే లీనం అవుతారు" అని అమ్మ ఇచ్చిన హామీకంటె ఎవరికైనా ఏమి కావాలి ? - ఫిబ్రవరి ***-2006***

# భావనకే అందని భామ ఒకటుందని...

అమ్మ 1968లో ఇప్పుడు హైమాలయం వెనుక ఉన్న పూరింట్లో వుండే రోజులు. హైమను రవిని సాయిబాబాను చూపించటానికి షిరిడి తీసికెళ్ళారు. దాని తర్వాత ఔరంగబాద్‌లో నున్న నందమూరి కామరాజు పంతులు గారింట్లో కొన్నాళ్ళు హైమ ఉండి వచ్చింది. తర్వాత హైమకు జబ్బు చేసింది. డాక్టర్ నారపరాజు శ్రీధరరావు గారు చీరాలలో ఉన్న తన నర్సింగ్‌హోమ్‌ను తాత్కాలికంగా మూసివేసి హైమకు చికిత్స చేస్తూ జిల్లెళ్ళమూడిలో కొన్నాళ్ళు వున్నారు. ఆ సమయంలో హైమకు బాగా సీరియస్ అయి చీరాల నుండి మా స్నేహితులు ప్రసిద్ధవైద్యులైన డాక్టర్ బెల్లం రాధాకృష్ణమూర్తిని కూడా పిలిపించాము. ఆయన వచ్చి హైమకు రక్తం చాలా తక్కువగా వున్నదని వెంటనే గుంటూరు తీసికెళ్ళి గవర్నమెంటు హాస్పిటల్‌ల్లో రక్తం ఎక్కిస్తేనేగాని బ్రతకటం కష్టమని చెప్పారు. "వున్న నాలుగు రోజులు ఇక్కడే అట్టి పెట్టండి. ఎక్కడకు తీసికెళ్ళినా వుపయోగంలేద"ని అమ్మ చెప్పింది. కాని డాక్టర్ల పని డాక్టరు చెయ్యాలిగా గుంటూరు తీసికెళ్తామని డాక్టర్లు పట్టుపట్టారు. అమ్మ - సరే అన్నది. హైమను తీసికెళ్ళటానికి కావాలసిన అన్నీ ఏర్పాట్లు చేసారు. అమ్మ, నాన్నగారు, రామకృష్ణ, అమ్మ గదిలో వుండి అప్పట్లో పరిచర్య చేస్తున్న అన్నపూర్ణ మొదలగు వారంతా హైమతో పాటు వెళ్ళారు. డాక్టరు శ్రీధరరావు గారు నన్ను చీరాల వెళ్ళి ఆయనకు కావలసిన గుడ్డలు తీసికొని రమ్మని వాళ్ళ మెడికల్ షాపు ఓనర్‌ను మోటారు సైకిలు మీద పంపారు. మేమిద్దరము చీరాల వెళ్ళి గుడ్డలు తీసికొని ఆఘమేఘాల మీద గుంటూరు వెళ్తున్నాము. గుంటూరు ఊరు బయట పొగాకు గౌడన్లు దగ్గర అమ్మ కారు ఎదురు పడ్డది. కారు డ్రైవరు చెయ్యెత్తాడు. అమ్మకారు తిరిగి వస్తున్నదని చూచిన నేను ఆ మోటారు సైకిలు నడిపే వారిని ఆపమని చెప్పాను. సడన్ బ్రేక్ వేసాడు. కాని అది ఒక ఫర్లాంగు దూరం వెళ్ళి ఆగింది. దానిని వెనుకకు త్రిప్పుకొని కారు దగ్గరకు వచ్చాము. అమ్మ తలవంచుకొని వున్నది. ముఖము ఎర్రగా కందిపోయింది. కళ్ళ వెంట నీరు కారే నీళ్ళతో కళ్ళు ఉబ్బిపోయి వున్నవి. హైమ ఎట్లా వున్నదమ్మా అని అడిగాను. "అంతా అయిపోయింది కారెక్క"మంది. ఆ మోటారు సైకిలు వెనక్కి గుంటూరు పంపి నేను కారెక్కాను. కారు జిల్లెళ్ళమూడి చేరింది. అవి అమ్మ జన్మదినోత్సవము జరిగే రోజులు. అన్ని ఏర్పాట్లు జరిగాయి.

జన్మదినోత్సవాలకు ముందుగా సోదరీ సోదరులు చాలా మంది వచ్చారు. విషయం తెలుసుకొని ఆతురతతో ఎదురు చూస్తున్నారు. ఒక్కసారి అమ్మకారు వచ్చి ఆగగానే అందరు బారులు తీరి నిల్చున్నారు. అమ్మను మెల్లగా కారు నుండి, నేను, అన్నపూర్ణ చెరోవైపున పట్టుకొని దింపి నడిపించుకుంటూ ఇంట్లోకి వస్తున్నాము. అమ్మ ఒక్కసారి ఆ బారులు తీరిన సోదరీ సోదరులను తేరిపార చూచింది. అందరిని భోజనాలు చేశారా అని, తన చూపులతో చేతి సంజ్ఞలతో పలుకరించింది. అందరూ వారి వద్ద నున్న కొబ్బరికాయలు అక్కడే కొట్టి హారతులు ఇచ్చారు. ఆ హారతులు అందుకుంటూ అందరినీ తన చూపులతోటే పలకరిస్తూ ఇంట్లోకి అడుగు పెట్టింది. లోపలికి వెళ్ళి తన గదిలో దగ్ధ హృదయంతో పడుకొన్నది. బయట తలుపులు వేశాము. ఎవ్వరినీ లోపలకు అనుమతించలేదు. అసలు ఏమి జరిగిందని అన్నపూర్ణను అడిగాను. హైమకు బ్లడ్ ఎక్కించడానికి బ్లడ్ తీసికెళ్తుండగానే అమ్మ "అంతా అయిపోయింది కారు వెనుకకు త్రిప్ప" మని డ్రైవరుతో చెప్పింది. హాస్పిటల్‌లో కారుక్రిందనే పెట్టి అందులో అమ్మ, అన్నపూర్ణ, డ్రైవర్ తప్ప ఎవ్వరూ లేరు. నీవు గుంటూరు వెలుపల ఎదురు పడ్డావని చెప్పింది. అమ్మకారు వచ్చిన గంట, రెండు గంటల తర్వాత ఒక్కసారిగా ఆవరణమంతా హైమా అంటూ గగ్గోలు పెడ్తూ అక్కడ నున్నవాళ్ళంతా ఆకాశం అంటేటట్లు ఏడ్వడం మొదలు పెట్టారు. హైమ ఉన్నకారు వచ్చిందన్నమాట. తర్వాత హైమను అమ్మ ఇంటి ముందరనున్న వరండాలో పడుకోబెట్టారు. అదే ఇప్పుడు అమ్మ అఖండ అమ్మనామం జరిగే చోటు. తర్వాత ఈ విషయం అందరికి తెలియపరచటం ఆ మరుసటి రోజు హైమను మహాసమాధి అమ్మ చేతుల మీదుగా చెయ్యటం, జిల్లెళ్ళమూడి ఒక మహాక్షేత్రమౌతుందని, ఇది తాపసులకు నిలయమవుతుందని, ఇక్కడకు ఎంతమందో మహనీయులు, పీఠాధిపతులు వస్తారని ఇది ఒక తపోవనం అవుతుందని అమ్మ ఇచ్చిన ప్రవచనాలు వృధాకావుగదా.

అమ్మ హైమను మహాసమాధి చేసిన తర్వాత అమ్మ జన్మదినోత్సవాలు జరపటమా లేదా అనే విషయం మాకున్న తీవ్రమీమాంస. జన్మదినోత్సవాలకు మామూలుగా, పదివేల మందికి తక్కువ కాకుండా రావటం అప్పటి అలవాటు. అందుకని ఇప్పుడున్న అందరింటిముందు, అమ్మ వున్న పూరింటిముందు, నాన్నగారి ఇంటివరకు భారీగా తాటియాకు పందిళ్ళు వేశారు. జన్మదినోత్సవానికి కావలసిన

అన్ని ఏర్పాట్లు పూర్తి అయినవి. సరకులన్ని కొనటము కూడా అయినది. జన్మదినోత్సవ సందర్భముగా తంగిరాల కేశవశర్మచే కూర్చబడిన "పదార్చన" పుస్తకము మాతృశ్రీ ప్రింటర్స్‌లో ప్రింటు చేయబడి అమ్మకు సమర్పించడానికి ఏర్పాట్లన్నీ పూర్తి అయినవి. కాని ఇంతలో ఈ అవాంతరము వచ్చినది. ఏమి చెయ్యాలో తోచలేదు. అమ్మనే అడిగాము. అమ్మ ఏదీ సందేహించకుండా "దేని పని అది చేసుకొని పోవలసిందే ఏదీ ఒకదాని కోసం ఒకటి ఆగదు" అని అన్నది. అంతే. జన్మదినోత్సవానికి, పుస్తక ఆవిష్కరణకు తగిన ఏర్పాట్లన్నీ చేసాము. ఇప్పుడున్న అందరింటి ముందు వేసిన పందిళ్ళలో ఇంటికి ఎదురుగా వేదిక కట్టడము దాని అలంకరణ పూర్తి అయినవి. అమ్మ జన్మదినోత్సవము రానే వచ్చింది. జనం వేలల్లో వచ్చేశారు. అమ్మ వచ్చి వేదిక మెల్లగా ఎక్కింది. సింహాసనములో ఆసీన ఐంది. సభ ప్రారంభించబడింది. ఈ సమయంలో హైమ మనకు దూరమైన వుదంతం, ఏ పరిస్థితులలో ఈ జన్మదినోత్సవము జరుపుకుంటున్నామో సవివరంగా రామకృష్ణ, కేశవ ఇంకా కొంతమంది ప్రసంగించారు. కేశవశర్మచే సంకలనము చేయపడ్డ ఆ గ్రంథము, కేశవ, ప్రింటరుగా నేను, రామకృష్ణ అమ్మకు సమర్పించాము. ఆ సమయంలో అమ్మ హైమపోయినందుకు దుఃఖపడాలా, ఇన్ని వేల మంది ఎదుట జరిగే తన జన్మదినోత్సవానికి, పుస్తక ఆవిష్కరణకు, ఆనందం పొందాలా అనేది అమ్మ ముఖ కాంతుల మిశ్రమ, వైవిధ్యం చెప్పుకనే చెప్పుచున్నది. Face is the index of the mind అన్నారు. కాని ఆ భాష మన మనస్సులకు అందటం లేదు. భాషాతీతం, భావాతీతంగా వున్నది. అమ్మ ఈ ద్వంద్వాలకు అతీతంగా వున్నదా! లేక ఏది వస్తే అది అనుభవించవలసిందే అన్న తన ప్రవచనం ఆచరణలో పెట్టినదా అన్న పరిజ్ఞానం చూచిన వాళ్ళకు తెలుస్తుంది. "భావనకే అందని భామ ఒకటుందని మనసా నీకు తెలుసా!" – *ఏప్రియల్, 2006*



# మా తల్లి తీరు వేరు

1973లో అమ్మ జన్మదినోత్సవాలు స్వర్ణోత్సవాలుగా జరపాలని శ్రీ విశ్వజననీపరిషత్ జిల్లెళ్ళమూడి కార్యవర్గ సమావేశములో నిర్ణయింపబడినది. ఈ సంవత్సరాలలో ముఖ్యముగా మనము చేయవలసిన యాక్టివిటీ ఏమిటన్నది ఆలోచన. వెళ్ళి అమ్మనే సలహా అడిగారు. అమ్మ అన్నది ప్రతి జన్మదినోత్సవాలకు 10, 15 వేలమంది రావటం. వారికి భోజనాలు ఏర్పాటుచేయటం అనవాయితియే. కాని అమ్మకు తన పిల్లలు ఒకేసారి ఒక లక్షమంది కూర్చుని భోజనాలు చేస్తుంటే చూడాలనే కోరికను వెల్లడించింది. ఇది న భూతో న భవిష్యతి. ఇది ఎట్లా చేయాలి? ఇది జరిగేదేనా అని అందరి మనస్సులలో దోబూచులాడే ఆలోచన. కాని అమ్మ తన నిర్ణయాన్ని చెప్పి ఆదేశం యిచ్చినట్లుగా ప్రకటించింది. ఆ రోజు రాత్రి చుండూరు సీతారామయ్య తాతగార్కి (ఇంజనీరింగ్ తాతయ్య) లక్షలలో ఒకసారి అందరు భోజనాలు చేసే దృశ్యం కలవచ్చింది. ఆ కల గురించి అమ్మతో చెప్పారు. అమ్మ ఆయననే ప్లాను తయారుచేయమని చెప్పింది. ఆయనే బ్లూప్రింటు తయారు చేసారు. మన సంస్థకు దక్షిణాన ఉన్న 60 ఎకరాలు పొలాలలో పందిళ్ళు, షామియానాలు వేసి విస్తరి వేసి అందరికి భోజనాలు పెట్టేట్లు అనువుగా పొలాలను బాగు చేయించాలి. ఈ ఏర్పాట్లుకు ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని ప్రదేశాలలో వున్న వంటవారు, వంటసామగ్రి, పందిళ్ళకు కావలసిన బొంగులు, తాటియాకు, షామియానాలు అర్డర్‌లివ్వటం జరిగింది. విశాఖ ఉక్కు ఫ్యాక్టరీ, ఆంధ్రాబంద్ జరుగుతున్న రోజులు. ఎక్కడకు పోవాలన్నా సమస్య. దీనికి కావలసిన ఆర్థికవనరులుంటే పెద్ద సమస్య వుండదు. డబ్బుంటే కొండమీద నున్న కోతైనా దిగి వస్తుంది అంటారు. మన సంస్థ ఒక సామాన్యమైన కుటుంబ వ్యవస్థ లాగా ఏ రోజుకారోజు వెతుక్కోవలసిన పరిస్థితిలో ఉన్నది. అప్పటికే వేలల్లో, లక్షల్లో, జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను దర్శించినవారు ఉన్నారు. వచ్చినవారెవరి అడ్రస్సులూ వాకబు చేసే అలవాటు లేదు. అమ్మ దగ్గరకు తరచుగా వచ్చే సోదరీ సోదరులు, మాతృశ్రీ మాసపత్రిక చందాదారుల అడ్రసులు తప్ప యింకేమీ తెలియవు. ఈ తెలిసిన వాళ్ళను పట్టుకొని తెలియని వాళ్ళను వెతుక్కోవాలి. ఈ ప్రక్రియతో ఆర్థిక వనరులను సమకూర్చుకొనటానికి ఈ అందరింటి సోదరీ సోదరులు ప్రదర్శించిన సమైక్య కృషి ఆదర్శనీయము. ప్రశంసనీయము. ఇటువంటి సమైక్య కృషిని మన

సోదరీ సోదరులందరు మరొకసారి ప్రదర్శిస్తే సంస్థ పురోభివృద్ధి, అమ్మ ఆశయాల సంసిద్ధి, అద్వితీయమైన అమ్మ ఆలోచనాసరళి, వేదాంత పరిభాషలోని తన జీవిత సత్యాల నుండి ప్రవహించిన అద్వైత స్థితి గూర్చి, మనిషి మనిషికి, ఇంటింటికి, ఊరు ఊరుకి దేశదేశాలకు మనం అందించకలిగితే, అమ్మ సేవలో పునీతులమైన వారమవుతాము. అమ్మ వారసుల మవుతాము. వాటిని మనము ఆచరించగలిగితే మనమే "అమ్మ" అవుతాము.

మనకు దొరికిన అడ్రసులు చేతపట్టుకొని ఆర్థిక వనరుల కొరకు జట్లు జట్లుగా బయలుదేరాము. మొదటిసారిగా నేను, మన సోదరుడు రామకృష్ణ అమ్మ ఆశీస్సులకై అమ్మకు నమస్కరించాము. అమ్మ మా ఇద్దరికి ధోవతి, ఉత్తరీయాలు కుంకుమ పొట్లాలు యిచ్చి ఆశీర్వదించింది. రామకృష్ణ అవి తీసుకొని లేచాడు. నేను ధోవతి కుంకుమ పొట్లాలు మాత్రము తీసికొని ఉత్తరీయము అమ్మ మంచం మీద పెట్టాను. ఏరా వుత్తరీయము ఇక్కడ పెట్టావేమిటి ? అడిగింది. అమ్మా ! నేను వుత్తరీయము వేసుకొనే అలవాటు లేదు. నీవు ఇంకా ఎవరికైనా పెట్టితే వాళ్ళకు అది ఉపయోగపడుతుంది. ఎవరికైనా పెట్టమ్మా అన్నాను. అమ్మ అంది "నీవు ఉత్తరీయము వేసుకొని కులకటానికి పోవటం లేదు. నీవు అందరి దగ్గరకు ఒడిపట్టటానికి పోతున్నావు. ఆ ఒడిలో ఎవరు ఏమి వేస్తారో తెలియదు. ఒకరు రూ.10/- వేయవచ్చు. ఒకరు రూ.1116/- వేయవచ్చు. ఒకరు 10,000/- వేయవచ్చు. ఒకరు ఏమీ వేయకుండానే నీకేమైనా పనిపాటా లేదా ? లక్షమందికి అన్నం పెట్టడమేమిటి? అందరిని ఈ అడుక్కోవడమేమిటి ? ఉంటే పెట్టాలి లేకపోతే మానేయ్యాలి. అమ్మ పేరుతో ఇలా అడుక్కుంటానికి వచ్చారా అని తిట్టవచ్చు. ఏది వచ్చినా ఒడి పట్టడానికే మీకు ఈ ఉత్తరీయమును ఇస్తున్నాను. ఈ ఉత్తరీయమును తీసుకో"మని ఆ ఉత్తరీయము నా మెడలో వేసింది. అంతే అన్ని ఒడిపట్టడానికే మా యాత్ర సాగింది. ఆరునెలలు పాటు సాగిన మా యాత్రలో ఇటువంటి అనుభవాలు కోకొల్లలు. కాని బెదరటానికి వీలులేకుండా అమ్మ ముందుగానే తగిన సూచనలిచ్చి పంపింది. ఆశీర్వదించింది. ఈ యాత్రలో పాల్గొన్న వివిధసోదరీ సోదరులకు కలిగిన వారి అనుభవాలు అనుభూతులు వాళ్ళకు ఆనందదాయకము. అవి మనకు చెపితే మనకూ ఆనందమే.

ఇట్లా సమిష్టి కృషితో జరిగిన ఈ ఆనందోత్సవము పరిసమాప్తి అయిన తర్వాత అమ్మ నాకు రామకృష్ణకు, శేషయ్య గారికి పట్టువస్త్రాలు పెట్టి సత్కరించింది. ఈ పట్టువస్త్రాలు డాక్టర్ ఆచంట కేశవరావు అన్నయ్యగారు తీసికొచ్చారు. అమ్మ సత్కరించి యిచ్చిన ఈ పట్టువస్త్రాలను రామకృష్ణ, శేషయ్యగారు తీసికొన్నారు. కాని నేను తిరస్కరించాను. అమ్మ కారణం అడిగింది. నేనన్నాను ఈ ఉత్సవానికి క్రిందటి రోజు అన్నపూర్ణాలయం డాబా మీద ఒక మీటింగ్ జరిగింది. ఆ మీటింగులో డాక్టర్ కేశవరావుగారు ఈ ఉత్సవాల సందర్భంగా ఆర్గనైజర్లను తీవ్రంగా విమర్శించారు. ఏర్పాట్లు సరిగా లేవన్నారు. ఆయన అసంతృప్తిని తెలియపర్చారు. కాని ఉత్సవాలైన తర్వాత మమ్ములను సత్కరిస్తున్నారు రెండు రోజుల క్రింద లేనిదేమిటి ? ఇప్పుడు వచ్చిందేమిటి ? అప్పటి ఆర్గనైజేషన్ బాధ్యత మాదైతే ఇప్పుడు ఈ సక్సెస్‌కు బాధ్యత మాదే. కాని నా ఉద్దేశ్యంలో ఈ రెండింటికి బాధ్యత మాది కాదు. అంతా నీదే అని అన్నాను. అమ్మ అన్నది "నేను అందరికి గుడ్డలు పెట్టుతున్నానంటే నేను బజారుకెళ్ళి తెచ్చి పెడుతున్నానా ? ఎవరో మీ బోటివాళ్ళు తెస్తుంటే కదా నేను పెట్టుతున్నాను. ఇవి అంతే. ఇవి వాడు తెచ్చాడు నేను పెట్టాను" అది. "నీవు నాకు అంతగా పెట్టాలని వుంటే నీవు తుడుచుకున్న గుడ్డ పెట్టు. పట్టుగుడ్డలే అక్కరలేదు" అని అన్నాను. కాని అమ్మ వినలేదు. తీసికోవలసిందే అన్నది. నేను వద్దంటే వద్దన్నాను. అమ్మ వసుంధరను పిలిచి ఈ గుడ్డలు బీరువాలో పెట్టమంది. తర్వాత మే 5వ తేదీ అమ్మ కళ్యాణమహోత్సవము ప్రతి కళ్యాణ మహోత్సవం రోజున నాన్నగారిని అమ్మ గదిలోకి పిలిపించి క్రొత్త గుడ్డలు పెట్టి నమస్కారము చేసిన తర్వాత ఆ క్రొత్త గుడ్డలు కట్టుకొని నాన్నగారు, అమ్మ ఆ ఉత్సవాలలో పాల్గొనటం అలవాటు. అట్లాగే ఈ మే 5వ తేదీన నాన్నగారిని వాత్సల్యాలయం లోనికి పిలిపించింది అమ్మ. అమ్మ నాకు కూడా కబురు చేసింది. అమ్మ గదిలోకి వెళ్ళాను. వసుంధరను ఆ పట్టువస్త్రాలు యివ్వమన్నది. ఆ పట్టువస్త్రాలు నాన్నగారికి పెట్టి కట్టుకోమన్నది. నాన్నగారు ఆ పట్టువస్త్రాలు కట్టుకొన్న తర్వాత అమ్మ, నాన్నగారు అప్పటి ఆలయంపై భాగానికి వెళ్ళి ఆ ఉత్సవంలో పాల్గొన్న సోదరీ సోదరులపైన కుంకుమ, పసుపు, పూలు వెదజల్లి అందరిని ఆశీర్వదించారు. ఆ ఉత్సవము అయిన తర్వాత నాన్నగారు అమ్మ వున్న వాత్సల్యాలయమునకు వచ్చి ఆ పట్టుగుడ్డలు విప్పి ఆయన కట్టుకొచ్చిన గుడ్డలు కట్టుకొని క్రిందకు వెళ్ళారు. అమ్మ నాన్నగారు విడిచిన ఆ పట్టుగుడ్డలను

మడతపెట్టి నాకు "ఇవి నాన్నగారు కట్టుకొన్న గుడ్డలు, నీకు నేను పెట్టుతున్నాను. ఇవి తీసుకో"మని ఆ గుడ్డలు నా మెడలో వేసి బొట్టు పెట్టి పూలు తలపై వేసి ఆశీర్వదించింది. నేను అవాక్కయ్యాను. అప్పటి ఆ ఆనందం చెప్పనలవి కాదు. ఇది జరిగి ఇప్పటికి 30 సంవత్సరాలు దాటింది. ఆ పట్టువస్త్రాలు చిరిగినా వాటిని జాగ్రత్తగా మా బీరువాలో జాగ్రత్తగా దాచి పెట్టుకున్నాను. ఇప్పటికీ మా ఇంట్లో ఏ ఫంక్షన్ జరిగినా అవి నా మీద వేసుకుంటాను.

**తక్కిన వేల్పుల తీరు వేరు మా తల్లితీరు వేరు** - మే, *2006*



# నమ్మకమే భగవంతుడు

జీవితం ఒక మహాసాగరం అని అంటారు. ఆ సాగరాన్ని దాటాలంటే ఒక నావ కావాలి. ఆ నావను నడపడానికి సమర్థుడైన ఒక నావికుడు కావాలి. సముద్రాలను దాటటానికి ఈ రోజులలో ఒక మంచి విమానమైనా త్వరగా సముద్రాలు దాటటానికి ఉపయోగిస్తుంది. దానిని నడపడానికి సమర్థుడైన కెప్టెన్ కావాలి. ఆ కెప్టెన్ మనల్ని సురక్షితంగా మనం వెళ్ళవలసిన ప్రదేశాలను చేరుస్తాడనే నమ్మకం కావాలి. "మనం విదేశాలకు పోవాలి అనుకుంటే వీసా కావాలి. పాస్‌పోర్టు కావాలి. ఆ ప్రదేశానికి పోవటానికి అవసరమైన ఫీజు కట్టవలసిందే. ఇప్పుడు వెళ్ళటానికి వీసా వచ్చింది, పాస్‌పోర్టు వచ్చింది. దాని ఫీజు 'అమ్మ' నామంతో సరిపోతుంది. ఆంజనేయస్వామి రామునితో అన్నాడు "రామా నీకంటే నీ నామమే శక్తివంతమైనదని". పాస్‌పోర్టు ఉన్నా వీసా వున్నా మనల్ని జాగ్రత్తగా చేరుస్తాడనే నమ్మకం గల కెప్టెన్ దొరికితే మన గమ్యం చేరినట్టే. మనం ఎక్కే విమానం కెప్టెన్ మనకు హామీ ఇస్తున్నాడు! ఏమని? మిమ్ములను జాగ్రత్తగా ఈ విమానం ఎక్కించుకుని గమ్యం చేరే వరకూ మీకు కావలసిన అన్ని వసతులూ నేనే కనుగొని మీకు వసతులు నేను కల్పించి గమ్యం చేరుస్తానని. కెప్టెన్ చెప్పాడు సరే, మనకు నమ్మకం ఉండాలి కదా! ఆ నమ్మకం మనకు ఉంటే ఇక గమ్యం సురక్షితంగా చేరినట్లే. 'అమ్మ' అన్నది "మిమ్మల్ని నేను కన్నాను, నేనే పెంచాను. మిమ్మల్ని నాలోనే కలుపుకుంటాను" అని. అది పూర్తిగా హైమ నమ్మింది కాబోలు. 'అమ్మ'ను 'అమ్మా! నన్ను నీలో కలుపుకో, నేను ఎప్పుడూ నీ నామం వినేటట్లుగా చేయి' అని అర్థించింది. అంటే తనలో ఐక్యం చేసుకుంటుంది అనే నమ్మకం హైమకు ఉన్నదన్నమాట. హైమ జీవితం తన పుట్టుకతో ప్రారంభించి తన జీవితాన్ని గడిపి తన 25వ ఏటనే అమ్మను అర్థించి అమ్మలోనే లీనమైంది. అమ్మ అన్నది "హైమ'ను నేను కన్నాను, హైమను నేను పెంచాను, హైమను నేనే చంపుకున్నాను" అని అంటే సృష్టి, స్థితి, లయకారిణి అయిన అమ్మను మనం నమ్మితే మన సంసార నౌక గట్టెక్కినట్లే. ఇక అడ్డంకులు లేవు. జన్మలు లేవు. నేరుగా అమ్మలో లీనం కావడమే. ఈ నమ్మకమే మనం పెట్టవలసిన పెట్టుబడి. ఈ జీవిత ప్రయాణానికి పే చేయవలసిన ఫీజు. ఈ కోరికతో 'అమ్మ' నామంతో

మనం గమ్యం చేరుతాము అనే నమ్మకమే మనల్ని దరి చేరుస్తుంది. అందుకు అమ్మ అన్నది "నమ్మకమే భగవంతుడు" అని.

ఒక హరిదాసు హరికథ చెప్తున్నాడు. హరికథను భక్తులు అంతా వింటున్నారు. ఆ హరిదాసు ఆ ప్రక్కన వున్న ఊరునుండి రావాలి. మధ్యలో ఒక పెద్ద ప్రవాహంతో ఉన్న ఏరు వున్నది. దానిని లాంచీ మీద దాటాలి. హరిదాసు చెప్పాడు. "అనవసరంగా లాంచీకి డబ్బులు ఖర్చు దేనికి ? భగవంతుని నామం చేస్తూ పోండి ఏరు దాటవచ్చు" అని. ఆ హరిదాసు చెప్పిన విషయం ఒక భక్తునికి నచ్చింది. అనవసరంగా లాంచీకి డబ్బులు ఖర్చుదేనికి అని, లాంచీ కోసం కూర్చోకుండా భగవన్నామంతోనే ఆ హరిదాసు చెప్పిన విషయం మీద ఉన్న నమ్మకంతో ఆ ఏరుదాటి ఒడ్డుకు చేరాడు. ఆ భక్తుడు ఏరు దాటగానే హరిదాసు ఈ ఒడ్డున లాంచీకోసం ఎదురు చూస్తూ నిల్చున్నాడు. ఆ భక్తుడు కేక వేసాడు. స్వామీ ! మీరూ నామం చేస్తూ రండి ఎందుకు లాంచీ కోసం ఎదురు చూస్తున్నారు" అని. హరిదాసుకు భయం వేసింది. ఆయన చెప్పిన దానిమీద ఆయనకే నమ్మకం లేదు. శాస్త్రంలో చదివాడు అది విని హరికథ చెప్పాడు. కానీ దానిని నమ్మినవాడు భగవంతుని నామంతో గట్టుచేరాడు. మనం కూడా ఆ హరికథకుని వలే కాకుండా ఆ భక్తుని వలె నమ్మకంతో 'అమ్మ' మీద ఉన్న విశ్వాసంతో ఒడ్డుకు చేరి తరిద్దాం.

-ఆగష్టు, *2006*



# "నీకున్నది నీవు తృప్తిగా తిని ఇతరులకు ఆదరణగా పెట్టుకో"

అమ్మ తాను చేసే నిత్యాన్నదానాన్ని నిరంతర అన్న వితరణ అని పేర్కొంది. అమ్మ తన పిల్లలకు అన్నం పెట్టుకోవటము దానం ఎట్లా అవుతుందని ప్రశ్నించింది. అంతే కాకుండా ఒక అడుగు ముందుకు వేసి ఇక్కడ ఒకరు ఇంకొకరికి పెట్టటమేమీలేదు. ఎవరి అన్నం వారే తింటున్నారని చెప్పింది. తాను సర్వచరాచర సృష్టికి తల్లినని, మీరు నా బిడ్డలని నిర్వచించింది. తన ఇంటిని అందరిల్లు అని ప్రవచించింది. ఈ అందరింటిలో అందరికీ స్వాతంత్యం వున్నది. బాధ్యతలు కూడా వున్నవి. ఈ అందరింటిని నడుపవలసిన బాధ్యత అందరికి వున్నదన్నమాట. ఎవరి అన్నం వాళ్ళు ఇక్కడ తింటున్నారనటంలో మనం తినవలసిన అన్నం అక్కడ మనమే సమకూర్చుకోవాలి. అప్పుడే మన అన్నం మనం తిన్నట్లు. అందాకా ఇతరులన్నం తిన్నట్లే. అందుకే అమ్మే అన్నది "నీకున్నది నీవు తృప్తిగా తిని ఇతరులకు ఆదరణ పెట్టుకో". ఆ పెట్టటం ఆప్యాయతతో వుండాలని అర్థం. అది ఎవరినో ఉద్ధరించటానికి కాదు. అది నీ కోసమే, అంటే నీ తృప్తి కోసమే. "తృప్తే ముక్తి" అంది. ఏ పదార్థం లేక ఏదైనా ఎవరికి ఎంత ఇచ్చినా తృప్తి అనేది వుండదు. ఒక్క అన్నం తప్ప. ఆ అన్నం తింటానికి పరిమితి అనేది వున్నది. పరిమితిని మించి ఎవరూ తినలేరు. ఇది అన్నం అంటే అన్నమే కాదు. ఏ ఆహారమైనా సరే. ఈ ఆహారమే జీవులకు జీవితం గడపటానికి ముఖ్యమైనది. అందుకే 'అన్నిదానముల కెల్ల అన్నదానం మిన్న' అన్నారు. ఈ అన్నాన్ని "పరబ్రహ్మ స్వరూపం" అన్నది అమ్మ. అన్నం పరబ్రహ్మ స్వరూపమైతే మరి అశుద్ధమో" అని ప్రశ్నించింది. కారణం అశుద్ధమంటే మనం విసర్జించింది అని అర్థం. మనం విసర్జించింది ఇంకొక జీవికి అహార మౌతుంది. అది ఆ జీవికి పరబ్రహ్మ స్వరూపమే. ఆ జీవి విసర్జించింది మన పొలాలకు ఎరువుగా ఉపయోగించి మొక్కలకు ఆహారమౌతుంది. ఆ పొలాలలో పండిన పంట మరల మనకు ఆహారమౌతుంది. "అన్నం పరబ్రహ్మ స్వరూపమైతే మరి అశుద్ధమో" అని అన్న వాక్యంలో ఇంత అర్థం వున్నదన్న మాట అమ్మ. 1958 ఆగష్టు 15న పూర్వం ఎంతమంది తను చూడటానికి వచ్చినా అమ్మే వంట చేసి పెట్టేది. రాను రాను అక్కడకు ఎక్కువ మంది రావటం మొదలు

పెట్టిన తరువాత నాన్నగారికి ఎక్కువ ఆర్థిక ఇబ్బంది కలగకూడదని అక్కడకొచ్చే చీరాల సోదరులు మొదలగు వారు ఆగష్టు 15, 1958 న గాడిపోయ్యిలో నిప్పు అమ్మ చేత వెలిగింపచేశారు. అందరూ తలాకాస్తా వేసుకొని అన్నపూర్ణాలయం నిర్మాణం చేశారు. అప్పటి నుండి ఇప్పటిదాకా కొన్ని లక్షల మంది భోజనాలు చేసి ఉంటారు. అమ్మ అన్నారు “ఇక్కడకు వచ్చే వారు వారి వారి ఇండ్లలో రోజు వంటచేసుకొనేటప్పుడు ఒక గుప్పెడు బియ్యం విడిగా డబ్బాలో పోసి ఆ బియ్యాన్నంతా జిల్లెళ్ళమూడికి పంపితే అన్నపూర్ణాలయం దానంతట అదే జరిగిపోతుంది” అని . అట్లా కొంతమంది అక్కడ వచ్చే సోదరులు ఆ పనిచేసేవారు. దీనిలోని తాత్విక విషయం ఏమిటంటే తమ ఇంట్లో తాము తినటమే కాకుండా ఇతరులకు కూడా ఆప్యాయతతో పంచటం అన్నమాట. సంక్రాంతి పండుగ రోజుల్లో హరిదాసులకు గుప్పెడు బియ్యం పెట్టటం మనకు మన పూర్వులు నేర్పిన ఆచారం. దాని అంతరార్థం ఇదే. ఆ హరిదాసులు ఈ నెలలో వచ్చిన బియ్యాన్ని వారికి సంవత్సరకాలం వచ్చేటట్లుగా తిరిగేవాళ్ళు. అట్లాగే మన జిల్లెళ్ళమూడిలో శ్రీరాముల వెంకటేశ్వర్లు అనే పేరు గల హరిదాసుగారు తను ఆనెలలో తిరగటానికి వోపిక వున్న వూళ్ళు తిరిగి గుప్పెడు బియ్యం చొ॥ సేకరించి ఆ వచ్చిన బియ్యాన్ని అన్నపూర్ణాలయానికి ఇచ్చి ఆయన, ఆయన భార్య కృష్ణవేణమ్మ అక్కయ్య ఇక్కడే తింటూ ఇక్కడే వుంటూ అమ్మకు సేవచేశారు. జిల్లెళ్ళమూడికి ఆకాలంలో తహసీలుదారుగా బాపట్లలో పనిచేసిన శ్రీ పమిడిపాటి వీరయ్యచౌదరిగారి భార్య ఇంటి ఇంటికి తిరిగి గుప్పెడు బియ్యం చొ॥ వసూలు చేసి అన్నపూర్ణాలయం నిర్వహణకు ఇచ్చేది. అమ్మను ఒకసారి నేను అడిగాను. 'యీ అడుక్కోటం ఎన్నాళ్ళమ్మా' అని. అమ్మ అంది “ఏదైనా నీకోసం అడిగితే అది అడుక్కోవటం నీవు ఇతరుల కోసం అడిగితే అది అడగటమే కాని అడుక్కోవటం కాదు” అని తెనాలిలో డాక్టర్ వెంపటి సూర్యనారాయణగారనే కంటి డాక్టరు వుండేవారు. ఆయన గాంధీగారి అడుగుజాడలలో నడిచే గాంధేయవాది. ఆయన దగ్గరకు ఎంతమంది వెళ్ళినా ఏ విచక్షణ లేకుండా కంటి ఆపరేషన్లు ఫ్రీగా చేసేవారు. ఆయన సర్వోదయ నాయకులు కూడా. ఆ సంస్థను నడపటానికి ఆ సర్వోదయ సేవకులు ఇంటి ఇంటిని తిరిగి గుప్పెడు బియ్యం చొప్పున రోజూ వసూలు చేసి అది ఆ సంస్థకు ఇచ్చేవారు. ఈ ప్రక్రియ చాలా శ్రమతో కూడిన పని. తర్వాత స్వచ్ఛందంగా ఎవరికి వాళ్ళు వారి పరిధిలో సహకరించవలసిన

సేవా పథకం. ఇప్పుడు ఫిబ్రవరి 17న ప్రతి సంవత్సరం నాన్నగారి ఆరాధనోత్సవాలు జరుగుతున్నవి. ఆరాధనోత్సవాల సందర్భంగా ఈ కాలంలో పంటలొచ్చి అందరు సుభిక్షంగా వుండే రోజులు కాబట్టి జిల్లెళ్ళమూడికి వచ్చే సోదరీ సోదరులందరు తలకొక బియ్యం బస్తా లేక ధాన్యం బస్తా లేక దానికి సరిపడ పైకం శ్రీ విశ్వజననీ పరిషత్, జిల్లెళ్ళమూడికి పంపితే సంవత్సరానికి సరిపడ్డ ధాన్యం, పప్పు, చింతపండు, నూనె, మిరపకాయలు, మినపప్పు మొదలగు నిత్యావసర వస్తువులు, చింతకాయ, గోంగూర, ఉసిరికాయ, నిమ్మకాయ, మామిడికాయ మొదలగు పచ్చళ్ళు ఏర్పర్చుకుంటే అన్నపూర్ణాలయంలో మన అన్నం మనం తిన్నవాళ్ళ మవుతాయి. అప్పుడు ఎవరి అన్నం వాళ్ళే తింటున్నారని అమ్మ అనటంలో కొంత సార్థకముంటుందేమో కాని "మీకున్నది మీరు తృప్తిగా తిని ఇతరులకు ఆదరణగా పెట్టుకో" అనే మాటకు వస్తే, అసలు మనకున్నదేమిటి ? మనం పుట్టేటప్పుడు మనతో ఏమైనా తెచ్చుకున్నామా ! పుట్టినప్పటి నుండి ఆముదము, పాలు, కట్టుకోవటానికి గుడ్డ అన్ని ఇతరులు (తల్లి) ఇవ్వవలసినవే, అంటే, అనగా భగవంతుడు ఏర్పరచవలసినవే. పుట్టినప్పటి నుండి గిట్టే వరకు తను తీసికొనే ఆహారము, కట్టుకోవటానికి గుడ్డలు, వుండటానికి గూడు, సుఖము, దుఃఖము, మంచి, చెడు, స్వర్గము, నరకము, పాపము, పుణ్యము సర్వం వాడివ్వవలసినవే. మనకున్నది లేదు. తెచ్చుకున్నది అంతకంటే లేదు. నిశితంగా ఆలోచిస్తే అన్నీ ఇక్కడ ఏర్పడ్డవే. వాడు ఏర్పరచినవే. చివరకు చనిపోయినపుడు కూడా తనతో పాటు ఏమీ తీసికెళ్ళలేదు. పోయేటప్పుడు వెంటరాదుగా పుచ్చినవక్కైనా - అనే నానుడి యదార్థమే. ఎంత ధనికుడైనా తనతో తీసికెళ్ళేదేమీ లేదు. కారణం తనకున్న ఆస్తులు పాస్తులు, ధనికము, దారిద్ర్యము, అంతవరకు తన మీద ఉన్న బంగారము, గుడ్డలు చివరకు మొలత్రాడులో సహా తీసివేసే సాగనంపుతారు. కారణం వచ్చేటప్పుడు వాడితో ఇవ్వన్నీ తీసికొని రాలేదుగా. అన్నీ వాడిచ్చినవే. అందుకే అమ్మ అన్నది. "నీకున్నది తృప్తిగా తిని ఇతరులకు ఆదరణగా పెట్టుకో. అన్నీ వాడే చేస్తున్నాడనుకో" అనే కంటే నేరుగానే" వాడిచ్చింది నీవు తృప్తిగా తిని ఇతరులకు ఆదరణగా పెట్టుకో" అనేదే అసలైన అమ్మ మాట.

**అమ్మ మాటలు ఆణిముత్యాలు - తరచి చూస్తే నిత్య సత్యాలు.**

-మార్చి, *2006*

# నేను ఎవరో నేను తెలియపరిస్తే గాని మీరు నన్ను తెలుసుకోలేరు !

"ఇమ్ముగ చదువని నోరును
అమ్మా యని పిలిచి అన్నమడుగని నోరును.
తమ్ముల పిలవని నోరును,
కుమ్మరి మన్ను తవ్వినట్టి గుంటర సుమతీ."

అనే సుమతీ శతకంలోని పద్యం జ్ఞాపకం వచ్చినప్పు డల్లా, ఎందుకో నాకు హృదయం పిండినట్లుగా వుండేది. అది ఎవరికీ చెప్పుకో లేనిది, ఎవరూ తీర్చలేనిది. నేను అప్పికట్లలో 4వ తరగతి చదువుతున్నప్పుడు మా నాన్నగారు నన్ను క్లాసులో What is your mother's name ? అని అందరినీ అడిగినట్లుగానే నన్ను అడిగారు. దానికి నేను గ్రుక్క పెట్టినట్లు ఏడవడం ప్రారంభించాను. క్లాసులో ఒక అమ్మాయి నన్ను ఎత్తుకుని ఇంటికి తీసుకుని వెళ్ళి మా పిన్నికి చెప్పింది. మా పిన్ని మా నాన్నగారు వచ్చిన తరువాత వాడి మనసు తెలిసి కూడా ఎందుకు అట్లా ప్రశ్నలు వేసారు అని అడిగింది. నాకు చిన్నప్పుడే అనగా దాదాపు 4, 5 సంవత్సరాల ప్రాయంలో మా అమ్మ చనిపోయింది. మా నాన్నగారు రెండవ పెండ్లి చేసుకున్నారు. ఆమె కాపురానికి వచ్చిన తరువాత ఆమెను అమ్మా అని నాతో పిలిపించడానికి విశ్వప్రయత్నం చేసారు. కానీ నేను అమ్మా అనిపిలువలేదు. పిన్ని అని పిలిచేవాడిని. ఆమె నన్ను ఎంతో ఆప్యాయతతోనే పెంచింది. కానీ ఆమెను అమ్మా అని పిలిచేవాడిని కాదు. అప్పికట్లలో నేను 1949 - 1950లో ఎస్.ఎస్.ఎల్.సి. చదివేటప్పుడు రఘువరదాసు గారు బృందావనం నుండి క్రొత్తగా వచ్చిన రోజులలో అప్పికట్లలోనే వుండి రామనామ ఏకాహాలు, సంకీర్తనలు మా ఇంట్లోను, కంభంపాటి శ్రీరామచంద్రమూర్తిగారి ఇంట్లోను చేసేవారు. మా ఇంట్లోనే ఆయన తన భక్తబృందంతో నృత్యం చేసేవారు. ఆ ఏకాహాలకు, సప్తాహాలకు జిల్లెళ్ళమూడి నుండి 'అమ్మ' మా ఇంటికి కూడా వస్తూ వుండేది. కారణం ఆ వూరిలోనే 'అమ్మ' మరిది లోకనాథంబాబాయి టీచరుగా పనిచేస్తూ ఉండేవారు. 'అమ్మ' పెద్దకుమారుడైన సుబ్బారావు కూడా అక్కడే వుండి చదువుతూ మా ఇంటికి మా నాన్న దగ్గర ప్రైవేటుకు వస్తూ వుండేవాడు. అందుచేత ఆమెను సుబ్బారావు అమ్మగా లోకనాథం మాష్టారి వదినగారిగా మాత్రమే భావిస్తూ వుండేవాళ్లం.

'అమ్మ' కూడా మమ్ములను చూస్తూనే పలకరిస్తూ వుండేది. మట్టిపూడిలో జరిగే దత్తజయంతికి రఘువరదాసుగారు రామనామ సప్తాహాలు, సప్తసప్తాహాలు చేస్తూ వుంటే మేము ఇద్దరం (నేను, కొండముది రామకృష్ణ) తరచుగా వెళ్ళేవాళ్ళం. 'అమ్మ' కూడావస్తూ వుండేది. ఒకసారి పూండ్లలో ఒక ఆలయంలో సప్తాహం జరుగుతూవుంటే ఆ ఆలయం వెనకాల ఒక చెట్టు క్రింద అరుగు మీద 'అమ్మ' జుట్టు విరబోసుకుని కూర్చుంటే మేము ఇద్దరం వెళ్ళి ఆమె దగ్గర తీర్థం వేయించుకుని ప్రసాదం తీసుకున్నాము. అప్పుడు ఆమెను అంతా ఒక యోగిని అని చెప్పుకునేవాళ్లు. అట్లా మొదటి పరిచయం ఏర్పడ్డది. తర్వాత 1960లో నేను, రామకృష్ణ జిల్లెళ్ళమూడి వెళ్తువస్తూ వుండేవాళ్ళం. ఒకరోజు అక్కడ జరిగిన ఫంక్షనులో సిరిగిరి సుబ్బారావు తనకు కండ్లు లేకపోయినా సాక్షాత్తు ఆ లక్ష్మీనరసింహస్వామిని దర్శిస్తూ వున్నట్లు లక్ష్మీనరసింహకరావలంబస్తోత్రం చేయడం, దానికి 'అమ్మ' మమ్ములను ప్రత్యేకంగా పిలిపించడం, అది విన్న తరువాత 'అమ్మ' మీద సాహిత్యం తీసుకురావాలని తలంపు కలగటం 1962లో మొదటిసారిగా మన్నవలో జరిగే 'అమ్మ' జన్మ దినోత్సవ సందర్భంగా "మాతృశ్రీ' జన్మదినోత్సవ సంవత్సర పత్రికను మేము ఇద్దరం 'అమ్మ' చేత ఆవిష్కరింప చేయటము జరిగింది. అక్కడ నుండి వరుసగా 1963, 1964, 1965 పత్రికలు కూడా మేము ఇద్దరమే తీసుకురావడం. 1966 నుండీ మాతృశ్రీ మాసపత్రికగా రూపు దిద్దుకోవటం. ఇత్యాదులన్నీ మీకు తెలిసిన విషయాలే. ఈ 1962 సంవత్సర జన్మదినోత్సవ పత్రిక తెచ్చిన తర్వాత 'అమ్మ' మద్రాసు వెళ్లటము. మద్రాసు నుండి 'అమ్మ' వచ్చింతర్వాత మేము ఇద్దరం జిల్లెళ్ళమూడి వెళ్ళి 'అమ్మ'ను చూచి రావటం జరిగింది. అంత వరకూ నేను రామకృష్ణతో మాత్రమే వెళ్ళి వస్తూ వుండేవాడిని. అప్పటికి నేను 1955 నుండి బాపట్లలో లక్ష్మీప్రసాద్ & కో అనే పుస్తకాల షాపు ప్రొప్రయిటరుగా అత్రివాణిప్రెస్ కాంట్రాక్టుకు తీసుకుని ప్రెస్ నడుపుతూ వుండేవాడిని. ఆ ప్రెస్సులోనే మాతృశ్రీ 1962, 63, 64,65, పత్రికలు ప్రింటు చేసాము. 'అప్పుడు అమ్మ' "అది అత్రివాణీప్రెస్" కాదురా అత్రి రాణి ప్రెస్ అని అంటూ ఉండేది. ఆ అనుభవంతోనే 'అమ్మ' మీద సాహిత్యం తీసుకు రావాలని సంకల్పం. ఆ అనుభవం తోనే మాతృశ్రీ ప్రింటర్సు, పబ్లిషర్స్ శ్రీ అధరాపురపు శేషగిరిరావు అన్నయ్య సహాయ సహకారాలతో 'అమ్మ' ఆశీస్సులతో ప్రారంభించాము. నేను మా పుస్తకాల షాపులో వుండగా ఒకరోజు ఒక కుర్రవాడు వచ్చి జిల్లెళ్ళమూడి 'అమ్మ' మిమ్ములను రామకృష్ణతోనే రానవసరం లేదు. ఒంటరి గానే జిల్లెళ్ళమూడి రమ్మని కబురు

పంపారు. ఆ రాత్రి కొట్టు కట్టివేసిన తరువాత ఒంటరిగానే బాపట్లనుండి బస్సులో 7వ మైలు వద్ద చీకట్లోనే దిగి తెల్లగా కనబడే కాలిబాటలో జిల్లెళ్ళమూడి చేరాను. జిల్లెళ్ళమూడిలో అమ్మ వుండే పూరింటి ముందు వున్న బావి దగ్గర కాళ్లు కడుక్కుని లోపలికి అడుగు పెట్టాను. నేను లోపలికి వెళ్ళగానే "రా నాన్నా గోపీ" అంటూ లోపలికి నా చేయిపట్టుకుని తీసుకొని వెళ్ళింది. 'అమ్మ' నన్ను 'గోపీ' అని సంబోధించటం నాకు ఆశ్చర్యం కలుగ జేసింది. నన్ను 'గోపీ' అని మా అమ్మ మా అమ్మకు సంబంధించిన యావన్మంది. బంధువర్గం పిలిచే సంబోధన, గోపీ అని ఇంకెవ్వరూ పిలవరు. ఎవ్వరైనా గోపీ అనిపిలిచారంటే వారు మా అమ్మకు సంబంధించిన వారే. నన్ను మానాన్న గారు బాలు అని పిలిచేవారు. అందుకే మా పిన్నికి సంబంధించిన బంధువర్గం బాలు అనే పిలుస్తారు. ఇప్పటికీ హైదరాబాద్‌లో వున్న సోదరులు వెంకటకృష్ణ, పొత్తూరు వెంకటేశ్వరరావు గారు శాస్త్రీ, రాధ – గోపీ అనే పిలుపుకే అలవాటు పడ్డారు. ఆ రాత్రంతా 'అమ్మ' తో ఒంటరిగానే గడిపాను. 'అమ్మ' నాతో రామకృష్ణ జాతకానికి సంబంధించిన అనేక విషయాలు ముచ్చటించారు. ఆ సంభాషణ పర్యవసానమే నేను రామకృష్ణతో 10 వారాల పాటు ప్రతి ఆదివారం 'అమ్మ'కు మహన్యాసపూర్వక ఏకాదశ రుద్రాభిషేకాలు, కన్యాకుమారి నుండి తెచ్చిన సర్వ తీర్థంతో (మూడునదులు కలిపిన తీర్థం) 11వ వారం 'అమ్మ'కు మహారుద్రాభిషేకం చేయించాను. దాని ఫలితమే వాడికి ఆయుర్దాయం పెంపు, నాకు నిరంతర అమ్మ సాన్నిధ్యం పొందే అవకాశం కలిగాయి. ఆ 11 వారాలు 'అమ్మ' నాకు తన స్వీయ చరిత్రలోని ముఖ్యఘట్టాలు తెలియ చేసారు. ఆ ఘట్టాలలోని సారానికి చలించిన నేను ముఖ్యంగా రాత్రిపూట 'అమ్మ'ను ఒంటరిగా వదలకుండా 'అమ్మ' తోనే జీవితంగడపటానికి నిర్ణయించుకుని 'అమ్మ' అనుమతిన 3 సంవత్సరాలు అట్లాగే గడిపాను. అది కత్తిమీద సాము లాంటిది. ఒక రోజు 'అమ్మ' స్నానాల గదిలో, నీళ్ల తొట్టి వద్ద 'అమ్మ' ఒక ప్రక్క, నేను 'అమ్మ'కు ఎదురుగా ఒక ప్రక్క, తొట్టిమీద గడ్డంమీద చేయి పెట్టుకుని ఒంగి కబుర్లు చెప్పుకుంటున్నాము. నేను కొంటెగా నాన్నగారిని ఏదో అన్నాను. అమ్మ తొట్టిలో నున్న చెంబు తీసుకుని నా మీదకు విసిరింది. అది తగిలి నా తలకు గాయమై రక్తం కారటం ప్రారంభించింది. 'అమ్మ' వెంటనే తన చీర చించి గాయానికి కట్టుకట్టి ఏడ్వడం ప్రారంభించింది. అపుడు నేనన్నాను "అమ్మా! నువ్వు ఏడ్వవద్దు దానికి పూర్వగాథవుంది. నాకు మా అమ్మ చిన్నప్పుడే చనిపోయింది. ఆమె ఎట్లా వుంటుందో నాకు జ్ఞాపకం లేదు. కానీ ఆమె చేసిన ఒక చర్య మాత్రం ప్రస్ఫుటంగా

జ్ఞాపకం వుంది. ఒక రోజు నాకు తలంటి పోయటానికి ఆముదం తలకు రాయటానికి బయలుదేరింది. నేను ఆమెకు చిక్కలేదు. మునిపల్లెలో మా ఇంటిముందు ఒక బావి వుండేది. ఆమెకు అందకుండా బావి చుట్టూ తిరగడం ప్రారంభించాను. ఆమె తిరిగి తిరిగి విసిగి వేసారి ఆ బావిమీద వున్న చెంబు నా మీద విసిరివేసింది. అది తగిలి తలకు గాయమై రక్తం కారింది. ఆమె నన్ను పట్టుకుని ఏడుస్తూ తన చీర చెంగు చించి కట్టుకట్టటం నాకు బాగా జ్ఞాపకం. నేను మీ అమ్మనే అని తెలియ చేయటానికి. "నే నెవరో నేను తెలియ పరిస్తే గానీ మీరు నన్ను తెలుసుకోలేరు" అనే నీ సూక్తి ననుసరించి నీ వెవరో నాకు తెలియ పర్చావు. నా జీవితంలో మొదటిసారిగా నాకు తెలిసి అమ్మా ! అని పిలిచింది నిన్నే. అని అమ్మ ఒడిలో వాలిపోయాను. మా అమ్మ అమృతలూరు పులిపాక వారి ఆడపడుచు. ఆమెకు 6 గురు అప్పచెల్లెళ్లు, ముగ్గురు అన్నదమ్ములు. మా అమ్మమ్మకు అప్పటికి 90 ఏండ్లు వుండేవి. ఒక సారి ఆమెను చూద్దాం అనిపించింది. అమ్మతో ప్రస్తావించాను. అమృతలూరు వెళ్లి చూచిరమ్మన్నది. అమృతలూరు వెళ్లాను. ఆమెకు కళ్లు సరిగా కనబడటం లేదు. నేను వెళ్ళగానే మా పిన్నతల్లి అమ్మ చెల్లెలు 'అమ్మా గోపీ వచ్చాడే' అని చెప్పింది. ఏడేవాడు అని ఆమె కన్నీళ్లతో గట్టిగా నన్ను కౌగలించుకొన్నది. ఆ తరువాత ఏరా గోపీ నీవు జిల్లెళ్ళమూడిలో ఒక దేవత దగ్గరవుంటూ ఆమెకు సేవ చేస్తూ వున్నావట గదా ఏవిరా నీ అరచేతులు ఒకసారి నాకు చూపు అని నా రెండు అరచేతులు తీసుకుని తన రెండు కళ్లకూ అద్దుకున్నది. అప్పటికి గానీ నాకు తెలియ లేదు నా రెండు అరచేతులకు వున్న ప్రాముఖ్యత. నేను తెల్లవార్లు 'అమ్మ'కు అవసరమైన సేవలు చేస్తూ, అందులో భాగంగా ఒక చేత్తో నడుం వ్రాస్తూ ఒక చేత్తో విసనకఱ్ఱతో విసిరేవాడిని. ఏ చెయ్యి ఆగినా అమ్మ లేస్తుందేమో అని భయం. ఇది చాలమంది అదృష్టవంతులకు ఉన్న అనుభవమే. అదృష్టం అని ఎందుకు అన్నాను అంటే, అది దృష్టం కానిది కనపడనిది. అది అమ్మ మనకు తనకుగా తాను ప్రసాదించ వలసినదే కానీ మనం తెలుసుకోలేము. 'అమ్మ' నాకు తాను అమ్మ నని తెలియ చేయటమే కాక తను సర్వాంతర్యామిని అని నాకు ఇచ్చిన దివ్య అనుభవం. అదే విశ్వరూప సందర్శనం కూడా అని తానే చెప్పటం, అది నాకెందుకిచ్చావమ్మా ! అని అడిగితే ఏమోరా! ఎందుకో ఇద్దాం అని అనుకున్నాను ఇచ్చాను. అని చెప్పటం, అదృష్టం కాక ఏమిటి మరి. అమ్మ తనకు కావలసిన వారిని తానే ఎన్నుకుంటుంది. తానెవరో తెలియ పర్చుకుంటుంది. ఇది తాపసులకైనా వీలయ్యేవిషయమా ?

– జూన్, *2006*

# మీరు తింటే నేను తిన్నట్లే

అది దాదాపు 1964వ సంవత్సరం. అప్పుడు శ్రీ అధరాపురపు శేషగిరిరావు అన్నయ్య సంస్థ వ్యవహారములు చూస్తువుండేవారు. ఆయన అక్కడవున్న కాలంలోనే అందరింటి పునాదులు త్రవ్వి అమ్మ దగ్గర ఉందామని వచ్చిన సోదరీ సోదరులెల్లరు ఈ అందరింటి కట్టుబడికి ఇసుక మోయటం, సిమెంటు బస్తాలు మోయటం, పునాదులు త్రవ్వటం మొదలగు అన్ని నాన్‌టెక్నికల్ పనులు చేస్తూ వుండేవాళ్ళు. పొలాలకు వెళ్ళటం, పొలాలకు నీళ్ళు పెట్టటం, నాట్లు వెయ్యటం, కోతలు కోయటం, కుప్పలు వెయ్యటం, కుప్పలు నూర్చటం ధాన్యం ఇంటికి తోలుకురావటం, చెరువునుండి అమ్మకు స్నానానికి నీళ్ళు కావడులతో తేవడం, త్రాగటానికి చెరువు నుండి నీళ్ళు తీసికొని రావటం మొదలగు అన్ని అందరింటి పనులు చెయ్యటం, సుప్రభాత, సంధ్యావందనాలలో పాల్గొనడం మొదలగు అన్ని పనులు శేషగిరిరావు అన్నయ్యచే నిర్మించబడిన అమ్మ నివసించే పర్ణ కుటీరము నుండి నిర్వర్తిస్తుండే వాళ్ళం. శేషగిరిరావు అన్నయ్య సారధ్యములో అందరింటి నిర్మాణములో పునాదుల నుండి సూపర్ స్ట్రక్చర్ కూడా పూర్తి చేసికొని ఆ ఇంటి గ్రౌండ్ ఫ్లోర్ స్లాబ్ కూడా వెయ్యటం పూర్తి చేశారు. స్లాబ్ అంతాపూర్తి చేసి క్రింద నున్న పోటీ కర్రలు తీసి వేసిన తర్వాత అమ్మను తీసికెళ్ళి ఆ బిల్డింగ్‌ను చూపిద్దామని శేషగిరిరావు అన్నయ్య అమ్మతో పాటు నన్ను కూడా రమ్మన్నారు. అప్పుడు ఈ పర్ణశాలనుండి ఆ ఇంటిదాక అన్నీ చేలే. అట్లాగే మన అమ్మను ఆ చేలల్లో నుండి మెల్లగా నడిపించుకుంటూ కొత్త ఇంటికి చేరాము. ఆ క్రొత్తభవనానికి వున్న మెట్లు చాలా ఇరుకుగా, నిట్టనిలువున కట్టబడినవి. అమ్మను నేను ఒక ప్రక్క, శేషగిరిరావు అన్నయ్య ఒక ప్రక్క పట్టుకొని మెల్లగా మెట్లు ఎక్కించడం మొదలు పెట్టాము. మెల్లగా మెట్లన్ని ఎక్కి దాదాపు పైకి వెళ్ళాము. ఇంకా రెండు, మూడు మెట్లు మాత్రమే వున్నవి. అమ్మ అక్కడ నుండిఒక్కసారి అటు ప్రక్క, ఇటు ప్రక్క తేరిపార చూచింది. ఇంకొక మెట్టు పైకి ఎక్కింది. ఈ మూలనుండి ఆమూల దాక వున్న విశాలమైన ప్రదేశాన్నంతా ఒక్కసారిగా చూచింది. అంతే అమ్మకు కలిగిన ఆనందానికి హద్దులు లేవు. అమ్మ ముఖము ఎర్రగా కందగడ్డలాగా అయిపోయింది. ఆ కళ్ళ నుండి నీరు సన్నగా కారుతున్నాయి. అవి నిజంగా ఆనంద భాష్పాలే. ఆ ఆనందం అవధులు దాటింది. ఎంత ప్రదేశమున్నది !

ఇక్కడ ఎంతమందో నా బిడ్డలు ఒక్కసారిగా కూర్చొని అన్నాలు తినవచ్చు" అని అంటూ ఆనందంతో ఒళ్ళు తెలియకుండా ఒక్కసారి మా ఇద్దరి మీద విరుచుకున్నది. ఆ ఇరుకు మెట్ల మీద అన్నయ్య పై మెట్టుమీద, నేను క్రింద మెట్టుమీద వుండి అమ్మను పట్టుకొని వున్నాము. ఒక్కసారి ఏ మాత్రము ఎవరు స్లిప్ అయినా అందరం మెట్ల క్రిందనే వుంటాము. నాకు ఆ క్షణం అమ్మ ముఖంలో వున్న ఆ ఆనందం వర్ణించటానికి ఆ ఆదిశేషునకు కూడా వీలు పడదేమో. ఒక్క కెమెరాకు తప్ప. తన పిల్లలకు ఒక్కసారిగా ఎంతోమందికి అన్నం పెట్టుకోవడం అంటే ఎంత ఆనందమో అమ్మ ముఖవర్చస్సు ఎట్లు వుంటుందో 1973లో జరిగిన స్వర్ణోత్సవాలలో లక్షమంది ఒక్కసారి భోజనము చేస్తుండగా అమ్మను చూచిన లక్షలాది మందికి తెలుసు. అందుకే అమ్మ అన్నది. "నాకు ఈ కలిలో ఆకలి లేదు" మీకు పెట్టుకోకపోతే నేను చిక్కిపోతాను" "మీరు తింటే నేను తిన్నట్లే" అని.

– *జులై, 2006*



# జన్మలు లేవంటే భయపడతారెందుకు? -అమ్మ

ఒకసారి అమ్మ గదిలో ఫోన్ మ్రోగింది. ఎవరా అని చూస్తే శ్రీపాదగోపాలకృష్ణమూర్తిగారు రాజమండ్రిలో పోయినారని ఆయనను జిల్లెళ్ళమూడికి తీసికొని వస్తున్నామని వారల్లుడు శ్రీ వి.పి. రామారావు గారు ఫోను చేసారు. ఆయనకు దహన సంస్కారాలు చేయటానికి ఆయనకు ఒక్కతే కూతురు. కొడుకులు లేరు. అందుచే కూతురైనా, కొడుకైనా శ్రీమతి గాయత్రిగారే. గాయత్రి వచ్చి అమ్మతో సంప్రదించింది. అమ్మ గాయత్రితో ఆయనకు తలకొరివి పెట్టి దహన సంస్కారాలు చేసి కర్మలు చేయితలచుకుంటే చెయ్యమంది. రామకృష్ణ సహకారము అందిస్తాడని చెప్పింది. శాస్త్ర ప్రకారం ఆడవాళ్ళు దహన సంస్కారములు కాని కర్మకాండకాని చెయ్య కూడదట. కాని అమ్మ నేనున్నాను. నీకేం ఫర్వాలేదు. నీవే చెయ్యమని గాయత్రిని ఆదేశించింది. దహన సంస్కారాలు అయిన తర్వాత కర్మ మొదలు పెట్టారు. ఇప్పుడు జిల్లెళ్ళమూడి లోని సైక్లోన్ సెంటర్ ప్రక్కన కర్మ చేస్తున్నారు. అమ్మా, నేనూ చూద్దామని వాత్సల్యాలయంలోని ఉత్తర భాగాన వున్న పిట్టగోడ వద్ద నిలబడివున్నాము. ఆ మంత్రాలలో మాటి మాటికి ప్రేత, ప్రేత అని బ్రాహ్మణులు చెప్పుతుంటే అమ్మ అన్నది" "వాడు జన్మలు లేవు అని తొడగొట్టి సవాలు విసిరితే వాళ్ళంతా ప్రేత, ప్రేత అని వాడి ప్రాణాలు తీస్తున్నారేమిటిరా" అన్నది. ఆయన అమ్మతో మాట్లాడేటప్పుడు - అమ్మా ! నేను జన్మలు లేవని తొడగొట్టి సవాలు చేసేదా ? - అని అడిగాడు. అమ్మ చెయ్యమంది. "ఎవ్వరైనా నిన్ను ఎదుర్కొంటే నా దగ్గరకు తీసికొనిరా. నేను సమాధానం చెప్తాను" అంది.

ఒకసారి 40 రోజులు శ్రీపాదగోపాలకృష్ణమూర్తిగారు, వి.ఎమ్.ప్రసాదరావుగారు, రామకృష్ణ యింకా కొంతమంది సోదరులు అమ్మతో సంభాషణలు అనేక టాపిక్స్ మీద జరిపారు. అందులో జన్మల మీద కూడా. నేను రోజు ప్రొద్దున్న బాపట్ల వెళ్లేటప్పుడు ప్రారంభమైన సంభాషణలు రాత్రి నేను వచ్చే దాకా సాగేవి. నేను అమ్మతో అన్నాను. "అమ్మా ! ఈ జన్మల మీద ఇంత తర్జన భర్జనలు చేస్తున్నారు ఇంతకూ అసలు జన్మలు వున్నయ్యా" అని. అమ్మ అన్నారు "వాళ్ళ సంగతి నీకెందుకులే, నీకు లేవు" అని. ఆ సంగతి నాకు తెల్సు. ఎందుకంటే గాయిత్రీస్వరూపిణి అయిన అమ్మను అహర్నిశలు సేవచేస్తూ, స్మరిస్తున్న

నాకు, నాకేకాదు మా వంశానికి చెందిన కశ్యపమహర్షి దగ్గర నుండి నా వరకు, నా నుండి రాబోయే మా వంశస్తులందరికి గూడా జన్మలు లేనే లేవు. నేను అమ్మను దర్శించిన, స్పృసించిన, స్మరించిన ఫలం అటువంటిది. అమ్మ ఒకసారి నాతో అన్నారు, "నేను జన్మలు లేవురా అని చెప్పుతున్నా నా మాట మీద నమ్మకం కనబడటం లేదు. ఎందుకో మీకు జన్మలు లేవంటే భయపడుతున్నారు? జన్మరాహిత్యం కావాలని మాట వరుసకు అడుగుతున్నారే కాని నిజంగా లేదని అభయం మిచ్చినా ఈ భయం దేనికో ?"

అందుకే అమ్మ అన్నది "మీలో నేను దైవత్వం చూస్తున్నాను. నాలో మీరు మానవత్వం చూస్తున్నార"ని. **-సెప్టెంబర్, 2006**



# దేవాలయాలు

ఒక బల్లమీద ఒక గులాబీపువ్వు వుంది అనుకోండి. అదిగో అది గులాబీ పువ్వు అని చూపుడు వేలుతో చూపిస్తున్నాడు. కానీ చూపుడు వేలు గులాబీ పువ్వు కాదు. ఆ వేలు చూపించిన గులాబీ పువ్వును చూడవలసింది ఆఘ్రాణించవలసింది మనమే. ఆ చూపుడు వేలు చూపించ డానికే ఉపయోగిస్తుంది.

అది గురువులాంటిది. అందుకే అమ్మ అన్నది గుర్తు చూపించేవాడే గురువు అని. “మన ఇంట్లో మన తల్లితండ్రుల ఫోటోలు, తాతముత్తాతల ఫోటోలు, మన నాయకుల ఫోటోలు వుంటాయి. వాటిని పూలదండలతో అలంకరించి భక్తిశ్రద్ధలతో చూస్తాము. ఆ ఫోటోలు మన తల్లిదండ్రులా? మన తాతముత్తాతలా? మన నాయకులా? కాదు. అవి వారి వారి గుణగణాలను స్ఫురింపచేస్తాయి. మన జాతీయ పతాకం వున్నది. అది త్రివర్ణాలతో నేయబడిన గుడ్డ మాత్రమే. అందులో అశోకచక్రం వున్నది. దానిని ఒక గుడ్డ ముక్కగా చూస్తున్నామా! దానిని ఒక వున్నతమైన ప్రదేశంలో ఎగరవేసి దానికి గౌరవ వందనం చేస్తున్నాము. అది మన జాతీయ వ్యవస్థకు చిహ్నము. ఆ పతాకం కోసం ప్రాణాలు అర్పించిన వారు ఎందరో. అట్లాగే మన దేవాలయాలలో ఉన్న విగ్రహాలు భగవంతుణ్ణి స్ఫురింపచేస్తాయి. మనలను ఉత్తేజపరిచి భగవంతుణ్ణి చూడటానికి ఆలంబన అవుతాయి.” భగవాన్ సత్యసాయి బాబా ప్రసంగవశాన చెప్పిన ప్రవచనము. అలాగే 'అమ్మ' అన్నారు. విగ్రహములు నిగ్రహము కొరకే అని. అదే కాకుండా ఒక ప్రవాహము కలిగిన పెద్దకాలువ వున్నది అనుకోండి దానిలో నుండి నీరు త్రాగాలంటే, ప్రవాహము దగ్గరకు వెళ్లాలి. గట్లు చాలా పెద్దవిగా వున్నాయి. క్రిందకు దిగటానికి వీలు లేదు. అటువంటప్పుడు దానికి ఒక రేవు కావాలి. ఆ రేవునుండి క్రిందకు దిగి ఆప్రవాహములోని నీరు సులభంగా త్రాగవచ్చు. ఆ ప్రవాహంలోని నీటిని అందుకోటానికి రేవు ఎట్లా అవసరమో, అట్లాగే భగవంతుని చూడడానికి భగవంతుని చేరడానికి ఆలయాలు, ఆలంబనగా ఉపయోగిస్తాయి. కానీ అవి గమ్యంకాదు. ఎందెందు వెదికి చూచిన అందందే కలడు చక్రి అని ప్రహ్లాదుడు అంటాడు. ఎక్కడ అని వెతుకుతాము. అందుకే 'అమ్మ' అన్నారు. దేవులాడినా దొరకని వాడే దేవుడు అని.

ఎందుకు దొరకడు? వాడు సర్వాంతర్యామి అయి నపుడు, అంతా అదే అయినపుడు, సర్వమూ తానే అయినపుడు "భగవంతుణ్ణి ప్రత్యేకముగా ఏదని చూపిస్తాము.

"అమ్మ' మరి ఒక సందర్భంలో "మనస్సు లయమయ్యే చోటు ఆలయం" అని కూడా అన్నారు. ఎట్లా అవుతుంది? దేనిలో లయంకావాలి ? దక్షణాదిన ఆలయాల కట్టుబడి అంతా రాతి చెక్కడాలతో నిండినిబిడీకృతం అవుతాయి. నేను ఒకసారి కర్ణాటక దేశంలో బేలూరు ఆలయానికి వెళ్లాను. ఆలయం చూపించటానికి M.A Mathamatics చదివిన ఒక ఆయన గైడుగా వచ్చాడు. ఆ ఆలయ నిర్మాణం Maths లో ఏఏ జామెట్రికల్ థీరమ్స్ ఆధారంగా కట్టుబడి జరిగిందో విశదీకరించడం మొదలు పెట్టాడు. ఆ శిల్పసౌందర్యం కూడా చూస్తూ వుంటే సజీవ శిల్పాలను చెక్కిన వారి మనస్సు ఎట్లా లయం అయి ఆకృతులను దాల్చిన ఓ శరీరంలోని నరాలతో సహా అతి సహజంగా ఎట్లా చెక్కారో చూస్తూ వుంటే ఆశ్చర్యం అవుతుంది. ఆ ఆలయాన్ని చెక్కిన జక్కన లాంటి శిల్పుల శ్రమైక జీవన సౌందర్యాన్ని చూడటానికి నాకు ఆరుగంటలు పట్టింది. నాకు ఆహారం లేదు, ఆ గైడుకు కూడా లేదు. నాతో ఉన్న ఇంకా 10, 15 మందికి లేదు. ఆహారం తినాలని గానీ మంచినీరైనా త్రాగుదామనే ధ్యాసే లేదు. ఆ ఆలయం చూసే ధ్యాసే తప్ప. అందుకే అమ్మ అన్నారేమో "ధ్యాసే ధ్యానం" అని. ఇంతకీ ఆ ఆలయంలోని ఆరాధ్య దైవం ఎవరిదో నాకు సరిగ్గా జ్ఞాపకం లేదు ఆ ఆలయం తప్ప. అటువంటి ఆలయాలు తమిళనావాడులోను, కర్ణాటకలోనూ, అనేకం ఉన్నాయి.

ఒకసారి కర్నూలు జిల్లా శ్రీశైలం ప్రాజెక్టు ప్రారంభించేటప్పుడు శ్రీ ఎక్కిరాల వేదవ్యాస్ I.A.S స్పెషల్ కలెక్టరుగా వున్నారు. నేను, శ్రీ పొత్తూరు వెంకటేశ్వరరావు గారు కర్నూలు వెళ్లటం సంభవించింది. శ్రీ వేదవ్యాస్ ఇంట్లోనే బస చేసాము. వారి ఇంట్లో ఆ ప్రాజెక్టు క్రింద దాదాపు 50 గ్రామాలు పైగా మునిగి పోయే ప్రమాదం వుందని అవి ఖాళీ చేయడానికి ప్రయత్నాలు చేస్తూ వున్నామని చెప్పారు. ఆ గ్రామాలలో కొన్ని ఆలయాలు కట్టుబడి అయి ప్రతిష్ఠలు కాకుండా అనేకం వున్నవి. మునిగి పోయే ఆలయాలు Photo లు తీసి వారి ఆఫీసులో ఒక ఎగ్జిబిషన్ ఏర్పాటు చేసారు. ఇందులో ఏవైనా మీకు 'అమ్మ' ఆలయం కట్టుబడికి

పనికి వచ్చేవి వుంటే ఇస్తాము అని అన్నారు. నేను జిల్లెళ్ళమూడికి వెళ్లి 'అమ్మ' ను సంప్రదించగా అమ్మ గుంటూరువాస్తవ్యులు లాయరుగారైన శ్రీ గోవిందరాజుల దత్తుగారిని, నన్ను, శ్రీ సుందరరామిరెడ్డిగారి జీపులో ఆలయాలన్నీ స్వయంగా చూచి కావలసినవి మార్కు చేసి గవర్నమెంటు ఉత్తరవు మీద తీసుకుని రావడానికి ఏర్పాటు చేసారు. మేము వెళ్లి ఆ గ్రామాలన్నీ తిరిగి మాకు కావలసిన చెక్కడాలను సెలక్టు చేసుకుని, Photos తీయించుకుని జిల్లెళ్లమూడి వచ్చి 'అమ్మ' కు చూపాము. ఆ ఆలయాలు అనేక కొండల మీద కట్టుబడి చేసి ఉన్నవి. ఆ కొండల మీదకు శిల్పులు ఎట్లా వెళ్లారో, ఎట్లా తదేక దృష్టితో చెక్కారో ఆ రాళ్లు ఎట్లా మోసారో అర్థం కాలేదు. మేము వాటిని క్రిందకు దించాలంటే ఒక్కొక్క కట్టడాన్నే వేరు చేసి క్రేన్సు సహాయంతో దించవలసిందే, ఆ శిల్పాలను జిల్లెళ్లమూడి చేర్చడానికి అప్పుడే ఒక లక్షరూపాయలకు పైగా ఖర్చు అవుతుంది అని అంచనా వేసారు. ఆ శిల్పాలు చెక్కిన రాళ్లతో 'అమ్మ' ఆలయ నిర్మాణం చేసి వుంటే కొన్ని కోట్ల రూపాయల విలువగలిగిన దేవాలయం నిర్మాణం అయి వుండేది. కానీ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు పర్మిషను ఇచ్చినా Govt of India ఆర్కియలాజికల్ డిపార్టుమెంటువారు ప్రయివేటు పార్టీలకు ఇవ్వటానికి అనుమతి నిరాకరించారు. వారు అనుమతించినట్లు అయితే నేను పైన చెప్పిన విధంగా 'అమ్మ' ఆలయం కూడా శిల్ప సౌందర్యంతో విలసిల్లి వుండేది.

మనం ఆలయాలకు వెళ్లినప్పుడు ఆ ఆలయములలోని మూర్తిని చైతన్యవంతుని గానే చూడాలి. ఆలయాలలో సకలోపచారాలు జరిగేటప్పుడు అసలు మూర్తికి ప్రతిరూపంగా కాకుండా ఆ మూర్తిగానే భావించాలి. ఈ భావన భక్తులలోను ఆ ఆలయాల నిర్వాహకులలోనూ నిరంతరం వుండే లాగున ఆ భగవంతునే ప్రార్థింపక తప్పదు. కారణం ఆ స్ఫురణ వాడు ఇవ్వవలసిందే. ఆ ఆర్తికూడా మనకు కావాలి.

నాకు 9వ ఏట అనగా 1941 లో ఉపనయనం తిరుమలతిరుపతి వెంకటేశ్వరస్వామి సన్నిధిలో జరిగింది. అప్పుడు తిరుపతిలో ఒక్కటే సత్రం వుండేది. ఆ సత్రంలో వుండడం వంటచేసుకోవడం. తిరుమలకు అందరూ నడచి పోవలసిందే. ఆ ఏడు కొండలూ దాటుతూ నడుస్తూ నిరంతరం భక్తులందరూ గోవిందనామం చేస్తూ, ఆర్తిగా వెళ్తూ వుండేవాళ్లు. తిరుమలలో వెంకటేశ్వరదేవాలయం ఎదుటగా

వున్న వేయికాళ్ళ మండపంలోనే వెళ్లే వాళ్ళు అంతా సామానులు పెట్టుకోవటం, వంట చేసుకోవటం, పండుకోవడం, అన్నీ అక్కడే, స్నానాలు చేసి నిరంతరం గోవింద నామంతో వెంకటేశ్వరుని దర్శించేవాళ్లం. మరల నా వివాహం 1948లో తిరుపతిలో జరిగింది. అప్పుడు ఒకటే సత్రం. ఒక ఘాటు రోడ్డు దేవాలయ బస్సులు ఆ ఒక్క ఘాటు రోడ్డు మీద నుండీ వచ్చి పోతూ వుండేవి. అప్పటికి దేవాలయంలోనూ కార్యవర్గ నిర్వాహకులలోనూ తమిళుల ప్రభావం ఎక్కువగా వుండేది. నడచి పోయేవాళ్లలోనూ, బస్సులలోపోయె వాళ్లలోనూ ఆర్తి ఎక్కువగా వుండేది. కానీ రాను రానూ సౌకర్యాలు చాలా పెరిగిన తర్వాత పుణ్యక్షేత్రాలన్నీ టూరిస్టుప్లేసులుగా మిగిలి పోతున్నాయి. ఆ భగవంతుని చూడాలనే ఆర్తి అంతగా కనబడటం లేదు. మరి మనస్సు ఎక్కడ లయం చేసేటట్లు? లగ్నం చేసేటట్లు? ఆలయాలకు పోయే వాళ్లు వాళ్ళ వాళ్ళ ఈతి బాధలు, వారి వారి కోరికలు తీరటానికి భగవంతుణ్ణి ప్రార్థించటానికి పోయ్యే వాళ్లే అధికులు. తమ తమ మనస్సులు భగవంతునిలో లగ్నం చేద్దాం అనుకునే వాళ్లు తక్కువే. భగవంతునిలో మనసు లగ్నం చేద్దాం అని అనుకుంటే తాను వేరు భగవంతుడు వేరు అని అనుకోవాలి. మరి ఆ సర్వాంతర్యామి అయిన భగవంతునికి మనం భిన్నంగా వున్నామా? ఒకసారి ఒకసోదరి అడిగింది. 'అమ్మా' నీవు రాజరాజేశ్వరి అవతారం అటగా ? అని. 'అమ్మ' అన్నారు "మీరు కానిది ఏదీ నేను కాను" అని అంటే మనం అంతా అదే అన్నమాట. మరి మన మనస్సుకు ఆ స్ఫురణ వుండాలి కదా! ఆలయాలు మన ప్రతిబింబాలు చూచుకోటానికి అద్దం లాంటివి. ఆ అద్దాలలో మన మనోనేత్రాలతో చూస్తే మన మసలు ఎవరమో తెలుస్తుంది. అసలు చూడవలసినవాడు ఎదురుగా వుంటే మీరు కళ్లుమూసుకుంటారెందుకురా ? అనేది 'అమ్మ'. చూడవలసింది ఎవరినో తెలియక కళ్లుమూసుకోవటం. ఎవరో తెలిస్తే ఇక కళ్లు మాతలు పడవు. ఆ గుడిలో మనని మనమే చూచుకోవటమే ఈ ఆలయాల ఆంతర్యం.

(ప్రపంచం దర్పణం వంటిది. నీ ప్రతిబింబమే అందులో కనిపిస్తుంది.
ఆలివర్ గోల్డ్ స్మిత్) – అక్టోబర్, *2006*

# పుంసాం మోహన రూపాయ

అత్రి, అనసూయ పుత్రుడైన దత్తా త్రేయుడు తన దత్తత కారణంగా దత్తాత్రేయుడైనాడు. దత్తాత్రేయుడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వర్లుల అంశ కలవాడు. బ్రహ్మ, విష్ణువు మహేశ్వరులను అన్నదమ్ములంటారు. బ్రహ్మసృష్టికి, విష్ణువు పోషణకు మహేశ్వరుడు లయమునకు personification చేస్తే యిట్లా వేరువేరుగా కనపడతారు. కాని ముగ్గురూ ఒక శక్తి రూపాలే.

అమ్మ అన్నది "నేను మీ అందరిని కని మీ మీ తల్లులకు దత్తత యిచ్చాను" అని. అంటే మనమంతా దత్తులమే. అందుకే ఈ అనసూయకు పుత్రులమైనాము. ఒకసారి బ్రహ్మ. విష్ణు, మహేశ్వరులు అత్రి అనసూయ పాతివ్రత్యాన్ని పరీక్షించటానికి ముగ్గురు మహర్షుల వేషంలో అత్రి ఆశ్రమానికి వచ్చి అనసూయమాతను భోజనము పెట్టమని అడుగుతారు. ఆ అమ్మ దానికి ఒప్పుకొని మీరంతా స్నానము చేసిరండి భోజనం వడ్డిస్తానని చెప్పింది. అట్లాగే వారు స్నాన సంధ్యాదులు ముగించుకొని వచ్చి విస్తళ్ళముందు కూర్చున్నారు. కాని ఆమె వివస్త్రయై వడ్డిస్తేనే కాని భోజనము చేయమన్నారు. అప్పుడు వాళ్ళందరిని చిన్నచిన్న పిల్లలుగా చేసి వడ్డించింది అనే గాధ విన్నాము. సినిమాలలో కూడా ఈ దృశ్యము చూచాము. కాని ఈ అనసూయతల్లి తన సంతానమైన వయోవృద్ధులచే సహితము కొంతమంది చేత స్నానము చేయించుకున్న కొన్ని సంఘటనలు ఈ చరిత్రలో ఉన్నాయి. ఆ అదృష్టాన్ని నోచుకున్న వాళ్ళలో నేనొకడిని. అమ్మకు స్నానము చేయించేటప్పుడు మేము మగవాళ్ళమని కాని వయస్సుకలవారమని కాని స్ఫురణవుండేదేకాదు. చిన్న పిల్లల మనస్సు గలవారివలెనే, అతి నిర్మలమై ఎటువంటి వ్యాకులతలు లేకుండా వుండేది. అమ్మ అనేది "రాక్షసులను సంహరించటం కాదు రాక్షసత్వాన్ని సంహరించాలి" అని. చిన్న పిల్లలను చేయటం కాదు చిన్నపిల్లల మనస్తత్వాన్ని వారికి ప్రసాదించటమే ఈ తల్లి ప్రత్యేకత.

ఒక రోజున నేను బాపట్ల వెళ్ళుతున్నాను. బాపట్ల పోతూ అమ్మకు చెప్పి అమ్మతో బొట్టుపెట్టించుకొని పోవటం నాకు ఉన్న అలవాటు. ఆ అలవాటు చొప్పున అమ్మ గదికి వెళ్ళాను. అమ్మ స్నానం చేస్తున్నారని అమ్మకు స్నానము చేయించే ఆడవాళ్ళు చెప్పారు. నేను వాళ్ళతో నేను బాపట్ల వెళ్తున్నానని అమ్మకు

చెప్పమని కబురు చేసారు. అమ్మకు ఈ కబురు వారు అందించారు. అమ్మ నిన్ను లోపలికి రమ్మంటున్నారని వారు నాకు చెప్పారు. ఆడవాళ్ళు స్నానం చేస్తుంటే మొగవాళ్ళు ఎట్లా పోవటము అని లోపలికి వెళ్ళటానికి తటపటాయించాను. తలుపు బయట నిల్చున్నాను. అమ్మ సామాన్యంగా సమశీతోష్ణ జలాన్ని దాదాపు 2, 3 గంటలు నాలుగు, ఐదూ పెద్ద పెద్ద గంగాళాలు నలుగురు ఆడవాళ్ళు ఏకాదశ రుద్రాభిషేకం చేస్తున్నంతసేపు స్నానం చేయటం అమ్మకు అలవాటు. ఒక సోదరి ఒక తలుపుతీసి అమ్మ నిన్ను లోపలికి రమ్మంటున్నారని మళ్ళీ చెప్పింది. సరే మెల్లగా ఒక కాలు లోపలికి పెట్టాను. అమ్మ "ఏరా! లోపలికి రావటానికి నీకేమి వచ్చింది?" అని అడిగింది. ఆడవాళ్ళ స్నానం చేస్తుంటే లోపలికి రావటం ఎందుకులే అని బయట నిల్చున్నాను అని అన్నాను. "ఆహా! నీవు ఒక మహామగవాడివా?" అని కాలు మీద కాలు వేసుకొని తొడకొట్టి, మీసాలు మెలత్రిప్పి "ఎవడ్రా మొగవాడు? మొగవాడంటే నేనే. వీడొక్కడే మొగవాడు. మీరంతా ఆడవాళ్ళే. వీరంతా ఆడవాళ్ళే" అన్నది. అప్పుడు అమ్మ చూపిన హావభావాలు వర్ణింపనలవికాదు.

పురుషులను సైతము మోహింపచేసే పురుషుడు వాడు ఒక్కడే. పుంసాం మోహన రూపాయ పుణ్య శ్లోకాయ మంగళం. సృష్టి, స్థితి, లయకారిణి, పరాశక్తి అయిన అమ్మకు లింగభేదము లేదు. ఆమే స్త్రీ, ఆమే పురుషుడు.

– అక్టోబర్, 2006



# అసలైన కమ్యూనిజం అద్వైతమే

అణువునుండి, పరమాణువు నుండి, బ్రహ్మాండం వరకు చేతన, అచేతనాలలో చైతన్యం నిండి యున్నది. రాయిలోను, రప్పలోను, కప్పలోను, చెట్లులోను చైతన్యం వున్న విషయం సైన్సు కూడా ఋజువు చేసింది. అటువంటప్పుడు దేవాలయా లలో చెక్కిన విగ్రహాలకు, పసుపును ముద్దగా చేసి, కుంకుమపెట్టి, పూలుపెట్టి గౌరీగా గణపతిగా, ఏ కార్యక్రమమైనా ప్రారంభించేటప్పుడు పూజ చేసే ముందుగా ప్రాణప్రతిష్ఠ చేస్తున్నారు. అంటే దానిలో అదివరకు ప్రాణం లేదనా ? ప్రాణప్రతిష్ఠ వాళ్ళు చేస్తే గాని ప్రాణం రాదా ? ప్రాణం లేని దానికి వీళ్ళు ప్రాణం పోయగలరా? అదివరకే ప్రాణం వుంటే ఇంకా వీళ్ళు పోసేదేమిటి? అంటే అందులో అదివరకు ప్రాణం లేదనేది వీళ్ళ భావన అయివుండాలి. వీళ్ళు ప్రాణప్రతిష్ఠ చేస్తే గాని దానికి ప్రాణం రాదనేది వీళ్ళ భావన. అని ఒకసారి అమ్మ నాతో ప్రసంగవశాన చెప్పిన విషయం. హైమను అమ్మ జీవసమాధి చేసినపుడు, హైమకు ప్రాణం పోయిందని డాక్టర్లు, నిర్ణయించిన 24 గంటల తరువాత హైమ తలపైన అమ్మ మోపిన కాలి అడుగుభాగాన వున్న రక్తాన్ని అందరికి చూపించిన దృశ్యం అప్పుడక్కడున్న వారందరు చూచిన విషయమే. అంటే అదివరకు లేనిది అమ్మ క్రొత్తగా తేలేదు. వున్నదాన్నే, మనకు తెలియని దాన్నే మనకు తెలిసేటట్లుగా చూపించింది. అప్పుడే అమ్మ హైమకు నేను శక్తినిస్తున్నాను అని ప్రకటించింది. శక్తి అంతటా వుంటుంది. శక్తిలేనిది ఎక్కడా ఏదీ లేదు. కాని అమ్మ ఆ ప్రకటనలో చెప్పింది అంతటా వున్న శక్తి, ఇక్కడ నుండి మీకు ప్రకటితమవుతున్నదని. గాలి అంతటా వుంటుంది. మనకు కనబడుతుందా ? కాని మన శరీర స్పర్శలోను, చెట్ల ఆకులలో కదలిక నుండి మనకు ప్రకటితమవుతుంది. అట్లాగే ఈ సంఘటన కూడా. ఆకాశం గగనం శూన్యం అన్నారు. సూన్యం అంటే ఏదీ లేదని కాదు. అంతా ఆవరించి యున్నదని. ఒకసారి అమ్మ నాకు తన విశ్వరూప సందర్శనం సాక్షాత్కరింపచేసినపుడు నేను శూన్యంలో ప్రవేశించటం జరిగింది. అది అవాఙ్మానస గోచరము. దానిని వర్ణింప అలవికాదు. అంటే లేనిది నేను చూడటం కాదు. వున్నదాన్నే చూచాను. ఎట్లా ! మనసుతోనే అయి వుండాలి. అంటే నేను మనసు కంటే భిన్నంగా వున్నానా? ఆత్మకు భిన్నంగా ఏదీ లేదు. ఈ మనస్సు అందులోని భాగమే. మనస్సుకు వున్న శక్తి అటువంటిది. ఎండలో సూర్యరశ్మి వుంటుంది.

అది మనకు కాలదు. కాని భూతద్దం పెట్టి ఆ సూర్యరశ్మిని కేంద్రీకరిస్తే కాగితం కూడా తగులపడుతుంది. అంటే ఆ కేంద్రీకరణకు అంతశక్తివున్నదన్నమాట. అంటే మనస్సు కేంద్రీకరణకు అంత శక్తి వుంటుంది. నా దృష్టిలో ఆస్తికులు, నాస్తికులు ఒక్కటే అన్నది అమ్మ. ఉన్నదాన్నే వీళ్ళు వున్నదంటే వాళ్ళు లేదంటున్నారు. ఏది లేదు ? వున్నది లేదు. ఎందుకు లేదు ? వారికి కనపడటం లేదు కాబట్టి. ఎందుకు కనపడదు. అంతా అదే అయినపుడు ప్రత్యేకంగా ఎక్కడ కనబడుతుంది? అంతా అదిగా చూచినపుడే. నాకు అది తప్ప ఇంక ఏది కనపడటం లేదు నాన్నా! అన్నది అమ్మ. వచ్చిన చిక్కల్లా అంతా వాడే చేస్తున్నాడని అనుకున్నా ఫరవాలేదు. లేదా అంతా నేనే చేస్తున్నాననుకున్నా ఫరవాలేదు. కాని కొన్ని నేను చేస్తున్నాను. కొన్ని వాడు చేస్తున్నాడని అనుకున్నప్పుడే ఈ చిక్కు వచ్చేది. "అసలైన కమ్యూనిజం అద్వైతం" అన్నది అమ్మ.

ఒకసారి నేను అనంతపురం కలెక్షన్లకు వెళ్ళాను. అక్కడ జట్టి చలపతి ఆయన స్నేహితుడి దగ్గరకు తీసికెళ్ళాడు. అది ఒక కమ్యూనిష్టు యాజమాన్యము గల ప్రెస్. అక్కడ లెనిన్, స్టాలిన్ ఫోటోలు నడుమ అమ్మ ఫోటో ఉన్నది. అది చూచి ఆశ్చర్యపోయాను. ఆయన్ని నేను అడిగాను. లెనిన్, స్టాలిన్ ఫోటోల మధ్య అమ్మ ఫోటో పెట్టారేమి ? మీరు జిల్లెళ్ళమూడి వచ్చారా ? అని. ఆయన నేను జిల్లెళ్ళమూడి వచ్చాను. అమ్మతో చాలాసేపు సంభాషణలు జరిపాను. చివరకు నేను నిర్ణయించు కున్నది. అమ్మ కంటే కమ్యూనిష్టు ఎవ్వరూ లేరు. అమ్మే అసలైన ప్రాక్టికల్ కమ్యూనిష్టు. మేమంతా కమ్యూనిస్టులమని చెప్పుకునే వాళ్ళమే అని. ఇంతకీ ఆయన ఆస్తికుడా ? నాస్తికుడా ? వారి వారి భావాలని బట్టి వాళ్ళు పేర్లు పెట్టుకోవటమే. ఉన్నదంతా ఒకటే.

"జ్ఞానికి, అజ్ఞానికి, ఇచ్ఛా, అనిచ్ఛా పరేచ్ఛా ప్రారబ్ధాలు అన్నీ సమానంగానే వుంటాయి. అనుభవమూ అంతే. అయితే జ్ఞానికి మనం చేస్తున్నామనే తలపు వుండదు. కాబట్టి బంధం వుండదు. అజ్ఞానికి నేనే చేస్తున్నాననే తలంపు వుండటంతో బంధం ఏర్పడుతుంది. ఇదే తేడా. "మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః" అన్న గీతావాక్యాన్ననుసరించి అన్నింటికి మనస్సే కారణం. ఆ మనస్సుకు ఆలోచనలే రూపం. ఆ ఆలోచనలకు మూలం తెలుసుకుంటే బంధం వుండదు. ఆ మూలమే తాను. "తన్ను తాను తెలుసుకొని వుంటే ఎన్ని తలపులు వచ్చినా పోయినా తన్నేవీ బాధించవు". **భగవాన్‌రమణమహర్షి - డిసెంబర్, *2006***

# ప్రసారమైనదే ప్రసాదం

దేనికైనా భావన చాలా ముఖ్యం. అమ్మ అన్నది - ఒక రాయి పెట్టి కుంకుడుకాయలు కొట్టితే అది గుండ్రాయి అవుతుంది. అదే రాయిని ఆలయంలో పెట్టి అభిషేకాలు, పూజలు చేస్తే శివుడవుతుంది. ఒకేరాయిని అక్కడ గుండ్రాయిగా భావిస్తున్నాము. ఇక్కడ శివుడుగా భావిస్తున్నాము. ఇంతకీ అది రాయా ? శివుడా? దానిని మనము ఏదిగా భావిస్తే అదే అవుతున్నది. కనుక ఉన్నది మన భావనలోనే.

ఆలయాలలో నివేదన పెట్టేటప్పుడు ఏముంది ఆ దేముడికి చేతులు చూపించి మనం తింటమేగా అని చాలామంది అతి సామాన్యంగా అంటూ వుంటారు. కాని అమ్మ అంటుంది "ఆవేదనే నివేదన" అని ఏమిటా ఆవేదన? ఇది నీవు ఇచ్చిందే. ఇది నీకు పెట్టి మేము తింటున్నాము అని. అమ్మ అంది - ప్రసారం చేసిందే ప్రసాదమని" ఏం ప్రసారం చేసింది ? తన చూపు ప్రసారం చేసింది. అమ్మకు, నివేదన పెట్టినపుడు అన్నంతో సహా అన్ని పదార్థాలను ఒక ముద్దగా కలిపి అందరికీ ప్రసాదంగా పెట్టేది. అది సువాసనలు విరజిల్లుతూ ఎంతో రుచిగా వుండేది. ఈ రకంగా ప్రసాదం తిన్న వాళ్ళు అనేకులున్నారు. ఒక్కొక్కప్పుడు నివేదన తెస్తే అందులోనుండి మూడువ్రేళ్ళతో కొన్ని మెతుకులు తీసికొని నోట్లో వేసుకొని తీసికెళ్ళమనేది. ఒక్కొక్కప్పుడు ఒకసారి ఆ పదార్థాలన్నీ చూచి తాకకుండానే తీసికెళ్ళమనేది. ఇట్లా తాను ప్రసారం చేసిన దాన్ని మిగతా అన్ని పదార్థాలతో కలిపి ప్రసాదంగా స్వీకరిస్తాము. ఒక్కొక్కప్పుడు అన్నపూర్ణాలయంలో అన్నపురాశి దగ్గరకు వచ్చి, దానికి హారతులిచ్చి, ఇక వడ్డించమంటే ఆ రాశి తరిగేది కాదు. ఎంతమంది వచ్చినా తరుగు లేకుండానే వుండేది. ఊరుకే అన్నపూర్ణాలయంలో చింతకాయపచ్చడి, చారు, నీళ్ళమజ్జిగతో తిన్నా ఇంట్లోకంటే నాలుగురెట్లు అన్నం ఎక్కువగా తినేవాళ్ళు. ఆ రుచే వేరు. కారణం ఆ ప్రసాదంలో వున్న విలువ అటువంటిది. ఇప్పటికీ ఆ ప్రభావం ఆభావం వున్నవారికి ఉంటునే వున్నది. ఒకసారి 1973లో అమ్మ స్వర్ణోత్సవాలలో లక్షమందికి ఒక పంక్తితో కూర్చుని భోజనాలు చేసే ఏర్పాట్లు చేసినపుడు ఉదయం 11 గంటలకు చూస్తే పందిళ్ళు ఖాళీగా ఉన్నాయి. లక్షమందికి చేసిన భోజనాలు మిగిలిపోతాయేమోనని

భయపడ్డాను. 12 గంటలకు చూస్తే పందిళ్ళన్నీ నిండి ఇంకా జనం బయట చాలా మంది వున్నారు. అప్పుడు భయం వేసింది. చేసిన ఏర్పాట్లు చాలకపోతే అభాసు అవుతుందేమోనని. అమ్మతో నా భయాన్ని వ్యక్తం చేసాను. అమ్మ అన్నది "అయితే ఇప్పుడు ఏం చేస్తావు ?" అని ప్రశ్నించింది. బాపట్ల వెళ్ళి బియ్యం రైసు మిల్లు నుండి లారీలో అర్జంటుగా తెస్తానన్నాను. ఎప్పుడు బాపట్ల వెళ్తావు ? "ఎప్పుడు బియ్యం తెస్తావు ? వంట చేసి ఎప్పుడు పెడ్తావు ? ఏమీ అక్కరలేదు. నేను స్నానం చేసి వస్తున్నాను. అన్ని పందిళ్ళలో రడీగా వుండమని చెప్పమన్నది. అందరికీ కబురు చేసాము. అమ్మ వచ్చింది అన్నిపందిళ్ళలోను అన్నం రాసులకు పదార్థాలను కర్పూరహారతులు ఇచ్చి అమ్మకు నివేదన చేసి వడ్డనలు మొదలు పెట్టారు. అంతే అమ్మ 60 ఎకరాల పందిళ్ళలో ఒక్కొసారిగా భోజనాలు చేసే లక్షలాది తన బిడ్డలను చూచి తృప్తిపొంది ఆనందించిన అమ్మ ముఖవర్చస్సు చెప్పనలవికాదు.

లక్షమందికి చేసిన పదార్థాలు లక్షా 50 వేలమందికి దాకా వచ్చి ఇంకా మిగిలిన పదార్థాలను, నీళ్ళలోను, చేలలోను చిమ్మించి అన్ని జీవరాసులకు కూడా ఆ ప్రసాదంతో విందు చేసింది.

ఇప్పుడు జిల్లెళ్ళమూడిలోని ఆలయాలలో మహానివేదన యిస్తూన్నప్పుడు గంటలు, జేగంటలు, డ్రమ్ములు ఒక్కసారిగా మ్రోగుతాయి. అంటే అమ్మకు నివేదన జరుగుతున్నదన్న మాట. అప్పుడు ఆవరణలోని వారంతా ఎవరక్కడున్నా నేను పైన ఉదహరించిన విధానాలలో ఏ విధానముగానైనా సరే అమ్మ నివేదన తీసికుంటున్నదని భావిస్తే ఆ ప్రసాదం యొక్క విలువ పెరుగుతుంది. ఇది యాంత్రికంగా వుండకూడదు. మన మనస్సుకు భావనకు అంత శక్తి వుంటుంది. అందుకే అమ్మను "భావనామాత్ర సంతుష్ట" అంటారు గదా!

అమ్మ మీనాక్షి కదా. మీనాక్షి అంటే మీనములవంటి కన్నులు కలది అనికాదు. చేపలు తన పిల్లలకు తమ కళ్ళతోనే ఆహారాన్ని అందిస్తాయట. అందుకే అమ్మ తన చూపులతోనే మనలని సంతృప్తి పరుస్తుంది. అమ్మ మనలను చూచే ఆ ఒక్క క్షణమైనా చాలు. మనకు అన్ని అమరినట్లే. **– జనవరి, *2007***

# గొల్లెల కాపరి

అమ్మ స్వర్ణోత్సవమైన తర్వాత 1974లో వివిధ కేంద్రాలలో నున్న తన తనయులను చూడటానికి అనంత వాత్సల్యయాత్ర ప్రారంభించింది. అప్పుడే విజయవాడ విచ్చేసింది. విజయవాడలో అమ్మ దర్శనానికి ఏర్పాట్లు చేయబడ్డవి. అమ్మను చూడటానికి లక్షమందికి పైగా వచ్చారు. అమ్మ ఉపాన్యాసాలివ్వదు. భజన సంకీర్తనాదులు చెయ్యదు. మిరకల్సు లాంటివి ప్రదర్శించదు. కాని అమ్మ దర్శనానికే, లక్షకు పైగా రావటం విశేషం. ఆ దర్శనం ఒక అరగంటలోపు వుంటుంది. ఆ స్టేజీమీద ఆ చివరి నుండి ఈ చివరకు, ఈ చివర నుండి ఆ చివరకు మూడుసార్లు తిరిగింది. ఈ లక్షమందిని పరికించి చూచింది. ఆ ప్రదేశమంతా నిశ్శబ్దమే రాజ్యమేలింది. pindrop silence అంటారే అది అక్షర సత్యమైంది. ఆ భయంకరమైన నిశ్శబ్దాన్ని మేమే ఛేదించవలసి వచ్చింది. అమ్మపై నదీరా రాసిన పాటలను నదీరా బృందము వారే పాడారు.

మరుసటి రోజు పత్రికా విలేఖర్ల గోష్ఠికి రమ్మనమని నేను వెళ్ళి ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి, విశాలాంధ్ర, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ మొదలగు వాటి ఎడిటర్లను ఆహ్వానించాను. అందులో కొంతమంది అమ్మ ఏమీ మాట్లాడరు, మా వాళ్లు అసలే కోతులు. వాళ్ళ యిష్టమొచ్చినట్లుగా అనేక ప్రశ్నలు వేస్తారు. ఎందుకు అనవసరంగా యివన్ని తెచ్చి పెట్టుకుంటారు, అని అన్నారు. దానికే మిమ్ములను రమ్మంటున్నాను. అమ్మ మాట్లాడతారు. ఏ సబ్జక్టుమీదనైనా సరే. కాని అనవసరంగా మాట్లాడరు. అమ్మ ఏమీ మాట్లాడరు అనే అవగాహనే తప్పు. ఇది మీకు తెలియటానికే మిమ్ములను రమ్మంటున్నాను" అని అన్నాను. అమ్మతో పత్రికావిలేఖర్ల సమావేశము ప్రారంభమైనది. విలేఖర్లు ఎవరికి తోచిన ప్రశ్నలను వారు అమ్మపై సంధించారు. వివిధ అంశాల మీద. అమ్మ అందరికీ తగిన సమాధానాలు యిచ్చారు. అన్ని పత్రికలలో పతాక శీర్షికలతో సమాచారం అందించారు. అందులో ఒక పత్రిక "మంచిని మించిన మహిమలేదు" అనే శీర్షికతో సమాచారం అందించారు. అట్లాగే అమ్మ మద్రాసు వెళ్ళినప్పుడు మద్రాసులో కూడా హేమమాలినీ కళ్యాణ మండపములో లక్షలలో అమ్మ దర్శనం చేసుకున్నారు. యింకా అనేక ప్రాంతాలలో కూడా అమ్మ దర్శనానికి ఏర్పాట్లు చేయబడ్డవి. అన్ని చోట్ల నిశ్శబ్ద వాతావరణంలోనే

అమ్మ దర్శనాలు జరిగినవి. God speaks in silence అన్నట్లుగా అమ్మ తన సందేశాన్ని వారికి ఇచ్చిందేమో.

అక్కడ కూడా పత్రికా విలేఖర్ల గోష్ఠి జరిగింది. ఆ గోష్ఠిలో, తమిళులు తమిళంలోనే అమ్మతో మాట్లాడారు. కన్నడులు కన్నడంలోను, మళయాళీలు మళయాలయంలోను, ఇంగ్లీషు మాట్లాడేవారు ఇంగ్లీషులోను, తెలుగు వారు తెలుగులోను అమ్మతో వివిధ అంశాల మీద మాట్లాడారు. కాని అమ్మ మాత్రం అందరికి తెలుగులోనే సమాధానాలు ఇచ్చారు. ఆ గోష్ఠిలో పాల్గొన్న డాక్టర్ శ్రీ పాదగోపాలకృష్ణమూర్తిగారికి ఆందోళన కలిగింది. వాళ్ళు వివిధ భాషలలో మాట్లాడుతుంటే అమ్మకు తెలుస్తున్నదో లేదో, అమ్మ తెలుగులో యిచ్చే సమాధానం వారికి అర్థం అవుతున్నదో లేదో అని, వారికి ఇంగ్లీషులో తర్జుమా చేయబోయారు. దానికి వారందరు అభ్యంతరం పెట్టారు. "మీరు మెదలకుండా కూర్చోండి. మేము అడిగేవి అమ్మకు అర్థమౌతున్నవి. అమ్మ చెప్పేవి మాకు తెలుస్తున్నవి" అని అన్నారు. ఆ సందర్భంలోనే అమ్మను అడిగారు. "అమ్మా ! నీవు 5వ తరగతి మాత్రమే చదువుకున్నావు. కాని ఈ భాషలన్నీ నీకు ఎట్లా తెలుసు. నీవు మాట్లాడటం వారందరికీ ఎట్లా అర్థమౌతున్నద"ని. అందుకు అమ్మ అన్నారు "అవతలి వారి మనస్సు ఇవతలి వారికి తెల్సినపుడు ఈ భాషలు అడ్డురావు. Language is only a media to express our feelings when we understand their mind" అని. కావచ్చు.

ఒక రోజున జిల్లెళ్ళమూడికి ఒక సోదరుడు వచ్చి అమ్మ దర్శనం చేసుకొని "అమ్మా ! నీవు విజయవాడలో దర్శనం యిచ్చినపుడు నేను నిన్ను మొదటిసారిగా చూశానమ్మా" అని అన్నాడు. అమ్మ అంది "నాన్నా! నీవు ఆ దర్శనసమయంలో వెనుక నిల్చున్న వారిలో ఎర్రచొక్కా వేసుకొని, నీ స్నేహితులమీద అటూ ఇటూ చేతులు వేసి నన్ను నీవు చూస్తున్నపుడు నిన్ను నేను చూశాను" ఆ మాట నిజమే. ఆ రోజు తాను ఎర్రచొక్కా వేసుకొని వచ్చిన మాట జ్ఞాపకం వచ్చింది. కాని లక్షల మందిలో నన్నెక్కడ చూశావు. అప్పుడు చూచిన నన్ను ఇప్పటిదాకా ఎలా జ్ఞాపకం పెట్టుకున్నావు అని ఆశ్చర్యపోయాడు. "గొల్లెలకాపరికి" తన గొర్రెలు జ్ఞాపకం వుండవూ, ఇదీ అంతే. అంది అమ్మ. – ఫిబ్రవరి, ***2007***

# దారి జూపెడు దివ్యజ్యోతివి

నేను ఒకసారి గుంటూరు నుండి వస్తున్నాను. జిల్లెళ్ళమూడి నడచి పోవటానికి అప్పికట్ల గుళ్ళవద్ద బస్సు దిగి మట్టిపూడి, పూండ్ల మీదుగా అడ్డదోవన జిల్లెళ్ళమూడి వెళ్ళుతున్నాను. అది ఎండాకాలము రాత్రి 9 గంటలవుతుంది. పూండ్ల దాటిన తరువాత జిల్లెళ్ళమూడి వెళ్ళటానికి ఒక మురుగు కాల్వ అడ్డం వచ్చింది. ఆ కాలువ వడ్డున అన్ని ముండ్లు, పుట్టలు, గుట్టలు, కాలువ చాలా లోతుగా వున్నది. దిగటానికి ప్రయత్నం చేసాను. వీలు పడలేదు. అక్కడ నుండి దారి కనపడటం లేదు. తిరిగి మళ్ళీ వెళ్దామన్నా అదే పరిస్థితి. మరి ఏం చేయాలో తోచలేదు. అక్కడ ఒక ఎత్తయిన గుట్ట కనపడింది. అది ఎక్కాను. ఇంతకి అది ఒక పాము పుట్ట. దానిమీదకు ఎక్కింతర్వాతగాని తెలియలేదు. ఇక భయం పుట్టింది. ఏం చేయాలో తెలియని పరిస్థితిలో అమ్మా అని పెద్దగా కేకపెట్టాను. ఆ పుట్ట రెండవ వైపు నుండి, ఒక్క తడవున దిగాను. క్రిందకు వచ్చి పది అడుగులు వేసి నిల్చున్నాను. ఎదురుగా తెల్లని బాట కనపడుతుంది. ఆ బాటనే అడుగులు వేసాను. ఆ బాట ఆ కాలువ పైన నున్న ఎక్విడెక్ట్ దగ్గరకు తీసి కెళ్ళింది. ఎక్విడెక్ట్ అంటే క్రింద మురుగు కాలువ ప్రవహిస్తుంటే పైన అడ్డంగా పంటకాలువ ప్రవహించటానికి సిమెంట్ కాలువ కడతారు. ఆ కాలువ దగ్గరకు చేరాను. అది ఎండాకాలం కావటం వలన కాలువలో నీళ్ళు లేవు. ఆ కాలువలో దిగి మురుగు కాల్వ దాటాను. అవతలి ఒడ్డున వున్న గట్టుమీద కెక్కి జిల్లెళ్లమూడి చేరాను. అమ్మ ! జిల్లెళ్లమూడి చేరానని స్వస్థత చిక్కింది. వాత్సల్యాలయానికి దక్షిణవైపువున్న అరు బయట అమ్మ పచార్లు చేస్తుంది. వెళ్ళి అమ్మ పాదపద్మాలకు నమస్కారం చేసాను. అమ్మ అన్నది "నాన్నా ! దారి కనపడ్డదా? అని" ఎందుకు కనపడదు. ఆ కేక సాంద్రత అటువంటిది. అమ్మ ఎక్కడున్నా, ఏం చేస్తున్నా వినపడవలసిందే. అదే భగవంతుడుకి, భక్తుడికి వున్న బంధం. మరి తల్లీ కొడుకులకు ఆ బంధం ఎందుకుండదు ? ఆ నిశీధి సమయంలో ఆ కాళరాత్రిలో ఆ పుట్టలో వున్న పాము కాటు వేస్తే పరిస్థితి ఎట్లా వుండేదో ఆలోచిస్తే భయంగానే వుంటుంది. మరి అమ్మ దారిచూపక ఏం చేస్తుంది.

– మార్చి, 2007

# అమ్మ పెట్టిన గోరుముద్దలు

"నీ మాతృవాత్సల్య సంపూరితంబైన
నీ పట్టెదన్నంబు సంతృప్తికరము"
నీ సన్నిధానంబు ఆనందకరము. -రాజు

అవి డా॥ పన్నాల రాధాకృష్ణ శర్మగారు అప్పికట్ల హైస్కూలులో సీనియర్ తెలుగు పండిట్‌గా పనిచేస్తున్న రోజులు. రాధాకృష్ణ, రామకృష్ణ, గోపాలకృష్ణ కృష్ణత్రయంగా అమ్మతో గారాబంగా పిలువబడుతూ అమ్మ ఒడిలో మా జీవితాలను గోముగా వెళ్ళబుచ్చిన రోజులు. ఆ రోజులను తల్చుకుంటే ఒళ్లు జలదరిస్తుంది. సమాధిస్థితియే ఏర్పడుతుందేమో. అమ్మ మా కిచ్చిన అనుభూతులు, ఆనందం మాటలతో చెప్పేవికావు. మరల అది తిరిగిరాదు. తను ఇచ్చిన ఈ తనువులు తనలో కలిసేదాకా జ్ఞాపకాలతో కాలం వెళ్ళబుచ్చవలసిందే.

ఒకరోజు రాధాకృష్ణశర్మగారు, నేను సాయంత్రం అప్పికట్లలో బయలుదేరి జిల్లెళ్ళమూడికి చేరాము. అమ్మ పూరింట్లోనే వుంటూన్న విషయం మరల నేను ప్రస్తావించవలసిన పనిలేదు. ఇద్దరం వచ్చి బావి దగ్గర కాళ్లు కడుక్కొని అమ్మ దగ్గరకు వెళ్ళాము. అమ్మ-నాన్నా ! అన్నం తిన్నారా - అని అడిగింది. అప్పుడు సాయంత్రం దాదాపు 6 గంటలు దాటి వుంటుంది. తిన్నామని చెప్పాము. ఒకసారి అన్నపూర్ణాలయం దగ్గరకు వెళ్దామా అన్నది. సరేనని ముగ్గురము అన్నపూర్ణాలయానికి నడిచాము. అప్పుడు అన్నపూర్ణాలయంపై అంతస్తులేదు. డాబాగా మాత్రమే వున్నది. డాబా మీదకు వెళ్ళి అమ్మతో మాట్లాడుతూ కూర్చున్నాము. అప్పుడు అన్నపూర్ణాలయంలో లక్ష్మీనరసమ్మ గారు వంటచేస్తూ వున్న రోజులు. అమ్మ అన్నపూర్ణాలయం పైకి వచ్చింది కాబట్టి ఆమె వచ్చి అమ్మ పాదాలకు నమస్కారం చేసింది. 'లక్ష్మీ నరసమ్మా! అన్నం వున్నదా?' అని అమ్మ అడిగింది. వున్నదని చెప్పింది. అయితే ఒక పళ్ళెంలో అన్నం పెట్టి చింతకాయపచ్చడి వేసి, నేయి వుంటే తీసికొనిరా అన్నది. ఆమె తీసికొచ్చింది. ఆ తెచ్చిన అన్నంలో చింతకాయ పచ్చడి వేసి నేయి కలిపి అన్నం ముద్దలు చేసింది. ఇక ఒక్కొక్క ముద్ద అమ్మ మాకు పెట్టటం. మేము తినటం పళ్లెమన్నం అయిపోయింది. ఇంకో పళ్ళెంలో అన్నం తీసికొని ఆవకాయతో రమ్మన్నది. ఆ పళ్లెదన్నం కూడా మాటలలోనే

మాయిద్దరి మధ్య మాయమైంది అమ్మ గోరు ముద్దలతో. ఇప్పటికి రెండు పళ్ళాల అన్నం తిన్నామన్న మాట. లక్ష్మీనరసమ్మగారు అట్లాగే చూస్తూ నిలుచున్నది. అమ్మ ఇంకో పళ్ళెంలో అన్నం, మజ్జిగా తెమ్మన్నది. తెచ్చింది. ఈసారి మజ్జిగన్నం కలిపింది. సగం పళ్ళెం మళ్ళీ మేమే తిన్నాం. అమ్మ ఒక ముద్ద లక్ష్మీనరసమ్మ అక్కయ్యకు ప్రసాదంగా పెట్టింది. ఆవరణలో అందరిని పిలవమంది. అందరికి ప్రసాదంగా తలా ఒక ముద్ద పెట్టింది. ఇంకా అందులో మిగిలేఉన్నది. ఇంకా ఇక్కడకు రానివాళ్ళుంటే వాళ్ళందరికి ప్రసాదం పెట్టమన్నది. అంత అన్నం మేం తినాలంటే మేం తినగలమా ? మరి అన్ని పళ్ళాల అన్నం ఏమైనట్లు ?

ఇది మరపురాని, మరువలేని ఒక సన్నివేశం. అమ్మ పెట్టిన ఆ గోరుముద్దల రుచి ఇప్పుడు తల్చుకుంటే గుటకలు వేయటం మాత్రమే మిగులుతుంది.

- ఏప్రియల్, ***2007***



# లలితాకోటి నామపారాయణ

జిల్లెళ్లమూడిలో శ్రీ అనసూయేశ్వర, హైమాలయాలలో సోమవారము, శుక్రవారంలలో శ్రీ లలితా లక్షనామపారాయణ జరుగుతూ వుంటుంది. ఒకసారి మన సోదరీ, సోదరుల అభ్యర్థన మేరకు శ్రీ లలితాకోటి నామపారాయణ చేయడానికి అమ్మ అనుమతినిచ్చింది. ఈ పారాయణకు వివిధ కేంద్రాల నుండి లలితా సహస్రనామపారాయణ చేసే సామూహిక బృందాలను ఆహ్వానించాము. ఆహ్వానితులకు కావలసిన వసతి, ఉపాహారము, మజ్జిగ, కాఫీ, భోజన సదుపాయాలు ఏర్పాట్లు చేశాము. వివిధ ప్రదేశాలనుండి వచ్చే పారాయణ కర్తలు కాకుండా ఆవరణలో వున్న సోదరీ, సోదరులు, విద్యార్థినీ, విద్యార్థులు ఈ పారాయణలో ఉదయం 7 గంటల నుండి పాల్గొన్నారు. అమ్మ వాత్సల్యాలయం దక్షిణ భాగాన గల ఆరుబయటమంచంమీద కూర్చున్నారు. నేను అమ్మ మంచం ప్రక్కనే కూర్చున్నాను. అమ్మ "ఏం నాన్నా! నీవు పారాయణకు పోలేదేమీ" అని నన్నడిగింది. 'అమ్మా నాకు లలిత నోరు తిరగదు. చదివితే అన్నీ తప్పులే వస్తాయి. లలితా సహస్రనామము తప్పులు చదివితే నెత్తి అణుస్తుంది అంటారు. నేను ఆ తప్పులు చదవటమెందుకు? నాకు నెత్తి అణచట మెందుకు? నాకు దానిమీద పెద్దగా శ్రద్ధలేదు. నాకు నీ దగ్గర కూర్చోవటంలోనే హాయివున్నది. నన్నిట్లా కూర్చోనీ' అని అన్నాను. అమ్మ అన్నది" నాన్నా తప్పులు చదివితే నెత్తి అణిస్తుందని ఎవరు అన్నారు? ఒక వేళ అట్లా నెత్తి అణిస్తే ఆమె తల్లే కాదు. తల్లి ఎప్పుడూ పిల్లవాడు ఏదో విధంగా మాట్లాడితే చాలు. వాడు వ్యాకరణయుక్తంగా మాట్లాడు తున్నాడా అనిచూడదు. వాడు ఏమి మాట్లాడినా అమ్మకు ఆనందమే. వాడికి మాటలు వచ్చినందుకే సంతోషపడుతుంది. అందుకని నీవు వెళ్ళి, నీకు వచ్చినంత వరకు పారాయణ చేయి. అందరికి 15, 20 నిమిషాలు పడితే నీకు ఒక అరగంట పడుతుంది. పట్టనీ. ఇప్పుడు మునిగిపోయింది ఏమున్నది. నీవు చెప్పినట్లుగా నీవు తప్పులు చదివితే నీ నెత్తి అణిస్తే నేను చూచుకుంటాను. నీ వీలును బట్టి నీకు వీలైనన్ని చదివిరా" అని చనువుగా చెప్పింది. కాని నేను కదలలేదు. ఇంతలో ఒక సోదరి వచ్చి అమ్మ దగ్గర కూర్చుంది. అమ్మ "ఇంకేం ఎవరు లేరని కూర్చున్నట్లున్నావు. అమ్మాయి వచ్చిందిగా నీవు పోయిరా" అని నన్ను పంపింది. ఆరోజు సాయంత్రం 7 గంటలదాకా పారాయణ జరిగి 1 కోటి 40 లక్షలు పూర్తి అయింది. అందులో 4 నావి వున్నాయి. అప్పటి నుండి అక్కడ జరిగే లలితా లక్షనామపారాయణలతో లలితా కోటి నామపారాయణలలో పాల్గొంటూనే ఉన్నాను.

– ***మే, 2007***

# హనుమంతుడు

ఇప్పుడు నామ సంకీర్తన జరుగుతున్న ఒక్కొప్పటి పూరింటిలో అమ్మ వున్న రోజులు. ఒక రోజున చిలకలూరిపేట నుండి అమ్మ భక్తులైన ఒక కుటుంబంవారు వచ్చారు. వారి అమ్మాయి ఒక విచిత్రమైన సంఘటనతో తన జీవితం పెనవేసుకోవటం గురించి వారి హృదయ విదారకమైన ఆవేదనను, ఆందోళనను వెలిబుచ్చారు. అమ్మ – వారిని వివరాలడిగారు. ఆ అమ్మాయికి 14, 15 సంవత్సరా లుంటాయి. ప్రతిరోజూ రాత్రిపూట పడుకున్నది పడుకున్నట్లుగా ఎక్కడకో పరిగెత్తడం గమనించారు. ఆ అమ్మాయి తోటలు, దొడ్లు వీధులు వాడలు పరిగెత్తుతుండేది. తెల్లవారు ఝామున వచ్చి పడుకుండేది. ఆ అమ్మాయిని ఎందుకిట్లా పరిగెత్తుతున్నా వని అడిగితే తనను రోజూ హనుమంతుడు వచ్చి తీసికొని వెళ్తాడని చెట్లు, చేమలు, తోటలు అన్నీ త్రిప్పి పండ్లు తను తిన్నన్ని తినిపిస్తున్నాడని ఒక్కొక్కప్పుడు కొండలు, గుట్టలు మీదకు కూడా తీసికెళ్తాడని చెప్పింది. ఏ క్షణంలో ఏం జరుగు తుందోనని ఆ అమ్మాయి తల్లిదండ్రులు తమ ఆందోళనను వెళ్ళబుచ్చి, భయము వేసి, ఇతర మార్గాలు వాళ్ళకు తోచక భూత పిశాచాల మీద వాళ్ళకు నమ్మకము లేక అమ్మ తప్ప వారిని రక్షించేవారు లేరని నమ్మకంతో జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను ఆశ్రయించారు. అమ్మ ఆ అమ్మాయిని ఆ హనుమంతుని గూర్చి, రోజు జరిగే విశేషాలు గూర్చి వివరాలడిగేరు. "అమ్మా ! నీవు హనుమంతుడిని చూస్తున్నావా? ఎట్లావున్నాడు. నీతో మాట్లాడుతున్నాడా? నిన్నెట్లా చూచుకుంటున్నాడు? నీకు భయము కలుగలేదా ?" అని అమ్మ అడిగారు. తనకు భయమ కలగలేదని, ఎంతో ఆనందం వేసిందని ఆ అమ్మాయి సమాధానం చెప్పింది. మరి యింకేమి, హనుమంతుడే వచ్చి అమ్మాయిని చూచుకుంటుంటే మీ కెందుకు భయం అని ఆ అమ్మాయి తల్లిదండ్రులను అమ్మ అడిగింది. వయస్సు వచ్చిన అమ్మాయి తెలియకుండా అట్లాపరిగెత్తుతుంటే ఎట్లాగని. ఈ ఆపదనుండి రక్షించమని అమ్మకు మ్రొక్కారు. అమ్మ మీకు భయంలేదులే, ఇక నేను చూచుకుంటానని ఆ అమ్మాయిని అమ్మ మంచం ప్రక్కనే పడుకోపెట్టుకుండేది. ఆ హనుమంతు డొస్తే నేను చూస్తాను అని చెప్పింది. అట్లా ఒకవారం రోజులు వారు అమ్మ దగ్గరే గడిపారు. ఇక ఫర్వాలేదు. ఇక ధైర్యం వుంటే మీరు తీసికొని పోవచ్చు అన్నది. అమ్మ మీద

వారికున్న విశ్వాసంతో అమ్మ చేత బొట్టు పెట్టించుకుని ప్రసాదం తీసికొని అమ్మ దగ్గర సెలవు తీసికొని వారు చిలకలూరిపేట తిరిగి వెళ్ళారు. తర్వాత ఆ అమ్మాయికి పెండ్లి అయి కులాసాగా ఉన్నట్లు తెలిపారు. ఈ సంఘటన నాకు చాలా ఆశ్చర్యం కలిగించింది. అంతకంటే ఆశ్చర్యం తర్వాత రిలీజు అయిన ముత్యాలముగ్గు సినిమాలో యీ ఉదంతం చోటుచేసుకోవటం. – జూన్, *2007*





# అమ్మకు తెలియని రసగుల్లా

మన్రిపూడి నివాసి, బాపట్ల మున్సిపల్ హైస్కూలులో హిందీ మాస్టరుగా పనిచేసిన శ్రీ మల్లాది వెంకటకృష్ణయ్య మాస్టరు గారు అమ్మ పూరింట్లో వున్న రోజులలో అమ్మ దర్శనం కోసం వచ్చారు. అమ్మ మన్రిపూడిలో జరిగిన దత్తజయంతి ఉత్సవాలలో వారు పొందిన ఆనందం గూర్చి నెమరువేసుకున్నారు. ఆ రోజులలో దత్త జయంతి ఉత్సవాలకు అమ్మ కూడా వెళ్ళేది. అమ్మతో అనేక విషయాల మీద సంభాషణలుకూడా చేశారు. అన్నపూర్ణా లయంలో భోజనము చేసివచ్చి అమ్మ దగ్గర బొట్టు పెట్టించుకొని, అమ్మతో ఉత్తరదేశంలో ఒక స్వీటు ఎక్కువగా చేస్తారని, అది చాలా రుచిగా వుంటుందని, దానిని రసగుల్లా అంటారని, అది మీకుతెలియదని, మీరు దాని పేరే విని ఉండరని అమ్మతో ఆ స్వీటును గురించి మరీ మరీ చెప్పి అమ్మ దగ్గర సెలవు తీసికొని వెనుతిరిగి అమ్మను చూస్తూ వరండా దాకా వెళ్ళారు. ఇంతలో ఒక సోదరుడు హైదరాబాదు నుండి వచ్చి ఒక డబ్బా అమ్మ చేతిలో పెట్టి పాదాలకు నమస్కరించి అమ్మ మంచం ప్రక్క కూర్చున్నాడు. అమ్మ నాన్నా! అని ఆ వెంకట కృష్ణయ్య మాష్టరు గారిని వెనుకకు పిలచి ఆ డబ్బా ఆయన చేతికిచ్చి ఇది ప్రసాదంగా తీసికెళ్ళమని చెప్పింది. ఆ డబ్బాను నిశితంగా చూచాడు. అది రసగుల్లా. ఇంక ఆయన ఆశ్చర్యానికి, ఆనందానికి అవధులు లేకుండా పోయింది. హా! రసగుల్లా, ఓ ! రసగుల్లా అంటూ ఆ డబ్బా పట్టుకొని ఎగరటం ప్రారంభించాడు. అమ్మ నాన్నా ! నాకు తెలియని రసగుల్లా ఇదేనా ? అని అడిగింది. అమ్మ పాదాలకు నమస్కరించాడు. నీకు తలియందేమున్నదమ్మా అంటూ ఈ డబ్బాలో నున్న రసగుల్లా ఇక్కడ అందరికి పెట్టవలసిందిగా అర్థించాడు. ఆ ప్రసాదం ఆయనతో పాటు అందరికి పెట్టి అందరిని ఆశ్చర్య పరిచింది.

– జులై, 2007



# గుప్పెడు బియ్యం

జిల్లెళ్ళమూడిలో 1957-58లలో అమ్మ దగ్గరకు వస్తున్న వారిని గుప్పెడు బియ్యం చొప్పున వసూలు చేసి వారానికొకసారి తీసికొని రమ్మనమని చెప్పేదట అమ్మ. వారు అట్లా తెచ్చిన బియ్యంతో ఇప్పుడు అనసూయేశ్వరాలయముగా విరాజిల్లుతున్న ఆలయానికి అమ్మ పునాదులు వేశారుట.

1958 సంవత్సరంలో ఆగష్టు 15న అన్నపూర్ణాలయ మును ప్రత్యేకంగా స్థాపించినపుడు కూడా అమ్మ ఇక్కడ వచ్చే వారందరు తమ తమ ఇండ్లలో ఎసరు పోసేటప్పుడు గుప్పెడి బియ్యం తీసి విడిగా పెట్టి ఇక్కడకు తీసికొని రండి అని చెప్పేవారుట. అట్లా చాలామంది గుప్పెడుబియ్యం చొప్పున వసూలు చేసిన బియ్యంతో అన్నపూర్ణాలయం స్థాపింపబడింది. బాపట్లలో తహశీల్‌దారుగా పనిచేసిన పమిడిపాటి వీరయ్య చౌదరి గారి భార్య ఇంటింటికి వెళ్ళి పిడికెడుబియ్యం చొప్పున వసూలు చేసి తెచ్చి అన్నపూర్ణాలయ నిర్వహణకు ఇచ్చేవారుట. జిల్లెళ్ళమూడికి వచ్చే మన సోదరులు హరిదాసుగారు (శ్రీరాముల వెంకటేశ్వర్లు) యింటింటికి వెళ్ళి ధనుర్మాసంలో ఆయన సంపాదించుకున్న బియ్యాన్ని అన్నపూర్ణాలయ నిర్వహణకు యిచ్చే వారుట. వారి శ్రీమతి కృష్ణవేణమ్మ అక్కయ్య కూడా యిక్కడే వుంటూ, యిక్కడే తింటూ ఇక్కడే అమ్మ సేవలో వారు చేయ కలిగిన పనులు చేసుకుంటూ అందరింటిలో భాగస్వామ్యు లైనారు. ఆ కాలంలో సంక్రాంతి పండుగరోజులు వస్తే హరిదాసుల కోసం ఎదురుచూసేవారు. పిల్లలుపోటీపడి వారికి బియ్యం సమర్పించటం, వాటిని స్వీకరిస్తూ కృష్ణార్పణం, అనో భగవదార్పితం అనో అంటున్నప్పుడు వారి ఆధ్యాత్మిక విలువలు స్ఫురింపచేసేవి.

అమ్మ వినూత్న రీతిలో ప్రవేశపెట్టిన ఈ గుప్పెడు బియ్యం పథకం యొక్క అంతరార్థం ఏమిటి ? అని నాకు నేను ప్రశ్నించుకుంటే నాకు తోచిన విశ్లేషణ, ప్రతివానికి హృదయం వాని వాని గుప్పెడంత పరిమాణంలో వుంటుందిట. తనకు జీవం యిస్తున్న హృదయంతో ఇంకొకరికి తన సహాయ సహకారం అందించటమే, దీని పరమార్థమేమో ! అమ్మ ఆలయ నిర్మాణము, అన్నపూర్ణాలయం స్థాపించటంలో ఈ వినూత్న శైలి అవలంబించటంలో ప్రతివాని హృదయస్పందన వారికి అందిన రీతిలో ఇది నాది అనే స్ఫురణ వుండాలనేదే దీని ఆంతర్యం

కావచ్చు. ఒకసారి గుంటూరు నుండి ఒక జమీందారు, సుమతి అనే ఒక సోదరి వచ్చి అమ్మ ఆలయ నిర్మాణానకి అయ్యే ఖర్చు తామే భరిస్తామని అమ్మకు చెప్పినపుడు ఈ ఆలయం అందరిది కావాలి. కాని ఏ ఒక్కరికో సొంతం కాకూడదు అని అన్నానని అమ్మే నాకు చెప్పింది. అమ్మ స్వర్ణోత్సవాల సందర్భంలో ఎవరైనా వారికి ఇద్దామని వుండి ఆర్థిక స్థోమత లేకపోతే మీరేవారికి రూ.2/- యిచ్చి వారి దగ్గర ఒక రూపాయి తీసుకోండి అని చెప్పింది. అంటే వారి హృదయార్పణ, హృదయస్పందన ముఖ్యమన్నమాట. హృదయ మంటే దాని పరిమాణం గుప్పెడు అందుకే సాంకేతికంగా అమ్మ గుప్పెడు బియ్యం స్కీమ్ ప్రవేశపెట్టింది. నేను మా సోదరుడు రామకృష్ణ అప్పికట్లలో ఎస్.ఎస్.ఎల్.సి. 1950లో చదువు తున్నప్పుడు మా యిద్దరకి విడివిడిగా ఒకేరకమైన కలవచ్చింది. అదేమిటంటే అప్పికట్లలో మా తూర్పు పొలాలలో పెద్ద తాటాకు పందిర్లు వేసికొని ఊరి వారంతా కలిసి ఒకే చోట వంటలు చేసుకుంటూ ఒకేచోట కూర్చుని ఊరిలో ఏ వివక్షతా లేకుండా అందరు కలసి భోజనాలు చేయటం, అందరు కలసి పనులు చేసికోవటం. ఈ కలలను గూర్చి మేమిద్దరము ఎంతో ఆశ్చర్యంగా చెప్పుకునేవాళ్ళం. కాని అమ్మ తన ఇంటికి 'అందరిల్లు' అని పేరు పెట్టి 1973లో లక్షమందకి పైగా ఒకే పంక్తిని బువ్వపెట్టిన అమ్మ చర్యను గమనిస్తే "ఆస్తిని సంఘపరంగా ఉంచి ప్రతి వ్యక్తి తన చేతనైనంత కృషిచేస్తూ తన కవసరమైనంత మాత్రం తీసికోవటం - కమ్యూనిజం - సామ్యవాదం' అంటారు. అందుకేనేమో అనంతపురంలో ఒక కమ్యూనిస్టు సోదరుడు అమ్మ కంటే అసలైన, సిసలైన (ప్రాక్టీకల్) కమ్యూనిస్టు మరియొకరు లేరు అన్నాడు. 1984లో మా అనంతపురం పర్యటనలలో నేను జెట్టి చలపతి వారి ప్రెస్‌కు వెళ్ళి ఆయనతో కలిసినపుడు అన్నమాట అది. మరి అమ్మయేమో "అసలైన కమ్యూనిస్టు అద్వైతే" అని అన్నది కదా!

సామ్యవాద, సర్వసహోదరత్వ, ఆధ్యాత్మిక, త్రివేణీ సంగమమే అమ్మ పెట్టిన గుప్పెడు బియ్యపు పథకం.

– ఆగష్టు, 2007



# బ్రాహ్మణుడు

ప్రతి శ్రావణపూర్ణిమకు అమ్మ చేత ఆవరణలో అందరు జందాలు వేయించుకొనేవారు. అమ్మ పూరింట్లో వుండే రోజులవి. జందెం వేయించుకొందామనుకునే వారందరు స్నానాలు చేసి, అమ్మవరండాలో కుర్చీలో కూర్చొని వుంటే వరుసగా వెళ్ళి ఒక్కొక్కరు జందెం వేయించుకొనేవారు. అందరు వెళ్ళి జందెం వేయించుకుంటుంటే శ్రీ యార్లగడ్డ రాఘవయ్యగారు దూరంగా నిల్చుని వున్నారు. యార్లగడ్డ రాఘవయ్యగారు సింగుపాలెం నివాసి, అంధుడు, కవి. అమ్మ మీద అనేక పాటలు, బుఱ్ఱకథ వ్రాసారు. కులానికి కమ్మవారు ఒకసారి నవరాత్రులలో అమ్మ దర్శనం యిచ్చేటప్పుడు ఆ దర్శన భాగ్యం తనకు కూడా కల్పించవలసినదిగా అమ్మను కోరాడు. అమ్మ దర్శనం ప్రసాదించింది. తాను కన్న దర్శనం ఎట్లావున్నదో తనదైన కవితలో అప్పుడే అందరికీ విన్పించాడు. అట్టి రాఘవయ్యగారిని ఏం నాన్నా ! దూరంగా నిల్చున్నావేమి రా దగ్గరకు రా జందెం వేయించుకో అన్నది అమ్మ. అందుకు ఆయన అమ్మా నేను దానికి నోచుకోలేదు. దానికి అనర్హుడను. రాలేను అన్నారు. అమ్మ దేనికి? అన్నది. నేను బ్రాహ్మణుడను కాను అన్నాడు. అమ్మ ఎవడురా నీకంటే బ్రాహ్మణుడు. రా నీకు జందెం వేస్తానన్నది. దానికి ఆయన మనసు అంగీకరింపక అట్లాగే నిలుచున్నాడు. అమ్మే ఆయన దగ్గరకు వెళ్ళి జందెం వేసి ఆశీర్వదించింది. ఇక్కడ అందరూ బ్రాహ్మణులే. బ్రాహ్మణులు కాని వారెవ్వరు ఇక్కడ లేరు అన్నది అమ్మ. అట్లానే గాయత్రీయాగం అప్పుడు యాగంలో పాల్గొనాలనే ఇచ్ఛగల వారందరికి కుల, మత,స్త్రీ, పురుష వివక్షత లేకుండా గాయిత్రిమంత్రం ఉపదేశం చేసి జందేలు వేసి వారి మనోవాంఛ తీర్చింది.

–సెప్టెంబర్, ***2007***



# అమ్మ ఒడిలో ఆనందడోలికలు

అవి అమ్మ పూరింట్లో వుంటున్న రోజులు. అడవుల దీవి నుండి మధువాళ్ళు వారికి వేరుశనగ కాయలు పంట చేతికి రాగానే అమ్మకు పంపటము, క్రొత్త బియ్యం రాగానే అటుకులు డబ్బాలలో మోసుకొచ్చి అమ్మకు నివేదన పెట్టటం, మామిడికాయలు రాగానే ఆవకాయ అమ్మకు పంపటం వాటిని జిల్లెళ్ళమూడిలో అన్నపూర్ణాలయంలో వినియోగించటం ఒక పరిపాటి. ఇట్లాగే ఒకసారి వేరుశనగకాయలు తెచ్చారు. వాటిని వేయించి అమ్మకు పెట్టారు. అమ్మ పూరింట్లో వెనుక గదిలో మంచంపై కూర్చున్నది. అమ్మ చుట్టు మేమంతా మూగాము. అమ్మ ఒక న్యూస్ పేపరును మంచం మీద వేసికొని వేరుశనగ కాయలను ఒక్కొక్క కాయను కొట్టి ఆ వేరుశెనగ పప్పులను తాను ఒకటి రెండు తింటూ మాకందరికి నోటికి అందిస్తున్నది. అమ్మ ఆనందంతో అనేక కబుర్లు చెప్తూ జోక్సు వేస్తూ మమ్ములను ఆనందడోలికలలో ఊగిస్తూ వున్న సమయంలో ఆ న్యూస్‌పేపరు వంక తీవ్రంగా చూస్తూ “ఓరి పిచ్చిముండా నీవు కూడా ఇక్కడ వున్నావా ? అని అంటూ వేరుశనగ కాయలు కొట్టి ఆ పప్పులను ఆ న్యూస్ పేపరు ఫోటోలో వున్నవారికి నోట్లో పెట్టున్నట్లుగానే పెట్టింది. ఇంతకీ ఆ ఫోటోలోని వారు ఎవరా ? అని చూస్తే వారు రమణమహర్షి, నేను ఆశ్చర్యపోయాను. రమణమహర్షికి కూడా మాకు నోట్లో వేరు శనగపప్పు పెట్టినట్లుగానే అంత ఆప్యాయతతో, అనురాగంతో, ఆనందంతో పెట్టటం చూసి. ఒక ఫోటో చూస్తున్నట్లుగా నాకు లేదు. రమణమహర్షికి గోరుముద్దలు పెడ్తున్నట్లుగా, వేరుశెనగపప్పు నోట్లో పెట్టుతున్నది. ఆ సమయంలో అమ్మ చూపిన హావభావాలు వాత్సల్యం చెప్పనలవికాదు. వ్రాయటం అసలే వీలుపడలేదు. అయినప్పటికి వ్రాస్తున్నాను. కారణం విశ్వజనని అయిన అమ్మ సన్నిధిలో ఆ ఒడిలో మేము పొందిన ఆనందములో మహర్షికూడా ఒకడై యున్నారనే. **– అక్టోబర్, 2007**

# తోచిందేదో చేయి - తోపించేది వాడేగా

అది సెప్టెంబరు 30 రాత్రి గం. 12.00 నుండి 1.00ల మధ్య నిద్రపట్టలేదు. మనస్సుకు ఒక ఆలోచన తట్టింది. అమ్మ స్వర్ణోత్సవమైన తర్వాత 1974లో చాలామంది సోదరీసోదరులు ఇక్కడకు రాలేని వారికి అమ్మ దర్శనం చేయించాలని కుతూహలముతో అమ్మకు తమ కోరికను విన్నవించారు. అమ్మ అంగీకరించింది. దానిలోని భాగంగానే ఎక్కడకు వెళ్ళినా అమ్మ అనాధశరణాలయాలను అంధుల ఆదరణాలయలనూ, మానసిక శారీరక వికలాంగుల శరణాలయాలను, వీధిబాలల శరణాలయాలను, యాచకుల గృహాలను, కుష్టురోగుల ఆస్పత్రులను, బాలల జైళ్లను అమ్మ సందర్శించారు. వారికి అమ్మ ప్రేమను, ప్రసాదాలను పంచి పెట్టారు. అట్లాగే జిల్లెళ్లమూడిలో కూడా వయోవృద్ధుల వికలాంగుల అనాధల ఆశ్రమాన్ని – ఆదరణాలయం అనే పేరుతో స్థాపించాలని అమ్మ చాలా కుతూహల పడ్డారు. ఇప్పటికీ ఆ ప్రాజెక్టును ఆచరణలోకి తీసుకొని రావాలని మేనేజ్‌మెంట్ వారికి ఆలోచనలు వున్నవి. దానికి కావలసిన వనరులు ఏర్పడవలసి యున్నది. అమ్మ దీనిని ఎప్పుడు కార్యరూపంలో చేయనున్నదో వేచి చూడవలసి ఉంది.

ఈ ఆలోచన నేపథ్యంలో మనం వీటిని స్థాపించలేక పోయినా ఇతరులు స్థాపించిన కొన్ని ఆశ్రమాలకైనా వెళ్ళి అన్నపూర్ణాలయ స్వర్ణోత్సవ సంవత్సరంలో అమ్మ అన్నవితరణ ప్రసాదాన్ని 50 సెంటర్స్‌లో అమ్మ ఆశీర్వాదముతో అందిస్తే బాగుంటుందని నాకు తోచింది. ఇవి నాకు జ్ఞాపకం ఉంటవో లేవో అని, అప్పటికప్పుడే లేచి ఒక చిత్తు కాగితం మీద కొన్ని వ్రాశాను. ఈ ప్రతిపాదనను కార్యవర్గ సమావేశములో ప్రతిపాదించాలని నా ఉద్దేశ్యం.

తెల్లవారుఝామున నాకు ఒక విచిత్రమైన కల వచ్చింది. ఒక హైవే ఉందట. ఆరోడ్డు ప్రక్కనే ఒక పెద్ద రావిచెట్టు ఉన్నది. దాని చుట్టూ అరుగు కట్టబడి వున్నది. ఆ చెట్టు ఒక ప్రక్క ఇల్లు వుంది. ఆ ఇంటి బయట అమ్మ నిల్చొని ఉంది. నేను సైకిల్ మీద ఆ దారినే పోతూ అమ్మను చూశాను. ఏమిటి అమ్మ ఇక్కడ నిల్చున్నది ? అనుకుంటూ. సైకిల్ దిగి ఆ చెట్టుకు ఇంకొక ప్రక్కన సైకిల్ పెడుతుండగా కొంతమంది అమ్మ దర్శనార్థం రావటం వలన వారితో

అమ్మ లోపలకు వెళ్ళింది. ఈ సైకిల్ పెట్టిన వైపు ఒక చిన్న ఇంటిలో వసుంధర అక్కయ్య బైటికి వచ్చి కాసిన మంచినీళ్ళు త్రాగిపో అన్నది. సరే లోపలకు వెళ్ళి మంచి నీళ్ళు త్రాగి బయటకు వచ్చేటప్పటికి అమ్మ దర్శనార్థం పోయిన వారందరూ వెళ్ళిపోయారు. నేను వంటరిగానే ఆ ఇంటిలోకి వెళ్లగా అమ్మ ఒక నవారుమంచం మీద పడుకొని వున్నది. అమ్మ దగ్గరకు లోపలకు వెళ్లి అమ్మ పాదాల వద్ద కూర్చోని నమస్కారం చేశాను. ఇట్లా చూస్తే ఆశ్చర్యంగా అమ్మపాదాలు కాళ్ల నుండి విడిగా - కట్ చేసిన విధంగా - ఉన్నది. అట్లాగే అమ్మ పాదాలకు తల ఆన్చి నమస్కారము చేస్తున్నప్పుడు కాళ్లు కదిలాయి. ఇట్లా చూస్తే రెండు పాదాల మడుములు నవ్వారులో ఇరుక్కుని వున్నాయి. వాటిని నేను రెండు చేతులతో క్రింద నుండి పైకి లేపాను. అమ్మ లేచి మంచం మీద కూర్చుంటున్నట్లున్నది. అమ్మ పాదాలను నేను చేతితో పట్టుకొని కాళ్లతో పాటు క్రింద పెట్టాను. ఆ పాదాలు విడిగా ఉన్నట్లు నాకు కనబడివా అవి అమ్మ కాళ్లతో పాటే ఉన్నాయి. అమ్మ మంచం మీద కూర్చున్నది. రెండు చేతులు చాపింది. నేను అమ్మ మంచం కింద కాళ్ల ప్రక్కగా కూర్చొని అమ్మ ఒడిలో పడుకున్నాను. అమ్మ నాతలతో పాటు నన్ను నిమురుతున్నాది. అట్లా నిమురుతూ "నాన్నా" ఆ అయిదే (5) కాదు ఆరింట్లో (6) చేయించు ఆ అయిదేమిటో అర్థంకాలేదు. ఆరేమిటో అసలే అర్థం కాలేదు. సరే అమ్మా! అయిదేమిటి (5) నా కర్థం కాలేదన్నాను. అంతే మెలకువ వచ్చింది. ఇట్లా చూస్తే నేను గుంటూరులో మా లక్ష్మీప్రసాదు వాళ్లింట్లో గదిలో మంచం మీద ఉన్నాను. అమ్మ ఫోటో కాలెండరు మాత్రం గోడకు ఉన్నది. నన్ను చూస్తూ. టైంచూస్తే ఉదయం 6 గంటలైంది. ఇంకొక గంట గంటన్నరలో జిల్లెళ్లమూడి వెళ్లడానికి అన్నంరాజు మురళి పి.యస్.ఆర్. కారులో వస్తారు. అందుకు వెంటనే లేచి రెడీ అయిపోయాను. కానీ అమ్మ చెప్పిన అయిదేమిటో, ఆరేమిటో అసలు అంతుపట్టలేదు. మనస్సంతా దానిమీదనే ఉన్నది. అమ్మ ఒడి వెచ్చన నన్ను వదలలేదు.

కారులో జిల్లెళ్లమూడి వెళ్తున్నాము. ఒక్కసారి మనస్సుకు ఆలోచన తట్టింది. వెంటనే నా సంచిలో వున్న నేను రాత్రి వ్రాసిన కాగితం చూశాను. అందులో 1) అంధుల శరణాలయం 2) ఓల్డేజి హోమ్ 3) అనాధశరణాలయం 4) మానసిక, శారీరక వికలాంగుల శరణాలయం 5) వీధి బాలల ఆశ్రమం అని ఒక గ్రూపుగా వ్రాసియున్నది. వాటి క్రింద - కుష్టు రోగుల ఆస్పత్రి, బెగ్గర్ హోమ్స్ అని విడిగా

క్రింద వాశాను. తర్వాత జ్ఞాపకం రావటం వలన. చాలా ఆశ్చర్యం. అమ్మ చెప్పిన ఆరవది ఇదా ! అనిపించింది. నిజమే **"తోచిందేదో చేయి – తోపించేది వాడేగా"** అన్న అమ్మ వాక్యం ప్రతీకగా నిల్చింది.

ఇక అమ్మ పాదాలు కాళ్ళ నుండి విడిగా వేరుగా కనపడటం దేనికి ? అనే సమస్య మనస్సును వేధిస్తూనే వున్నది. జిల్లెళ్ళమూడిలో ఇంటికి చేరాను సమస్య పరిష్కారమైంది.

ఏమిటా విషయం అంటే అమ్మ పాదుకలు వాత్యల్యాలయంలో భద్రపరచాము. వెళ్లినవారు, అమ్మవాడిన పాదుకలను అర్చించుకుంటున్నారు. కానీ కొత్తవారు అమ్మ పాదాలను చూచి ఉండరు. వాటిని అందరికీ చూపించాలనీ తహతహలాడుతో ఆ పాదాల వరకు వున్న ఫోటోలను వాత్సల్యాలయంలో ముఖద్వారం పైనా, అలంకార హైమ ఆలయంలో అమ్మ నామం చేసే చోట ఆ యింటి ముఖద్వారం పైన అమర్చాను. ఇవి అమర్చినపుడు అమ్మ పాదాలు – కట్ చేసినట్లు – వుంటయ్యేమో ! అని అనిపించింది. ఇపుడు అమ్మ తేల్చింది ఏమిటంటే – అమ్మ తోనే వున్నాయని. వాటిని అర్చిస్తే అమ్మను అర్చించినట్లే. అందుకుగాను అమ్మ పూర్వము వున్న పూరింట్లో, అమ్మ దర్శన భాగ్యం కలిగే చోట, అమ్మ మంచం దగ్గర, అమ్మ పాదాల ఫోటో గ్లాసు పెట్టెలో పెట్టి అమ్మ మంచం మీద కూర్చొని పాదాలు పెట్టిన విధంగానే ఈ నవరాత్రులలో మూలా నక్షత్రం రోజున ఆవిష్కరణ చేశాము. అమ్మ పాదాల వ్రేళ్లన్నింటికి బంగారు విగ్రహాలు చెక్కిన మెట్టెలు అమర్చి వుండేవి. అవి మహాలక్ష్మి, సరస్వతి, అన్నపూర్ణ, కుమారస్వామి, గణపతి, నాగపడిగలు మెట్టెలు కలసి యుండేవి. ఒకసారి నెల్లూరు నుండి వచ్చిన ఒక సోదరుడు అమ్మను అడిగాడు – అమ్మా! కాళ్లకు ఆ విగ్రహాలు ఎందుకు పెట్టుకున్నారు అని ? అమ్మ అన్నది – "పిల్లలను దగ్గర పెట్టుకున్నాను" అని అట్లా పెట్టుకోకపోతే దగ్గరలేనట్లా ? అని మళ్లీ ప్రశ్నించారు. అమ్మ అన్నది వీళ్ల కూడా మీ సోదరులే అని చెప్పటం కోసం" అని.

అటువంటి అమ్మ పదసేవలో వున్న మనం అమ్మ చెప్పిన అయిదే కాదు, ఆరు ఆయా శరణాలయాలలో వున్న మన సోదరులకు ఈ అన్నపూర్ణాలయ స్వర్ణోత్సవ సంవత్సర శుభవేళలో అమ్మ ప్రసాదాన్ని అందించటానికి మీమీ ప్రదేశాలలో కూడా ప్రయత్నించండి.

**– నవంబర్, 2007**

# అమ్మ సందేశ వ్యాప్తి

అది 1967 సంవత్సరం. కాకినాడలో మాతృశ్రీ స్టడీ సర్కిల్ మొదటిసారిగా ప్రారంభించాలని కోరికతో కాకినాడ వెల్యాము. కాకినాడలో అప్పుడు సోదరులు కొమరవోలు గోపాలరావు గారు పనిచేస్తూ వుండేవారు. వారితో పాటు గాత్రం కోటేశ్వరరావు గారు చోడిశెట్టినాగయ్య నాయుడు గారు, వీరభద్రరావుగారు, రామదాసుగారు మొదలగు వారి ఆసరాతో షమ్మ మీద వారికున్న భక్తిశ్రద్ధలతో అమ్మ సందేశవ్యాప్తికి చేసిన కృషికి గాను మాతృశ్రీ స్టడీసర్కిల్ ఏర్పరచబడింది. ప్రతివారం గాత్రం కోటేశ్వరరావు గారింట్లో అమ్మ పూజ యధావిధిగా జరుగుతుండేది. అప్పుడున్న సోదరులు వారి వారికి వున్న అనుభవాలను కూడా ముచ్చటించుకుంటూ వుండేవారు.

ఆ సందర్భంలో కాకినాడలోని ప్రజలకు అమ్మను గూర్చి అమ్మ సందేశమును విస్తృతంగా తెలియచేయాలని ఒక సమావేశాన్ని ఏర్పాటు చేయాలని అభిలషించి దివ్యజ్ఞాన సమాజము వారి హాలులో ఉపన్యాస వేదికగా ఏర్పాటు చేయటం జరిగింది. కాకినాడలో అప్పట్లో జిల్లెళ్ళమూడికి వచ్చేవారు 15, 20 మంది మాత్రమే వుండేవారు. ఎక్కువ ప్రజానీకానికి అమ్మ సందేశవ్యాప్తి చేయాలంటే ఎట్లా ? అమ్మను తెలియపర్చాలంటే ఎట్లా ? అని అనుకుంటూ వుండగా ఒకరు ఒక సలహా ఇచ్చారు. కాకినాడలో శ్రీ భాష్యం అప్పలాచార్యులుగారని ఉభయభాషా పండితులు, ఉపన్యాసచక్రవర్తి వున్నారని వారు ఎక్కువగా భగవద్గీత ఉపన్యాసాలు చేస్తూ వుంటారని వారి ఉపన్యాసానికి 200 నుండి 300 వరకు తగ్గకుండా శ్రోతలు వస్తు వుంటారని వారిని పిలిస్తే కొన్ని వందలమంది వచ్చే అవకాశం వున్నదని చెప్పారు. సరే వెంటనే వారిని కలసి అప్పటికి ప్రచురింపబడిన 'అమ్మ అమ్మ వాక్యాలు', అమ్మతో సంభాషణలు మొదలగు పుస్తకాలను తీసికెళ్ళి అమ్మ ఫోటో ప్రసాదంతో సహా వారికిచ్చి మాకున్న సమస్యను వారికి విన్నవించి ఈ సభకు విచ్చేసి ప్రసంగించవలసినదిగా కోరాము. ఈ సభకు సర్వశ్రీ మొసలికంటి తిరుమలరావు గారు, శ్రీపాదగోపాలకృష్ణమూర్తి గారు, వీర మాచినేని ప్రసాద్‌గారు, ఎక్కిరాల భరద్వాజగారు కూడా వచ్చి ప్రసంగిస్తారని కూడా తెలియపర్చాము.

దానికి వారు ఆమోదము తెలిపారు. కాకినాడ టౌనులో ఈ కార్యక్రమాన్ని గూర్చి మైకులో ఎక్కువగా ప్రచారం చేయించాము.

దివ్యజ్ఞాన సమాజము వారి హాలులో సభకు కావలసిన ఏర్పాట్లు పూర్తిచేసికొన్నాము. సభ ప్రారంభింపబడింది. శ్రీ మొసలికంటి తిరుమలరావుగారిని (ఎమ్.పి.మాజీ గవర్నర్) గూర్చి తెలియని వారు లేరు. ఆయన అధ్యక్షులుగా సభ ప్రారంభింపబడి అధ్యక్షోపన్యాసము జరుగుతున్నప్పుడు 20, 30 మంది కంటే ఎక్కువ జనం లేరు. ఒక్కొక్కరు రావటం ప్రారంభించారు. ఉపన్యాసకులు డాక్టర్ శ్రీ పాదగోపాల కృష్ణమూర్తి గారు, మాస్టర్ ఎక్కిరాల భరద్వాజ వారివారి శైలిలో అమ్మను గూర్చి ఉపన్యసించారు. అప్పటికి ఆ హాలు నిండి హాలు బయట జనం ఎక్కువగా నిల్చున్నారు. స్పీకర్సు బయటకు అందరికి వినపడేటట్లుగా ఏర్పాటు చేయవలసి వచ్చింది. సభ నిండుగా వున్నది. చివరకు శ్రీ అప్పలాచార్యుల వారు ఉపన్యసించటానికి లేచారు. సభలో అందరూ హర్షధ్వానాలు చేసేరు. ఆయన ఉపన్యాసము మొదలు పెట్టారు. ఆ ఉపన్యాసంలో తను ఇంతవరకు జిల్లెళ్ళమూడిగూర్చి వినలేదని, అమ్మను చూడలేదని ప్రసంగం మొదలు పెట్టారు. నాకు చాలా నీరసం వచ్చింది. ఏమి చెప్పుతారో అనే భయం. తాను జిల్లెళ్ళమూడికి పోకపోయినప్పటికి, అమ్మను స్వయంగా చూడనప్పటికి అమ్మను తాను దర్శించానని చెప్పారు. ఎట్లా ? అని అంటారేమో తాను అనేక భగవద్గీత ఉపన్యాసాలు చేస్తుంటే వందల, వేలమంది సభలకు విచ్చేసి ఆనందిస్తున్నారని, మరి తాను కృష్ణుడిని చూచానా ? మరి తాను ద్వారకకుగాని, బృందావనానికి గాని వెళ్ళానా ? వెళ్ళకపోయినా కృష్ణుని దర్శించాను. భగవద్గీత సారాన్ని ఎలా వెదజల్లుతున్నానో మీరు ఎలా ప్రభావితులు అవుతున్నారో అలాగే అమ్మను దర్శించానని ఉద్వేగంగా వెల్లడించారు. అక్కడి నుండి భగవద్గీత కంటె కూడా అమ్మ వాక్యాలు ఎట్లా విశిష్టంగా వున్నవో సోదాహరణంగా వెల్లడించారు. దాదాపు ఒకటిన్నర గంటలు అనర్గళంగా మాట్లాడి శ్రోతలను ఆనంద డోలికలలో ఓలలాడించారు. నా సంతోషానికి పగ్గాలు లేవు. సభానంతరం వారికి మేము కృతజ్ఞతలు తెల్పి ఒక కోరిక కోరాను. వారు ఆ రోజు యిచ్చిన ఉపన్యాసాన్ని పుస్తక రూపంగా వ్రాసి ఇవ్వమని. ఆ కోర్కెను వారు మన్నించారు. కాని వారికి వ్రాసే అలవాటులేదని ఎవరన్నావ్రాసుకుంటే చెప్తానన్నారు. అక్కడ నరసింగరావుగారని మన సోదరులు

ఆ కాలేజీలోనే లెక్చరర్‌గా పనిచేస్తున్నారు. వారు దానిని గ్రంథస్థం చేయటానికి ఒప్పుకున్నారు. ఆచార్యుల వారి దగ్గరకు 5, 6 సార్లు వెళ్ళారుట. వీరికి తీరిక దొరకలేదుట. వారికి తీరిక దొరికినప్పుడు వీరికి తీరికలేదుట. మొత్తానికి వెరశి ఆ గ్రంథం నేను అనుకున్నట్లుగా వెలుగుచూడలేదు.

1967, 1968లలో భరద్వాజ వ్రాసిన ఇంగ్లీషు పుస్తకాలు, Life and Teachings of Mother, Voice of Mother, Glimpses of Mother, Matrusri Monthly English editions లో వ్రాసిన అమ్మ వాక్యాలతో ప్రభావితుడైన అమెరికన్ సోదరుడు వెస్టర లెందు తనను ఆధ్యాత్మికంగా ప్రభావితుడిని చేసిన వారు 1) Matrusri Anasuya Devi of Jillellamudi 2) Anandamayi Ma of Banaras 3) Jesus Christ అని అమెరికాలో Christ Truth Foundation Director గా వుంటూ క్రిష్టియన్ మిషన్‌కు బైబిల్ ప్రచారకుడుగా వుంటూ వ్రాసిన ఆయన అభిప్రాయాలు కూడా మనకు శిరోధార్యము. అమ్మ వాక్యాలను నిశింతంగా అధ్యయనం చేసిన వారికి అసలైన సత్యం బోధపడుతుంది. తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడు కాదు దైవము తలిస్తేనే ....

– డిసెంబర్, 2007



# ఇక్కడ పొందిన ఆనందం

అది కుమారస్వామి మందిరంగా పిలిచేటువంటి అమ్మ నివసించే పూరింటికి దక్షిణపు వైపున అమ్మ దర్శనాలకు, ఇక్కడకు వచ్చే సోదరీ సోదరులు తమ తమ సామాన్లు పెట్టుకొని పడుకోవడం, కూర్చోవడం, సేదతీర్చుకోవడానికి ఉపయోగపడ్డ మందిరం. అక్కడ అనేకసార్లు నవరాత్రులలో కూడా అమ్మ వివిధ అవతారమూర్తులుగా దర్శనమిచ్చిన మందిరం అదే. అక్కడ 1963లో మా సోదరుడు కొండముది రామకృష్ణ ప్రాణలకు హాని కలుగవచ్చును అనే సూచన మేరకు అమ్మ పాదాలే శివస్వరూపంగా భావిస్తున్న మీ సోదరుడు రామకృష్ణ చేత మహాన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకం మొదటిసారిగా చేయించటం ప్రారంభింపబడింది.దానికి బాపట్ల నుండి వచ్చిన పండు ముదుసలి, వేదవేదాంగ పారాయణుడు అయిన రామలింగేశ్వర సోమయాజిగారి చేత మంత్రోచ్చారణ చేయబడింది. ఈ అభిషేకం మొదలు పెట్టిన దగ్గర నుండి ఆ మందిరంలో ప్రత్యకమైన ఎత్తయిన డయాస్‌పై అమర్చిన ఆసనం ప్రక్కనే క్రిందుగా చేతులు ముడుచుకొని నేను నిల్చుని, ఆ మంత్రాన్ని ఆ మూలాగ్రం అవలికిస్తున్నాను. ఆ మంత్రం యొక్క అర్థం ఏమిటో నాకు తెలియక పోయినప్పటికి, ఎందుకో ఆ మంత్రాలు నన్ను ఆకర్షించినై. ఆ అభిషేకం పూర్తి అయ్యేటప్పటికి అనగా దాదాపు 3 గంటల వరకు అలాగే నిల్చున్నాను. ఆ నిల్లున్న నేను, నేనే శివస్వరూపంగా భావించడం జరిగింది. ఆ రుద్రాభిషేకం జరిగినంత సేపు అభిషేకం నాకే జరుగుతున్నట్లుగా భావింపబడిందేమో, ధానికి తార్కాణంగా ఆ అభిషేకం అయిన తర్వాత నా శిరస్సు చల్లగా చల్లని నీళ్ళను అప్పుడప్పుడే భావిలో నుండి బుంగంతో తోడుకొని శిరస్సుపై స్నానం చేసిన వాని శిరస్సు ఎట్లా వుంటుందో అట్లా నాకు ఉన్నది. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. తర్వాత ఆ మంత్రం చెప్పినా రామలింగేశ్వర సోమయాజుల గారి చేత శివసహస్రనామ పుస్తకం చేతులో పట్టుకొని శివసహస్రనామము మొదలు పెట్టి మధ్య నుండి అది లలితా సహస్రనామంగా పూర్తి చేయబడింది. ఈ మార్పు ఆయన కూడా గమనించలేదు. అట్లా పూజ సమాప్తమైన తర్వాత అమ్మ ఉద్ధరణతో ఆయనకు

తన పాద తీర్థాన్ని యివ్వపోయింది. శివునకు తప్ప ఇతర వ్యక్తులకు అభిషేకం చెయ్యటం ఇష్టపడని ఆయన మనస్సు మొదట్లో అంగీకరింపబడలేదు. కాని అమ్మ ఆత తీర్థం గిన్నెను అట్లాగే చేత్తో పట్టుకొని ఉద్ధరణను అట్లాగే పెట్టింది. అప్పుడు ఆయన ఆ తీర్థం అమ్మ చేతుల మీదుగా తీసికొన్నారు. ఎక్కడా ఆయన మయట భోజనం చేయవు. ఎక్కడకు పోయిన అక్కడకు ఆయన స్వయంపాకమే. కాని ఆ రోజు అనుకోకుండా మధ్యాహ్నం కాలాతీతం కావటం చేతనూ, ప్రొద్దున నుండి ఆయన ఏమీ తీసికోకపోవటం వల్లనూ అమ్మ ఆదేశం మేరకు అన్నపూర్ణాలయ వంటయింట్లో ప్రత్యేకంగా లక్ష్మీనరసమ్మగారిచేత మడిగా ఆయనకు భోజనం పెట్టబడింది. ఆయనకు ఇష్టం లేకపోయినప్పటికి అమ్మ ప్రసాదం తీసికొవటం తప్పలేదు. తర్వాత ఆయన వెళ్ళేటప్పుడు అమ్మ దగ్గర తాంబూలం తీసుకోవటానికి వచ్చినావడు అమ్మతో అమ్మా ! నేను దేశంలో నున్న కాశీ రామేశ్వరం మొదలగు అనేక శివాలయాలలో అభిషేకం చేసాను. కాని ఈ రోజు ఇక్కడ పొందిన ఆనందం ఎక్కడా పొందలేదు. అని అమ్మతో చెప్పుతూ ఆనందసాగరంతో మునిగిపోయాడు. ఈ మహన్యాస రుద్రాభిషేకాలు 10 ఆదివారాలు వివిధ రుత్విక్‌లతో అమ్మకు అభిషేకాలు చేయించాను. ఆ పదకొండు రుద్రాభిషేకం, కన్యాకుమారీ అగ్ర నుండి 3 సముద్రాలు నీరు కలసి చోటు నుండి సర్వతీర్థ జిల్లెళ్లమూడికి తీసికొని వచ్చి 11 మంది రుత్విక్కులతో మహారుద్రాభిషేకం జరుపబడింది. ఆ అభిషేకాని అనేక మంది సోదరీసోదరులు అన్న ప్రాంతాల నుండి వచ్చి అమ్మ ఆశీస్సులు పొందారు. తర్వాత 1968లో హైమకు మహాసమాధి అమ్మ చెయ్యటం, అక్కడ హైమాలయ నిర్మాణము జరగటం. ఆ హైమాలయ ప్రతిష్ఠ మొదలు పెట్టిన దగ్గర నుండి మహన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకాలు అప్పటి నుండి ఇప్పటి వరకు జరుగుతూనే యున్నవి. అట్లాగే అనసూయేశ్వరాలయంలో కూడా ఈ ఏకాదశ రుద్రాభిషేకాలు కొనసాగుతూనే యున్నవి. అట్లా ఈ అభిషేకాలు అమ్మ జరిపించటం నున్న మహత్ సంకల్పంలోని అంతరార్థం నేను ఆదరిస్తే తన కుమార్తెనే నిక్షిప్తం చేసి ఆమెకు దైవత్వం ఇచ్చినట్లుగా అమ్మ ప్రకటనలోని లోతులకు వెళ్తే "నేను అమ్మను, తన బిడ్డలమైన మనకు ప్రతీకగా హైమాలయంలో నిల్పి, దైవత్వం ఇచ్చి అక్కడ నుండి అనేకమైన అనుభూతులు, మన సోదరసోదరులకు ప్రసాదిస్తూ ఆ దైవత్వం హైమకే కాదు. మీరంతా కూడా అదే పొందుతున్నారు.

అదే అయి ఉన్నారు. అని మనకు తెలియజెయ్యటమే. గురువుగా ఈ గుర్తు మనకు చూపిస్తూ అమ్మగా తన బిడ&డలమైన మనకు తన దైవత్వాన్ని పంచుతున్నది. మీరు ఎవరో కాదు. మీరు అదే అనే భావనే. అమ్మ ఇక్కడ అందరికి ఇట్లా దైవత్వం ప్రసాదించటం "నేను మిమ్ములను కనిమి తల్లులకు పెంపుడిచ్చాను" అనియు "మీరు నాతోనే పుట్టి, నాలోనే పెరిగి నాలోనే లీనమౌతూన్నారు" "అందరికి సుగతే అని అమ్మ ప్రకటించటంలో ఇది నిస్సందేహముగా, నిశ్చశయంగా ముక్తి క్షేత్రముగా అమ్మే ప్రకటించటమే అయి యున్నది. కనుక ఈ అనసూయేశ్వరాలయంలో, హైమాలయాలంలో జరిపే రుద్రాభిషేకాల దృష్ట్యా కాని, ముక్కోటి ఏకాదశికి అమ్మ ఉత్తర ద్వార దర్శనంలో ప్రసాదించటంలో కాని నవరాత్రులలో సరస్వతిగా, దుర్గగా, మహాకాళిగా, మహాలక్ష్మిగా దర్శనం ప్రసాదించటటంలో ప్రత్యేకంగా పరిగణించటానికి వీలు లేదు. సర్వంతర్యామి, సర్వవ్యాప్తి అయిన సర్వేశ్వరుడు, నారాయణులు, విష్ణువు, వాసుదేవుడు ఇత్యాది నామములుగా కల పరంజ్యోతి అనసూయగా అమ్మగా ఇక్కడ అవతరించి ఈ ఆలయాలు ఏ ఒక్క మతానికి గాని, కులానికి గాని, జాతికిగాని ప్రత్యేకంగా సంబంధించినవి కావు. ఇవి సర్వమానవాళికి చెందిన ఆలయాలు మాత్రమే అభి భావమేద్యోతిక మౌతున్నది.



# మనస్సు - ఒక పరిశీలన

23.6.06 తెల్లవారిఝామున నాకు ఒక కలవచ్చింది. ఆ కలలో నేను హైదరాబాద్ వెళ్ళినట్లు ఆ హైదరాబాద్‌లో కొన్ని రోడ్లు తిరుగుతుంటే దారి తప్పాను. పోవలసిన చోటు ఎక్కడో అర్థం కాలేదు. అది ఒక చీకటి రాత్రి - నేను తిరిగే రోడ్లు కూడాస్పష్టంగా కనపడుట లేదు. ఆ చీకటిలో మెయిన్ రోడ్డు మీదకు ఎట్లాగైనా పోతేబస్సులు దొరికి ఏదో సెంటరుకు పోయి నేను పోవలసిన ప్రదేశమునకు చేరుకొనే అవకాశం వుంటుంది. కాని ఆ మెయిన్ రోడ్డుకు పోవటం ఎట్లా ? అది చీకటి కావటంతో, వీధిదీపాలు లేకపోవటంతో ఆది చీకటి కావటంతో, వీధి దీపాలు లేకపోవటంతో అలికిడై ఒకడు తారసిల్లాడు. వాడిని ఈ దగ్గరలో నున్న ఏదైనా మెయిన్ రోడ్డుకు పోవటానికి దారి వున్నదా ? అని అడిగారు. మీరు నాతో రండి నేను తీసుకొని వెళ్తాను అని చెప్పారు. వాడు నడుస్తున్నాడు. వాడి వెనుకే నేను పోతున్నాను. కాని కాసేపట్లో వాడు కనపడలేదు. పిలిచినా పలుకడు. మరేం చేయాలి ? తిరిగి తిరిగి కాళ్ళు, వళ్ళు నెప్పులు పుట్టుతున్నాయి. ఇంకా నడిచే పరిస్థితి నాకు లేదు. ఏం చేయాలో తెలియలేదు. ఆ చీకటిలో ఆ కుర్రవానితో మెయిన్ రోడ్డు వెళ్దాంమని పోతున్నప్పుడు ఒక ఆలోచన కలిగింది. మెయిన్ రోడ్డుకు వెళ్ళిన తర్వాత బస్సు ఎక్కితే టికెట్టు కావాలి కదా ? మరి టికెట్టుకు కావలసిన డబ్బులు నా దగ్గర లేవే. ఎట్లా ? ఇక అడుక్కోవలసినదియేనా ? అమ్మ అన్నది ఇతరుల కోసం అడుక్కొవటం అది అడగటం. తన కోసం అడుక్కోవటం అది అడుక్కోవటమే. ఇప్పుడు నేను అడుక్కోవలసి వచ్చింది. చాలా వర్రీగా వున్నది. ఆ టైమ్‌లో మా ఇంట్లో లైట్ వేసావు. ఇంతకీ చూస్తే నేను జిల్లెళ్ళమూడిలో మంచం మీద పడుకున్నాను. ఎదురుగా అమ్మ ఫోటోలో నవ్వుతున్నది అమ్మ ! నేను ఎక్కడకు పోలేరు. ఇక్కడే వున్నాను. అని స్పష్టత చిక్కింది. ఆ స్పష్టత చిక్కిన తర్వాత తలనొప్పి, కాళ్ళు నొప్పులు, వళ్ళు నొప్పులు మటుమాయమైనాయి. అంటే మనస్సుకు శరీరానికి బంధం వున్నదన్నమాట. కనుక ఈ శరీరము చేత చేతపడే పనులన్నింటికి (కర్మలు) మనస్సే కారణమవుతుంది. ఆలోచన, బుద్ధి, మేధస్సు, చిత్తము, అహంకారము అన్ని ఈ మనస్సుకు సంబంధించినవే. ఈ మన్సు లేకుండా శరీరము ఏమీ

చేయలేదు. ఈ మనస్సుకు భిన్నంగా ఈ మనస్సును కూడా చూచేది, ఆజ్ఞాపించేది ఏమైనా ఉన్నదా ? మనస్సు స్వతంత్రమైనదా ? పరతంత్రమైనదా? ఇది జీవాత్మకు అనుసంధానమైనదా ? జీవాత్మ పరమాత్మలోని భాగమే. పరమాత్మ అంటే బ్రహ్మమే. బ్రహ్మకు భిన్నంగా ఏదీ లేదు. అందుకనే అమ్మ అన్నది మనస్సు దైవమే అందుకే అమ్మ "తోచిందేదో చెయ్యి చేయించేవాడు వాడేగా అని వాడే కర్త, కర్మ, క్రియ. అన్ని జీవరాసులు పరమాత్మలోని భాగాలే. నదినాం సాగరో గతిః అన్నట్లు అన్ని నదులు, అనేక మెలికలు తిరిగి, తిరిగి చివరకు సాగరంలోనే చేరుతాయి. అట్లాగే మనము ఆ పరమాత్మలోనే పుట్టి, పరమాత్మగానే యుండి, పరమాత్మలోనే లీనమౌతాము. ఇది తెలుసుకోవటమే ఆత్మజ్ఞానం. ఆత్మను తెలుసుకోవాలంటే ఆ తెలుసుకొనేవాడు ఆత్మ కంటె భిన్న మవ్వాలి. ఆత్మ కంటె భిన్నమైనది ఏదీ లేదు. కనుక ఆత్మానుభూతిని పొందటమే నిజమైన జ్ఞానం.

నీవెవరో తెలుసుకో ? అంటారు రమణమహర్షి. "నేను నేనైన నేను. అన్ని కేసులు నేనైన నేను" అంటారు అమ్మ. మజ్జిగను చిలికితే గాని వెన్నరాదు. సత్యమైనది ఎవరు చెప్పినా ఒకటే. చెప్పటంలోనే తేడా. "జీవితం అనుభవాన్నిస్తుంది. శాస్త్రం అనుభవాన్ని ఇవ్వదు" అంటారు అమ్మ. అమ్మ జీవితం నుండి రాలిన ఆణిముత్యాలే నాకు శాస్త్రం. శాస్త్రం అంటే శాసించేది, శాశ్వతమైనది. అమ్మమాటలు ఆణిముత్యాలు, తరచి చూచితే నిత్యసత్యాలు. ఈ అణిముత్యాలు ఆధారంగా నాకు కలిగిన జిజ్ఞాస ఫలితమే ఈ విశ్లేషణ.



# మంత్రోపదేశం

అవి దాదాపు 1963-64 వ సంవత్సరము. నేను ప్రతిరాత్రి తెల్లవార్లు అమ్మగదిలో ఉండే రోజులు. సిరిగిరి సుబ్బారావు పుట్టంధుడు. పరచూరు నివాసి. జిల్లెళ్ళమూడి తరచు అమ్మ దర్శనార్థం వస్తూ వుండేవాడు. వచ్చినపుడు లక్ష్మీనృసింహకరాలంబ స్తోత్రము అనర్గళంగా నరసింహస్వామి ఎదురుగా ఉన్నట్లే భావించి స్తోతం చేసేవాడు. అట్లాగే అంబికరావలంబస్తోత్రము కూడా (డాక్టర్ పన్నాల రాధాకృష్ణశర్మగారిచే వ్రాయబడిన) సాక్షాత్తు అమ్మ దగ్గరే చదువుంటే అమ్మ తన చేతిని సుబ్బారావుకు అందించేది. అది ఒక మరపురాని దృశ్యము ఒక రోజున తెల్లవారుఝూమున సుమారు గం. 4-30 ని.లకు తలమీద చన్నీళ్ళు స్నానం చేసి అమ్మగదికివచ్చాడు సుబ్బారావు. అప్పుడు అమ్మ పడుకొని వున్నది. ఇంకా లేచినట్లు లేదు. సుబ్బారావు మెల్లిగా తలుపు తట్టాడు. సరే తలుపు తీసాను. సుబ్బారావు అమ్మతో మంత్రోపదేశం చేయించుకోవాలని వచ్చాడుట. ఆ మధ్యకాలంలో అమ్మ మంత్రోపదేశాలు చేయటం నేను చూడలేదు. అమ్మ ఒక పౌర్ణమికి ఓంకార నదిలో కొంతమందికి మంత్రోపదేశం చేసినట్లు విన్నాను. కాని అప్పుడు నేను లేను. అమ్మ ఇంకా లేవలేదు. కాసేపు ఆగమన్నాను. కాని సుబ్బారావు "అన్నయ్యా! నేను అమ్మ మంచం దగ్గరే అప్పటి దాకా కూర్చుంటాను" అని అన్నాడు. సామాన్యంగా అమ్మలేవకపోతే లోపలికి ఎవరిని అనుమతిచ్చేవాడిని కాదు. కాని సుబ్బారావును కాదనలేకపోయాను, సరీ వచ్చి లోపల అమ్మ మంచం ప్రక్కగా కూర్చున్నాడు. కాసేపటికి అమ్మ లేచింది "ఎవరు నాన్నా వచ్చింది" అని పడుకునే అడిగింది. సిరిగిరి సుబ్బారావమ్మా అన్నాను. ఏమిటంట అంది. నీవు మంత్రోపదేశం చేయాలిట స్నాన చేసి వచ్చాడు అన్నాను. అమ్మ లేచి కూర్చున్నది. సుబ్బారావును ఏం నాన్నా! వచ్చావు ? అన్నది. ఈ రోజు పౌర్ణమి అమ్మా నీ చేత మంత్రోపదేశం చేయించుకోవాలని వచ్చాడు అన్నాడు. అమ్మ బాసపెట్టు వేసుకొని మంచం మీదనే కూర్చున్నది" రా, నాన్నా! దగ్గరకురా అన్నది. సుబ్బారావు అమ్మ దగ్గరగా జరిగేడు. నేను మెల్లిగా లేచి బయట వెళ్దామని ఒక అడుగు వేసాను. అమ్మ ఫరావలేదు నాన్నా దీలె అక్కడ కూర్చో అన్నది. సుబ్బారావు ప్రక్కగా కూర్చున్నాను. అమ్మసుబ్బారావుకు మంత్రోపదేశం చేసింది. నేను ఆ మంత్రోపదేశం

విన్నానో, వినలేదో నాకు సరిగా తెలియదు. సుబ్బారావు అమ్మ పాదాలపై రెండు పువ్వులు వేసుకున్నాడు. ఒక పండు అమ్మ చేతిలో పెట్టాడు. వెంటనే వెళ్ళిపోయాడు. అమ్మ మెల్లగా లేచింది. అమ్మ పాదకలు అందించాను. అమ్మ బాత్‌రూంకు, ముఖ ప్రక్షాళనకు వచ్చింది. ముఖము కడిగించిన తరువాత అమ్మ మంగళసూత్రాలను అభిషేకించుకొని తీర్థం త్రాగింది. తర్వాతనే అమ్మ కాఫీ త్రాగి నాకు కాఫీ అందజేసింది.

అవి బ్రహ్మాండం రవి స్టేటు బ్యాంకటులో పనిచేస్తూ హైదరాబాద్‌లో విద్యానగర్‌లో ఉన్న రోజులు అప్పుడు శ్రీశ్రీశ్రీ పూర్ణానంద స్వామివారి ఒంట్లో బాగుండక హైదరాబాద్ ఉన్నారుట. ఎవరిని ఆయన దర్శనానికి అనుమదించటం లేదు. కాని ఒక రోజున రవిగారింటికి ఒక ప్రత్యేక కబురు వచ్చింది. రవి కుటుంబంతో వచ్చి స్వామివారిని దర్శించుకోవచ్చు అని. నేను అప్పుడు జిల్లెళ్ళమూడి నుండి హైదరాబాద్ వెళ్ళాను. రవి వాళ్ళు వెళ్ళుతూ నన్ను కూడా రమ్మన్నారు. కాని దర్శనం రవివాళ్ళ కుటుంబమునకు మాత్రమే రమ్మనప్పుడు నేను స్వామివారికి ఎంత తెలిసున్నా నేను ఆ indue advantage తీసికోవటం నాకు ఇష్టం లేకపోయింది. నేను రానులే మీరందరు వెళ్ళి రండి అన్నాను.క ఆని రవికి మాత్రం నన్ను ఒక్కడికే వదిలిపెట్టిపోవటం ఇష్టం లేకపోయింది అందుకని నాకు తోడుగా చిరంజీవి శరత్‌ను అట్టిపెట్టి వెళ్ళారు. అక్కడకు వెళ్ళి స్వామివారి దర్శనం చేస్తున్నప్పుడు ఇంటిలో యింకా ఎవరున్నారు ? అని అడిగారుట. గోపాలన్నయ్య, మా శరత్ వున్నారని చెప్పారుట. వెంటనే ఆయన గోపాలన్నయ్య వాళ్ళభు కూడా రమ్మనమని ఫోను చేయమన్నారుట. నాకు ఫోను చేసారు. వెంటనే మేమిద్దరం ఆటోలో వెళ్ళాము, ఆయన ఉండే గృహంలో ఒక పెద్ద హాలులో హాలునిండా కాలు పెట్టటానికి కూడా వీలు లేకుండా సోదరీ సోదరులు కూర్చున్నారు. మేము వెళ్ళి చివరలో నిల్చొని వున్నాము. ఇంతలో స్వామివారి అసిస్టెంటు ఒకరు వాడు వచ్చి గోపాలన్నయ్యవాళ్ళంటే మీరేనా అని అడిగాడు. అవునన్నాను. మిమ్ములను లోపలికి రమ్మంటున్నారు అన్నాడు. స్వామివారు మమ్ములను కూడా స్పెషల్‌గా రమ్మంటం నాకుసంతోషం కలిగింది. ఇద్దరం స్వామి వారుండే స్పెషల్ రూములోకి వెళ్ళాము. ఇద్దరం స్వామివారికి నమస్కరించి కూర్చున్నాము. స్వాములవారు నన్ను కుశలి ప్రశ్నలు వేస్తే తర్వాత అందరం లేచి స్వాములవారి అనుమతి తీసికొని ప్రసాదాలతో బయటకు బయలుదేరాము. నేను అందరికంటే చివరియున్నాను. ఇంకా నేను

బయటకు కాలు పెట్టేటప్పుడు  నాకు చిన్న కోరిక పుట్టింది. వెంటనే లోపలికి వెళ్ళి స్వామి వారితో స్వామీ నాకు  చిన్నప్పుడే 9వ ఏట తిరుపతిలో ఉపనయనం చేసారు. అప్పుడు బ్రహ్మోపదేశం మా నాన్నగారు చేసేరు. కాని సరిగా జ్ఞాపకం లేదు. కనుక మీ చేత గాయత్రి మంత్రం ఉపదేశం పొందాలని అనిపించింది అన్నాను. వెంటనే రమ్మనమని గాయత్రి మంత్రం ఉపదేశం చేసారు. అప్పటి నుంచి గాయత్రి మంత్రం అంతగా నన్ను వదలలేదు. అమ్మ నామం ఎప్పుడు గాయత్రీ మంత్రం నిమిలిత మౌతుందో తెలియకుండానే మంత్రం నేను పటించటం ఒక అదృష్టం గానే భావిస్తున్నాను. ఎప్పుడు నాకు అమ్మ మంత్రోపదేశం చేస్తానని లేదు. నేను అమ్మను అడుగలేదు. మంత్రోపదేశం నాకు అవసరమని కూడా నాకు ఎందుకో అనిపించలేదు. కాని స్వామివారితో మంత్రోపదేశం పొందటం కావటం కాకతాళీయం. అమ్మ అట్లా నాకు స్వామి వారితో మంత్రోపదేశం చేయించదలచినది కావలెను ఏమో !



# సంక్రాంతికి భోగి పండ్ల సంరంభం

అది 1985 జనవరి మాసము. నేను పనుల మీద మదరాసు ఎక్కువగా పోతూ ఉండేవాడిని. మదరాసులో గంగాధర్ అనే ప్రసిద్ధి చెందిన సినిమా ఆర్టిస్టు ఉండేవాడు. అతడు చాలా భగవత్ భక్తుడు. వారిని అమ్మ సినిమా ఎడిటర్, దర్శకుడైన ఎమ్.ఎస్.ఎన్. మూర్తిగారు నాకు పరిచయం చేశారు. మన పబ్లికేషన్స్ గ్రంథాలకు కావల్సిన టైటిల్స్ డిజైను ఆయన దగ్గర చేయిస్తూ ఉండేవాడిని. ఒకసారి వెళ్ళినపుడు అమ్మను గూర్చిన విశేషాలను ఆయనతో ముచ్చటించటం జరిగింది. అవి ఆయన విన్న తర్వాత తను కూడా అమ్మను ఒక్కసారి దర్శించుకోవలెననే కోరిక ఆయనకు ఉదయించింది. తాను ఒక్కసారి జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను దర్శించుకుంటానని చెప్పారు. 'జనవరి 13వ తేదీ భోగిపండుగ. నాడు వేలమంది అమ్మ బిడ్డలు ఆడ, మగ, బాలలు, ముదుసలులు, యువకులు... తారతమ్యం లేకుండా వచ్చి అమ్మచే భోగిపళ్ళు పోయించుకుంటారు. గడ్డాలు వచ్చిన వారు కూడా అమ్మకు బిడ్డలే. అందరినీ బారులుగా కూర్చో బెట్టి, బారుల మధ్యలో నుండి నడుస్తూ అందరికీ భోగిపండ్లు అమ్మే స్వయంగా పోయటం; తలమీద పడ్డ భోగిపండ్లలోని రేగుపండ్లు, పూలూ, చిల్లర నాణాలు పిల్లలు పెద్దలు పోటీపడి ఏరుకోవటం, వాటిని భద్రపరచుకోవటం, నడయాడే దేవతామూర్తిగా అమ్మను దర్శించటం... ఈ దృశ్యము 'న భూతో నభవిష్యతి' అన్నాను.

అరుదైన ఇట్టి దృశ్యము ఎక్కడా కానరాదు. చూడవలసిందే, ఆ ఆనందాన్ని అనుభవించాల్సిందే కాని వర్ణింపనలవి కాదు. చిన్నప్పుడు ఎవరికి వారు తమ తమ పసిపాపలకు భోగిపళ్ళు పోయటం ఆనవాయితి. ఇది సామాన్యమైనదే. కాని ఈ అశేష జనసందోహాన్ని తన పసిపాపలుగా ఎంచి భోగి పళ్ళు పోయడం ఎవరికి సాధ్యం? ఒక్క జగజ్జనని, సర్వేశ్వరి, విశ్వజనని అమ్మకి తప్ప. అటువంటి దృశ్యాన్ని ఎవరూ MISS కాకూడదు. అది ఒక అదృష్టం, పురాకృత పుణ్యఫలం' ఆ విషయం వారికి వివరించాను. 'మీరు కుటుంబ సమేతంగా వచ్చి ఆ అదృష్టాన్ని పొందండి' అని కోరాను. 'నాకు 3, 4 చిత్రాలు రిలీజు కానున్నవి. ఇప్పుడు రావటం కష్టం. వచ్చే సంవత్సరము వస్తాము లెండి' అని అన్నారు. 'వచ్చే సంవత్సరం మీరు రావచ్చును. కాని అప్పుడు మీరు అమ్మను చూడాలి గదా !' అన్నాను నాకు తెలియకుండానే.

ఆ సంవత్సరము భోగిపండుగ రోజున అందరికీ అమ్మ భోగిపండ్లు పోయటం ప్రారంభించింది. కొంతసేపటికి ఆ క్రియాకలాపం చివర కొచ్చింది. అంతలో ఒక కారులో మదరాసు నుండి గంగాధర్ దంపతులు జిల్లెళ్ళమూడి రానే వచ్చారు; అమ్మ చే భోగిపండ్లు పోయించుకున్నారు. అమ్మ వారికి నూతన వస్త్రాలను ప్రసాదించి ఆశీర్వదించింది. వారి ఆనందానికి అవధులు లేవు.

తర్వాత జూన్ 12న అమ్మ ఆలయ ప్రవేశం చేయటం యాదృచ్ఛికం. నేను మరల ఒకసారి మదరాసు వెళ్ళినపుడు గంగాధర్‌గారు 'మీరు ఆ రోజు అట్లా అనకపోతే నేను ఆ అదృష్టాన్ని చేజార్చుకునేవాడిని' – అన్నారు.

**దేనికైనా మనం కర్తలం కాము; "తోచిందోదో చెయ్యి - తోపించేవాడు వాడేగా" అన్నారు అమ్మ.**

– జనవరి, ***2010***



# జన్మ ఒక్కటే

కృష్ణతత్వాన్ని తెలుసుకోవటానికి తద్వారా కృష్ణుని దర్శించటానికి, కృష్ణుని చేరటానికి భగవద్గీత ఎట్లా ఆధారమో అట్లే అమ్మ తత్వాన్ని తద్వారా అమ్మను దర్శించటానికి, అమ్మలో లయంకావటానికి ఆణిముత్యాలైన అమ్మసూక్తులు అమ్మ తన జీవితాన్ని మథించి పల్కిన నిత్యసత్యాలు ఆధారాలు. అట్లా అమ్మను దర్శిస్తే నాకు కలిగిన భావాలు అనుభవసారం ఈ క్రింద పొందుపరుస్తాను.

సృష్టికి పూర్వము ఏదీ లేదు. సృష్టి మార్పు చెందుతుంది. కాని సృష్టికి నాశనం లేదు. ఏదైతే నాశనము లేకుండా ఉన్నదో అది సత్యమైనది, నిత్యమైనది. అంటే అదే ఆత్మ, పరమాత్మ, పరబ్రహ్మము అన్నమాట. పరమాత్మ నుండి ఉద్భవించినదే జీవాత్మ తద్వారా మనస్సు. ఈ మనస్సు ఉండేది పంచభూత సమ్మిళితమైన శరీరము ఆధారముగానే. అంటే మనస్సు, జీవాత్మ, పరమాత్మ విడిగా వేరు వేరుగా కనపడుతున్నట్లుగా వున్నా ఇవి అబేధమైనవి. అందుకే మనము ఎక్కడ నుండి వచ్చామో అక్కడకే చేరుతాము. మనము మనస్సుతోనే పలికి, మనస్సుతోనే విని, మనస్సు తోనే చూచి మనస్సుతోనే ఉచ్ఛ్వాసనిశ్వాసలను గమనించి జీవాత్మ పరమాత్మలో కలువ వచ్చును. దానినే సమాధిస్థితి అని అంటారు. ఈ స్థితి నుండి మరల తిరిగి వెనుకకు రావచ్చును.

నేను ఒకరోజు విజయవాడబస్సులో ప్రయాణం చేస్తున్నాను. ప్రయాణం చేస్తూ అమ్మ నామం మనస్సుతో పలుకుతూ, దానిని మనస్సుతోనే వింటూ వినడాన్ని మనస్సుతో పరికిస్తున్నాను. ఈ ప్రక్రియ నేను బాపట్లలో ప్రారంభించినప్పటికి అప్పికట్లను దాటటం గమనిస్తూనే యున్నాను. తర్వాత బస్సు మంగళగిరి దాటింతర్వాత గాని నేను స్ఫురణలోనికి లేదు. ఈ లోపల పొన్నూరు, గుంటూరు, మంగళగిరి ఎప్పుడు వచ్చినవో, ఎప్పుడు దాటాయో తెలియదు. అంటే దాదాపు 2 గంటల పాటు మనస్సు లయం అయిందన్నమాట. శరీరపు స్ఫురణ దానికి లేదు.

నేను జిల్లెళ్ళమూడికి వెళ్ళిన క్రొత్తల్లో అమ్మను గాయత్రిగా భావించేవాడిని. నేనొకసారి బాపట్లలో ఇంట్లో కూర్చుని ఉదయం సంధ్యావందనము చేస్తూ గాయత్రి మంత్రాన్ని జపం చేస్తున్నాను. ఎక్కువకాలం కదలటం, మెదలటం లేకపోవుట

వలన మా ఇంట్లో వాళ్ళు భయపడ్డారు. మా పిన్ని నన్ను 'బాలూ', 'బాలూ' అంటూ పెద్దగా పిలవడం ప్రారంభించింది. మాట, పలుకు లేదు. నా భార్య నన్ను గట్టిగా పట్టుకొని "ఏవండీ ఏవండీ !" అంటూ కుదపటం ప్రారంభించింది. అప్పటికి నాకు కొద్దిగా తెలుస్తున్నది. ఎక్కడో బావిలో అడుగు నుండి మాటవినపడి, వినపడనట్లుగా అనిపిస్తున్నది. కాని శరరీము స్వాధీనములో లేదు. కాని నేను బలవంతాన స్ఫురణలోనికి రావలసి వచ్చింది. శరీరము నా ఆధీనము లోనికి రావటానికి కొంత వ్యవధి పట్టింది. నాకేం కాలేదు అని వారికి మనస్సు లయమైన స్థితి వ్యక్తీకరించటానికి వీలులేనిది.

కాని ఈ దేహము శిధిలమై పంచభూతములలో లయమై పోతుంది. మనస్సు జీవాత్మలో, జీవాత్మ పరమాత్మలో వచ్చిన చోటుకే పోక తప్పదు. ఒకసారి వచ్చిన చోటుకే అనగా పరమాత్మలో లీనమైన తర్వాత తిరిగి అదే వచ్చే మాట లేదు. అంటే పరిమితమైన ఈ జీవితము వచ్చిన పని ముగించుకొని ఈ జన్మ పరిసమాప్తమైన తర్వాత ఇక పునర్జన్మ అంటూ లేదు.

"మీరు నాలోనే పుట్టి నాలోనే పెరిగి నాలోనే లయమౌతారన"నే అమ్మ మాట నిత్యమైనది. సత్యమైనది.

"నేను నేనైన నేను. అన్ని నేనులు నేనైన నేను" అనే సత్యమైన నేనులో అన్ని నేనులు లీనమై మిగిలేది ఒక్క "నేను" మాత్రమే. అదే పరమాత్మ, పరంజ్యోతి, పరంధామం.

"From me the world streams out
And in me it dissolves
As a bracelet melts into gold
A pot creembles into clay
A wave subsides into water:"

**-Astavakra Gita**

"As I was whizzing through the air yesterday and looking at the trees, I saw that beneath all the change that these mighty trees daily underwent, there was a little something that persisted. Every leaf has its own separate life. It drops and withers. But the tree lives on"

**Mahatma Gandhi**

– జనవరి, ***2008***

# ఇంతకీ నేనెవరు ?

ఒకరోజున ఒక విచిత్రమైన కలవచ్చింది. ఇది కల అని నాకనిపించదు. నిజంగా జరిగిందా అని అనిపిస్తుంది.

నేను చనిపోయినట్లు నా శవం తీసికొని వచ్చి వాత్సల్యాలయంలో పోర్టికోలో బల్లులు వేసి పడుకోబెట్టారు. ఆ శవం పైన పూలదండలు దండిగావేశారు. అమ్మ వాత్సల్యాలయంలోని తూర్పు ప్రక్కవున్న కిటికి దగ్గర నుంచుని కళ్ళ నీరు కారుస్తూ సూర్యాస్తమయంలోని సూర్యుని పోలి ఎర్రని ముఖారవిందంతో విచారగ్రస్తవదనంతో నిల్చొని నా వంక తదేకంగా చూస్తున్నది. ఆ పోర్టికోలో నా భార్య మిగతా మా కుటుంబ సభ్యులంతా కళ్ళవెంబడి నీరు కారుస్తూ తలలు వంచుకొని కూర్చున్నారు. ఆవరణలోని సోదరీ సోదరులు గుంపులు గుంపులుగా కూడి వాత్సల్యాలయంలో ఉత్తరపు ఆరుబయట నిల్చుని యున్నారు. అంతా నిశ్శబ్దం ఆవరించి యున్నది. అప్పుడు నేను అనుకుంటాను "ఇది ఏమిటి నన్ను తీసుకొచ్చి వాత్సల్యాయం పోర్టికోలో పడుకోపెట్టారు. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు పోయినప్పుడు సైతం క్రిందనే అట్టి పెట్టి అమ్మపై నుండి చూచింది ఎందుకు ఇట్లా చేశారు" అని అనుకుంటున్నాను. ఈ విషయం అమ్మ దగ్గర ప్రస్తావనానికి వచ్చింది. "వాడిని నేను చూస్తూ వుంటానికే నేనే ఇక్కడ పెట్టమన్నాను" అని అమ్మ అన్నారుట. ఆవరణ అంతా అన్నపూర్ణాలయం షెడ్డులోను, బయట హైమాలయం దాక గుంపులు, గుంపులుగా నిల్చుని యున్నారు. అందరి కళ్ళవెంట నీరు కారటం మాత్రం కనపడుతున్నది. నిశబ్దం రాజ్య మేలుతుంది. ఈ వాత్సల్యాలయ పరిసరాలను యావత్ ఆవరణను నేను సాక్షిగా చూస్తునే యున్నాను. పరికిస్తున్నాను.

ఇంతవరకు ఆ శరీరాన్ని అంటిపెట్టుకొన్న నేను ఆ శరీరంతో వున్నానా ? లేక విడిగా వున్నానా ? శరీరంతో ఉండి నన్ను నేను చూచుకోగలనా? ఒక వేళ శరీరంతో వుంటే వాత్సల్యాలయం, దాని పరిసరప్రాంతం, క్రింద మెట్లు, అన్నపూర్ణాలయ ప్రాంతం, ఆలయప్రాంతం మొత్తం ఆవరణంతా చూడటం జరగని పని. కనుక ఈ శరీరము వదిలి బయట అంత చూడగలశక్తి నాకు వున్నదన్నమాట. మరి ఇంతకు నేనెవరు ? మరి నేను శరీరములో వున్నంతవరకు ఆలోచనలన్నీ నాకే వస్తున్నవి. పుట్టిందగ్గరనుండి గిట్టిందాకా జరిగిన సంసారమంతా నేనే అనుభవించాను. కష్టము, సుఖము, దుఃఖము, ఆనందము, బాధ అన్నీ నేనే భరించాను. అనుభవించాను. మరి ఈ శరీరం వదలిన తర్వాత ఆ శరీరమును,

దహనము చేస్తారు. ఎక్కువకాలం అట్టిపెట్టరు. మరి నేను ఆ శరీరంలో వున్నంత కాలం దహనము చెయ్యరు. ఏదైనా ఈ శరీరానికి ముప్పు వస్తే, చేతనైనంవరకు వైద్య సహాయం జరుగుతుంది. వైద్యులు ఈ శరరీంలో జీవత్వము లేదు, జీవిలేదు అని నిర్ణయించిన తర్వాత దహన కార్యక్రమము లేదా మరియొక విధానము తప్ప వేరే శరణ్యము లేదు. పంచభూతాత్మకమైన ఈ దేహము పంచభూతములలో కలుస్తుంది. మరి యింతకు నేనెవరు ? నేను శరీరంతోను వున్నాను. శరీరం లేకుండానూ వున్నాను. ఎట్లా వున్నాను ? ఆకారం ఏమిటి? నేనంటే మనస్సా ? మనస్సుకు ఆలోచనలుంటాయి. మనస్సు మెదడులో వుంటుంది. మరి ఆలోచనలు ఎక్కడ నుండి వస్తవి ? మరి ఇప్పుడు ఆలోచనలు లేవు. కనుక మనస్సులేని పరిస్థితి కూడా వుండి వుండాలి. అది ఏదై వుండవచ్చు? అది శ్వాస, ఉచ్ఛ్వాస, నిశ్వాసాలాగితే ప్రాణం పోయింది అంటారు. ప్రాణం అంటే శ్వాసా ? శ్వాస అంటే గాలి, వాయువు. ఆ వాయువు అనంత వాయువుతో కలిస్తే శరీరంలోని అన్నిభాగాలు నిర్వీర్యం అవుతాయి అన్నమాట. అది నిర్వీర్యం అయిన తరువాత డాక్టర్లు, శాస్త్రవేత్తలు ఇక ఏమీ చేయలేరు. మరి యింతకు నేనెవరు ? నేను శరీరము అయివున్నాను. మనస్సు అయివున్నాను. ప్రాణంగాను వున్నాను. ఈ ప్రాణాన్నే శరీరంలో వున్నంత వరకు ఆధ్యాత్మిక పరిభాషలో జీవాత్మ అని అది విశ్వవాయువులో కలిసిన తర్వాత పరమాత్మలో కలిసిందని, ఆ పరమాత్మనే, పరబ్రహ్మమని ఇది అంతటా వుండడం వల్ల, అంతా అయివుండడం వల్ల "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని అన్నారు. దీనినే అమ్మ "నేను, నేనైన నేను" అన్ని నేనులు నేనైన నేను" అని అన్నారు. ఎవరైనా నీవు ఎవరు అంటే నేను ఫలానా, నేను ఫలానా, నేను ఫలానా అని అంటారు. ఈ అందరిలో నున్న "నేను" "నేనే" అన్నారు అమ్మ. "నేను మిమ్మలను కన్నాను, మిమ్మల్ని పెంచాను. మిమ్మల్ని నాలోనే కలుపు కుంటాను అని అన్నారు. అందుకే సద్గురువు శివానందమూర్తి గారు జిల్లెళ్ళమూడిలో వారి ప్రసంగములో "అందరి అమ్మలు కనిపెంచి వదలిపెట్టిపోతారు. కాని ఈ అమ్మ మనలను కని, పెంచి తనలోనే కలుపుకుంటుంది. ఆమె కాలస్వరూపిణి. ఇటువంటి అవతారం ఒక్క కాశీలోనే చూస్తాము. తర్వాత ఇక్కడే అని.

**"నా సంకల్పంతోనే మీరు జన్మ యెత్తి**
**"నాలోనే లీనం అవుతారు" - అమ్మ**
**ఎవరికైనా తప్పదు వచ్చిన చోటికి పోక - అమ్మ.** - ఫిబ్రవరి, ***2008***

# ఆత్మావై పుత్రానామాసి

మన ఇండ్లలో పుత్రుడు ఉదయించినపుడు వాడికి పేరు పెట్టడానికి ఒక బారసాల కార్యక్రమమును జరుపుకుంటూ వుంటాము. భార్య నెల తప్పిన నాటి నుండి పిల్లవాడు పుట్టేవరకు ఆమెను ఆకుటుంబంలోని వారందరూ అపురూపముగా చూచుకునేవారు అనేకులున్నారు. ఆ పిల్లవాడు పుట్టిన తరువాత వాడికి నామకరణోత్సవము జరిపేటప్పుడు ఆ క్రతువులో తండ్రి చేత పురోహితుడు 'ఆత్మావై పుత్రనామాసి" అనే మంత్రముతో ఆ బిడ్డను స్పృశింపచేస్తారు. అంటే తనకు కలిగిన ఆ పుత్రుడు తన ఆత్మ స్వరూపమే. తన ప్రతిబింబమే అనే ఏకాత్మ భావాన్ని ప్రకటిస్తాడు. అదే విధముగా తన తల్లిని, తన తండ్రిని తన పిల్లలందరిని అట్లాగే చూస్తాడు. ప్రేమిస్తాడు. తన భార్యను ప్రేమిస్తాడు. తన కుటుంబసభ్యులందరిని ప్రేమిస్తాడు. తన బంధువులందరిని ప్రేమిస్తాడు. తన స్నేహితులను ప్రేమిస్తాడు. తన జిల్లాను ప్రేమిస్తారు. తన రాష్ట్రాన్ని ప్రేమిస్తాడు. తన దేశాన్ని ప్రేమిస్తాడు. ఇంతమందిని ప్రేమించటానికి ఏమిటి కారణం ? అని యోచిస్తే దానికి మూలకారణం "తన", "తాను" వీరంతా తనకు సంబంధించినవారు అనేభావమే. అమ్మ అన్నది. "ధన మూలమ్ ఇదం జగత్ కాదు, తను మూలమ్ ఇదం జగత్" అని. అన్నింటికి తనే కారణము.

మనము ప్రేమిస్తున్నామని మనకు ఎప్పుడు తెలుస్తుం దంటే మనము ఇంకో దేశానికి పోయినపుడు, అక్కడ ఒక్క ఇండియన్ కనపడినపుడు, ఆ ఇండియన్ మన రాష్ట్రానికి సంబంధించిన వాడే అయితే, వాడు మన జిల్లాకు సంబంధించిన వాడైతే ఇకవాడు మన ఊరి వాడైతే వాడిని చూస్తే మనకు ప్రాణం లేచి వచ్చినట్లుంటుంది. ఆ ప్రాణం లేచివచ్చినట్లుండే స్థితి ఏకాత్మ భావన. ఈ భావన మనకు సామాన్యంగా గోచరమయ్యేది ఒక గురువును తన శిష్యబృందమంతా కలిసి నపుడు, ఒక అవతారమూర్తి యొక్క భక్తులు అందరు వారిని దర్శించినపుడు, బిడ్డను తల్లి కలిసినపుడు, ఒక ఆలయములో తన ఇష్టదైవాన్ని దర్శించినపుడు ఈ ఆత్మానుబంధము ప్రస్ఫుట మవుతుంది. ఒక పసిపిల్లవాడు అద్దములో తన ప్రతిబింబమును చూచుకొని, కేరింతలు కొడుతూ అవ్యక్తానందమును పొందుతాడు.

కనుక నీవు ఎవరినైతే ప్రేమిస్తున్నావో వారందరిలో నీవు చూచేది నీ ఆత్మస్వరూపాన్నే: కారణము తనకు తెలియ కుండానే తానుగానున్న ఆత్మను తాను దర్శించటమే.

ఒకే మనస్తత్వము గల మానవులు, జంతువులు, పక్షులు, క్రిమికీటకాదులు ఒకే చోట గుంపులు, గుంపులుగా చేరి అన్యోన్య పరస్పర సహాయ సహకారాలను అందించుకుంటూ తమ తమ పిల్లల్ని కూడా తమ అక్కున చేర్చుకుంటూ, శత్రువుబారి నుండి తప్పించుకుంటూ, ఏకోన్ముఖముగా ఎదుర్కొంటూ ఉండటమే మనం జాగ్రత్తగా పరిశీలిస్తే మనం గమనించ గల విషయాలు Birds of the same feather flocked together అన్నట్లుగా ఈ సమైక్యతకు మూలకారణం లోతుగా విశ్లేషణకు పోతే మనకందేది అన్నిటిలో Common factor అయిన ఆత్మానుబంధమే. ఏ ఒక్కటి అన్నింటిలో ఉంటుందో అదే ఆత్మ. ప్రతిఫలం కోరని స్వచ్ఛమైన ప్రేమే ఆత్మ. అందుకనే Love is God అన్నారు. "నీ బిడ్డ యందు నీవు ఏమి చూస్తున్నావో అందరి యందు దానిని చూడటమే బ్రహ్మస్థితి" అని అమ్మ అన్నారు. చూడటము అనేటప్పటికి మనము అమ్మనుండి విడిగా వున్నట్లుగా కనపడుతుంది. కాని "మీరు నా కంటె భిన్నం కాదు" అంటున్నారు అమ్మ. అంటే వున్నది ఒక్కటే అన్నమాట. మరి ఇది ఎట్లా తెలుస్తుంది? దానికి ఒకటే మార్గం. ఏమిటది? తెలియబడవలసినవాడు తెలియచేయటమే. అందుకే అమ్మ "నేను అమ్మను. మీరు నా బిడ్డలు. అంతేకాదు మీరు నా అవయవాలు కూడా" అని తెలియచేసుకున్నారు. తెలియచేస్తే మాత్రం మనము తెలుసుకోవద్దా ? ఎలా? దానికి ఒకటే మార్గం. మన బిడ్డయందు మనము ఏమి చూస్తున్నామో దానిని అందరిలోను చూచి బ్రహ్మస్థితిని పొందేటట్లు మనని అనుగ్రహించమని అమ్మను అర్థించటమే శరణ్యము. పోనీ దానికి సాధన చేద్దామన్నా వాడి కరుణ లేకపోతే అదీ సాధ్యం కాదు. "సాధ్యమైనదే సాధన" కదా!

– ఏప్రియల్, *2008*



# నిశ్శబ్ద దర్శనం తోనే అనుగ్రహం

అమ్మ నాకిచ్చిన అదృష్టం ఒకటి ఉన్నది. ఈ తరం వారికి, వచ్చే తరాల వారికి అమ్మను చూపించటానికి, అమ్మను పరిచయము చేయటానికి వీలుగా అమ్మ మీద పూర్తినిడివి గల డాక్యుమెంటరీ సినిమాకి ఎక్సిక్యుటివ్ ప్రొడ్యూసర్గా సర్వ బాధ్యతలు నాకు అప్పగించబడినవి. దానికి స్క్రిప్టు సోదరుడు రామకృష్ణ తనదైనశైలిలో వ్రాసి దానికి తగిన న్యాయం చేకూర్చాడు. అంతేకాదు అమ్మ సాహిత్యానికి Encyclopedia గా మలిచాడు.

ఈ కారణంగా నేను మదరాసు 3 సంవత్సరాలు ఎక్కువగా వెళ్తూ వుండేవాడిని. ఒకసారి మైలాపూర్ వెళ్ళినపుడు Divine Mother రమాదేవి అని కర్నాటక దేశములో ప్రసిద్ధి పొందిన ఆధ్యాత్మికవేత్త బెంగుళూరు నుండి మదరాసు వస్తున్నట్లు ఆమెకు స్వాగతపు బోర్డులు ఎక్కడ చూచినా కనబడు తున్నాయి. వారు బెంగుళూరులో రమాశక్తి మిషన్ అనే పేరుతో ఆశ్రమం నిర్వహిస్తూ వుండేవారు. వారికి ఒక మాసపత్రిక కూడా వుండేది. నేను చూస్తూ వుండేవాడిని. దాని ద్వారా ఆమెను గూర్చి విని వున్నాను. ఆమెను చూద్దాం అని కోరిక పుట్టింది. ఆమెను మదరాసులో రిసీవ్ చేసుకొనేటప్పుడు నేను కూడా అక్కడే వుండటము తటస్థించింది. ఆమె ఒక రోల్సురాయిస్ కారులో దిగింది. ఆమెకు కన్నడులు, ఉడిపి, మంగళూరు మొదలగు South canarians భక్తులు. ఆమెకు బ్రహ్మాండమైన రిసెప్షన్ ఇచ్చారు. మేళతాళాలతో, బ్రాహ్మణుల వేదమంత్రాలతో జయజయ ధ్వానాలతో స్వాగతము పలికారు. ఆమెను పూలదండలతో, పూలతో నింపివేశారు. ఒక కళ్యాణ మండపములో డయాస్ మీద సింహాసనములో కూర్చోపెట్టారు. కొన్నివేలమంది ఆమె దర్శనార్థం వచ్చారు. ఆమె ఒక భజన కార్యక్రమాన్ని నిర్వహించింది. దాదాపు 10 మంది వంత పాడేవాళ్ళున్నారు. వివిధ రకాలైన వాద్యములతో వినసొంపుగా అందరి దేవతల మీద కీర్తనలు, భజన కావించారు. తర్వాత కన్నడంలో ఆమె ఉపన్యాసము చేసారు. రామాయణ, భారత, భాగవత, భగవద్గీతల నుండి అనేక కొటేషన్స్తో. అది ఇంగ్లీషులో తర్జుమా చేయబడింది.

ఆ రిసెప్షన్ చూచిన తర్వాత మదరాసులో అమ్మకు కూడా ఇటువంటి ఘనమైన స్వాగతము లభిస్తే బాగుండును అని నాకు అనిపించింది. తర్వాత 1974లో అమ్మ మదరాసు వచ్చినపుడు హేమమాలిని కళ్యాణమండపములో అమ్మను రోల్సు రాయి కారులో కూర్చుండబెట్టి ఊరేగింపుతో ఆ మదరాసు సోదరులు యిచ్చిన స్వాగతము మరువలేనిది. నా మనస్సులో ఉన్న కొరత, కోరిక తీర్చబడింది.

మామూలుగా ఇప్పుడు మనం చూచే యోగులు, గురువులు, పీఠాధిపతులు, Divine Mothers, Godmen ఎవరిని పరికించినా ఈ ఉపనాస్యాలు, భజనలు, సాధనలు యోగా, ఎక్సర్సైజ్‌లు చేసేవారే. ఈ ప్రక్రియను తెలిసుకుందామని ప్రజలు తండోపతండాలుగా వస్తూ వుండటం మనం చూస్తూనే ఉన్నాము. కాని అమ్మ వీటన్నిటికి భిన్నమైన ప్రవృత్తి కలిగి భిన్నత్వం నుంచి ఏకత్వానికి దారి చూపుతూ అందరూ ఆత్మస్వరూపులే. దానికి భిన్నంగా ఎవరు లేరు, ఏదీ లేదనే నిత్యమైన సత్యాన్ని మృదుమధురమైన మాతృత్వంతో గోరు ముద్దలు తినిపిస్తూ తన పిల్లలకు ప్రత్యేకంగా చెప్పేది ఇంక ఏమీ లేదనేది కావలయును. "మీరు నానుండే పుట్టి నాలోనే పెరిగి నాలోనే లీనమౌతారు. మీరెవ్వరు నా ఒడి నుండి వేరుగాలేరు" అని తెలియ చేసింది. దానిని నమ్మి అమ్మను దర్శన, స్పర్శన, స్మరణ కావించిన వారికి మరుజన్మలేదు. జన్మపరంపర తప్పదని శాస్త్ర జ్ఞానముతో అది కోరిన వారికి తప్ప దేమో మరి. యద్భావం తద్భవతి. "సాహిత్యంతో రాహిత్యం రాదు. శాస్త్రం అనుభవాన్నివ్వదు అనుభవం శాస్త్రాన్నిస్తుంది" అంటుంది అమ్మ. ఎవ్వరి నమ్మకము వారిది. అందుకే "నమ్మకమే భగవంతుడు" అన్నది అమ్మ.

అమ్మ హైదరాబాద్, వరంగల్, కరీంనగర్, ఖమ్మం, మదరాసు, తిరువణ్ణామలై, తిరుపతి, చిత్తూరు, కడప, నెల్లూరు, గుంటూరు, విజయవాడ, గుడివాడ, మచిలీపట్నం, ఏలూరు, నర్సాపురం, పాలకొల్లు, రాజోలు మొదలగు పట్టణాలో దర్శనం యిచ్చినపుడు ఆస్తికులు, నాస్తికులు అనే తేడా లేకుండా వేలల్లో, లక్షలలో ప్రజలు వచ్చి అమ్మదర్శనము చేసుకున్నారు. అన్నిచోట్ల అమ్మదర్శన వేళ్ళలో నిశ్శబ్దం రాజ్యమేలింది. Pin drop silence అంటే అక్కడ చూడవచ్చు. అది భయంకర నిశ్శబ్దం. అమ్మ సంకీర్తన చేయలేదు. ఉపన్యాసాలు యివ్వలేదు. యోగసాధనలు చెప్పరు. వేరు attraction ఏవీలేవు. ఉన్నదల్లా అమ్మ దర్శనమే. ఆ నిశ్శబ్దవాతావరణములో అమ్మ దర్శనము పొందినవారికి అమ్మ యిచ్చిన సందేశమేమిటో, సంకేత మేమిటో మనకు తెలియదు. కాని అందరు సంతృప్తిగా అమ్మ దర్శనము చేసికొని వెళ్ళారు. ఆనందం పొందారు. అట్లా వేలల్లో, లక్షలలో అమ్మను చూచినవారి మనసుల మీద అమ్మ ముద్ర పడింది. ఎవరికి వారు అమ్మ తననే చూస్తున్నదని తృప్తి పొందారు. వాటికి తగిన నిదర్శనాలు వారి వారికి అనేకంగా వున్నాయి. ధన్యమహో ధన్యమహో ధన్యం తవ దర్శనం. పుణ్య మహో, పుణ్యమహో పుణ్యం తవదర్శనం.

– ***మే, 2008***

# టైం అంటే టైమే

అవధూతేంద్ర సరస్వతీ స్వామివారితో మాకు 1950 నుండి ఎంతో సాన్నిహిత్యం వుంది. కారణం ఆయన బృందావనము నుండి రావటమే. అప్పికట్ల వచ్చి కంభంపాటి రామచంద్రమూర్తిగారింట్లో దిగి హిందూస్తానీ రాగంతో రామనామ సంకీర్తనలు చేసేవారు. అప్పుడు నేను మా సోదరుడు రామకృష్ణ ఎస్.యస్.ఎల్.సి. చదువుతుండేవాళ్ళం. మ(క్రి)పూడిలో జరిగే దత్తజయంతి ఉత్సవాలలో ఆయన సప్తాహాలు చేస్తూ వుండేవారు. అట్లా నే అప్పికట్లలో కూడా మా ఇంట్లో ఏకాహాలు, సప్తాహాలు, అనేకం జరిగినవి. ఆ పరిచయం పురస్కరించుకొని బాపట్లలో హైమవతీ వాళ్ళింటికి వచ్చినప్పుడల్లా నన్ను రమ్మని కబురు చేసేవారు. ఒకసారి అట్లాగే కబురు చేశారు. నేను హైమవతి వారింటికి సంకీర్తనకు రైలుపేట వెళ్ళాను.

స్వామివారు సంకీర్తన చేస్తున్నారు. వచ్చి దగ్గర కూర్చోమని సంజ్ఞచేసారు. దగ్గరలో కూర్చున్నాను. స్వామివారు ఉచ్ఛైస్వరముతో "జయమా జయజయమా" అనే నామం చెబుతూ మధ్యలో "యాదేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా" అంటూ మధ్యలో "అమ్మా!" అని కేక వేస్తూ సంకీర్తన చేస్తుంటే ఆ కేక జిల్లెళ్ళమూడిలో అమ్మకు వినపడుతున్నదేమో అని నాకు అనిపించింది. అవి అమ్మ పూరింట్లో వుండే రోజులు.

ఆ పాట వినగా వినగా ఇదే బాణిలో అమ్మ మీద సంకీర్తన చేయాలన్న స్ఫూర్తి నాకు కలిగింది. జిల్లెళ్ళమూడి వెళ్లాను. ఒకరోజు కుమారస్వామి మందిరంలో అమ్మకు పూజ జరుగుతున్నది. అనేకమంది పాటలు పాడుతున్నారు. సంకీర్తనలు చేస్తున్నారు. నా సంకీర్తన అమ్మకు వినిపించాలని అనిపించింది. సంకీర్తన మొదలు పెట్టాను. "యాదేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా, శక్తిరూపేణ సంస్థితా విద్యారూపేణ సంస్థితా" అంటూ శ్లోకాలు విడివిడిగా పాడుతూ ఒక్కొక్క శ్లోకానికి మధ్య "జయ అనసూయ జయజయమా, జయహోమాతా జయజయమా, రాజరాజేశ్వరి జయజయమా, జయపరాత్పరి జయజయమా" సంకీర్తన చేయటం ప్రారంభించాను. అది మొదటిసారిగా స్వామి వారి స్ఫూర్తితో పాడటమే. ఆ పాటలో నేను లీనమై పోయాను. నాకు తెలియక పోయినా, ఆ పాట అమ్మను, ఆ

సంకీర్తనలో పాల్గొన్న మన సోదరీ సోదరులను ఒక ఊపు ఊపింది. ఇక అక్కడ నుండి అది గోపాలన్నయ్య పాటగా విరాజిల్లటం మొదలు పెట్టింది.

ఒకసారి స్వామివారు బాపట్ల వచ్చినపుడు నాకుకబురు చేసారు. సంకీర్తన అయిన తర్వాత స్వామీ ! జిల్లెళ్ళమూడి వెళ్దామా! అని అన్నాను. వెళ్దాము కాని అమ్మను చూచి వెంటనే రావాలి సాయంత్రం గుంటూరులో రామనామక్షేత్రములో సంకీర్తన ఉంది అక్కడకు వెంటనే వెళ్ళాలని అన్నారు. సరే ఒక టాక్సీని పిలిపించాను. అది మధ్యాహ్నం 12 గంటలవు తుంది. అప్పుడు ఫోర్డుకారు ఒకటి బాపట్లలో టాక్సీగా తిరుగుతుండేది. అది చాలా గట్టిది. మనము టైంప్రకారము వెళ్ళి మరలా టైం ప్రకారం తిరిగి రావాలన్నారు. జిల్లెళ్ళమూడి వెళ్ళిన తర్వాత టైం మనచేతుల్లో లేదు. అట్లా టైంతో పెట్టుకుంటే కష్టమన్నాను. కాని స్వామివారు నాకు టైం అంటే టైమ్ అన్నారు. సరే మేమిద్దరమే కారులో ఎక్కాము. అపుడు మధ్యాహ్నము 12 గంటలు. మంచి ఎండాకాలము. కారు జమ్ములపాలెం దగ్గరకు పోయేటప్పటికి టైరు పంచరైంది. డ్రైవరు టైర్ మార్చాడు. కారు కదలటానికి మేము తోయాల్సి వచ్చింది. నేను దిగాను. తోసాను. కదలలేదు. స్వామివారు కూడదిగివచ్చి ఆ ఎండలో నాతో పాటు తొయ్యటం మొదలు పెట్టారు. ఆ ఎండలో అక్కడ దగ్గరలో ఎవ్వరు లేరు. అట్లా కొంత దూరం బలవంతాన తోసిన తర్వాత స్టార్ట్ అయింది. జిల్లెళ్ళమూడి చేరాము. అమ్మ స్నానానికి వెళ్ళారు. వచ్చేదాకా హాలులో కూర్చున్నాము. దాదాపు 2 గంటలకు అమ్మ వచ్చారు. అన్నపూర్ణాలయం నుండి అన్నం తెప్పించారు. స్వామివారికి ముద్దలు కలిపి పెట్టటం మొదలపెట్టింది. భోజనాలు అమ్మ దర్శనం అయ్యేటప్పటికి 3 గంటలైంది. అమ్మ ఆయనను నాన్నా సాయంత్రం నీవు సంకీర్తన చేయి నామం వినాలని వున్నది అని అన్నది. "సరే అమ్మా" అని అన్నారు. సాయంత్రం దాదాపు 6 గంటలకు వరండాలో ఇప్పుడు నామ సంకీర్తన చేసే చోట అమ్మకు కుర్చీ వేశారు. స్వామివారు హార్మోనియం తీసుకొని సంకీర్తన ప్రారంభించారు. ఇపుడు హైమాలయం వున్న చోట దాకా జనం కూర్చున్నారు. రాత్రి 9 గంటలైంది. అమ్మ స్నానానికి వెళ్ళింది. వచ్చేదాక వుండమన్నది. వచ్చి మరల వారికి అన్న పెట్టింది. రెడ్డిసుబ్బయ్యను ఎద్దు బండి కట్టుకొని తెమ్మంది. ఆ బండి జల్లలో గడ్డివేసి గడ్డి మీద దుప్పటి వేసి మే ఇద్దరం కూర్చుని గోపాలకృష్ణా మీరిద్దరు ఎంతో అదృష్టవంతులు. ఏ పరిస్థితిలోను అమ్మను వదలవద్దు అని హితోపదేశం చేశారు. బాపట్ల చేరేటప్పటికి రాత్రి 12 గంటలైంది. కాలస్వరూపిణి అయిన అమ్మ దగ్గర మన టైంలు పనికిరావు. అమ్మ నిర్ణయించిన టైమే టైం.

– జూన్, ***2008***

# అమ్మకు ప్రకృతిపై పట్టు

అది 1971. మాతృశ్రీ విద్యాపరిషత్ ఏర్పడి ఓరియంటల్ కాలేజీ ప్రారంభించిన సంవత్సరము. కాలేజీకి కావలసిన అత్యధిక నిధులు ఏర్పరచటానికి ప్రయత్నాలు ప్రారంభ మయ్యాయి. అప్పుడే అమ్మను గూర్చి బ్లాక్ & వైట్ 2 రీళ్ళ డాక్యుమెంటరీ అమ్మ జన్మదినోత్సవ సందర్భంగా చుండూరు శీతారామయ్య తాతయ్యగారి ప్రోత్సాహముతో పామర్తి వెంకటేశ్వరరావు గారి ఆధ్వర్యంలో కొంగర జగ్గయ్యగారి కామెంటరీతో శ్రీమతి జానకి టైటిల్ సాంగ్‌తో విడుదల చేసాము. అది చాలా బాగుందని పూర్తి నిడివిగల కలర్ డాక్యుమెంటరీ చేస్తే బాగుంటుందనే అభిప్రాయానికి వచ్చాము. కాలేజీ నిధుల సేకరణలో భాగంగా సినీ నేపధ్యగాయనీ గాయకుల ప్రోగామ్ అరేంజి చేస్తే ఎక్కువ నిధులు రావటానికి అవకాశాలున్నవని భావించాం. నేనూ పామర్తి మదరాసులో శ్రీ ఘంటశాల వెంకటేశ్వరరావుగారితో సంప్రదించటం జరిగింది. వారి సలహామీద బొంబాయిలో హిందీ నేపథ్యగాయకులైన మహమ్మద్ రఫీగారికి ఘంటసాల ఒకలెటర్ వ్రాసి ఇచ్చారు. ఆ కాలంలో మహమ్మద్ రఫీ, కిశోర్ కుమార్, మన్నాడే అంటే దేశవ్యాప్తంగా ప్రేక్షకులలో ఆదరణ వున్నది. మనము ఎక్కువ కృషి చేయకుండానే కలెక్షన్స్ రావటానికి అవకాశముందని మదరాసులో సినీ ప్రముఖులు, మనకు కావలసిన వారు సలహా ఇచ్చారు. ఆ సలహాను అమ్మతో ప్రస్తావించగా బొంబాయి నన్ను, పామర్తి గారిని వెళ్లి రమ్మని అమ్మ ఆదేశించింది. ఆ ఆదేశానుసారం ఇద్దరం బొంబాయి వెళ్ళి అక్కడ సినీప్రముఖుల ఫోను నెంబర్లు ఏవీ ఆ డైరెక్టరీలో దొరకనందున పామర్తి గారైన స్నేహితుడు హిందీ నేపథ్యగాయకుడు అయిన మన్నాడే గారిని కలిసాము. శ్రీమన్నాడే క్లాసికల్ సింగర్ మంచి పేరు ప్రతిష్ఠలు వున్నవారు. ఆయన బెంగాలి. ఆయన భార్య మలయాళి. ఆయన సహాయంతో మహమ్మద్ రఫీని ఎట్టకేలకు, అతికష్టం మీద కలిసాము. మహమ్మద్ రఫి, ఘంటశాల ఆయనకు పర్సనల్ లెటర్ వ్రాసినందుకు ఆశ్చర్యపోయాడు. సరే ఆయనకు అమ్మ ఆంగ్లసాహిత్యము, ఫోటోలు, కుంకుమ ఫొటోలు ప్రసాదంగా యిచ్చాము. ఈ కాలేజి స్థాపనకు దాదాపు 12 లక్షల రూపాయిలు సహాయం కావలసి వస్తుందని అర్థించాము. మాకు మదరాసు, హైదరాబాద్, విశాఖపట్నం, గుంటూరు లేక విజయవాడ సెంటర్స్‌లో ఏ మూడు సెంటర్లయిన పర్‌ఫారెమెన్స్ కావాలని అడిగాము. దానికి ఆయన ఒప్పుకొని మోస్ట్

కన్‌సెషన్‌గా పారితోషికము ఆయనకు 15 వేల రూపాయలు, ఆర్కెస్ట్రా 30 మంది వుంటారని వారికి ఇవ్వవలసినది వారికి ఇవ్వాలనీ, అందరిని 1వ క్లాసులో గాని, విమానంలో గాని తీసికెళ్ళి వారిని ఫైవ్ స్టార్ హోటల్సులో దింపి వారికి కావలసిన వసతులన్నీ చూడవలసిందని చెప్పారు. దానికి మనం ఒప్పుకుంటే 50% పైకము అడ్వాన్సుగా యివ్వవలసిందని, ఈ ఫెర్‌ఫార్‌మెన్స్‌కు కావలసిన ఆడిటోరియమ్స్, పోలీసు ప్రొటెక్షన్ ఏర్పాటు. టికెట్టు వసూళ్ళు అన్నీ మీరే చూసుకోవాలనీ చెప్పారు. వీటిని మనం ఒప్పుకున్నట్లుగా అగ్రిమెంటు అయితే డేట్స్ యిస్తామన్నారు. సరే మేము వెళ్లి మేనేజ్‌మెంటు వారితో సంప్రదించి మీకు తెలియ చేస్తామని వచ్చాము. ఆయన కంటె యావత్ప్రపంచంలో పాపులర్ అయిన కిశోర్‌కుమార్‌ను కలిసాము. ఆయన మన్నాడే పంపారు. కాబట్టి 3 సెంటర్లకు 55 వేల రూపాయిలు, 60 మంది ఆర్కెస్ట్రా వుంటారని, మిగతావన్ని పైన చెప్పిన కండిషన్సుతో 50% అడ్వాన్సుతో అగ్రిమెంటు అయితే డేట్స్ యిస్తానని చెప్పారు. వీళ్లిద్దరినీ కలిసిన తర్వాత మాకు తేళ్ళు జర్లు ఒంటిపై పాకినంతపనైంది. నిజంగా ఇవన్నీ చేయగలిగితే 12 లక్షలురావటం అంత కష్టమేమీ కాదు. కాని ఇవన్నీ ఏర్పరచటం అంత తేలిక కాదు. అంత డబ్బు మన దగ్గరుంటే బొంబాయి దాకా వెళ్ళే వాళ్ళమే కాదు. మన ఆర్థిక పరిస్థితి గూర్చి మన్నాడేతో చెప్పాము. ఆయనన్నారు. కావలనంటే నేను మీకు ఫ్రీగా పెరఫార్‌మెన్స్ యిస్తాను. 12 మంది ఆర్కెస్ట్రా ఉంటారు. మిగతావన్నీ మామూలే అన్నారు. ఆయనకు రూ.500/– టోకెన్ అడ్వాన్సుగా అమ్మ ప్రసాదంగా యిచ్చి మీకు మరల తెలియపరుస్తామని ఇంటికి చేరాము. అక్కడ నుండి జిల్లెళ్ళమూడి వెళ్లిన తర్వాత నేనుహైదరాబాదు వెళ్లి మన సోదరుడు టి.యస్.శాస్త్రి గారింట్లో సమావేశం ఏర్పరిచాము. డాక్టర్ శ్రీపాద, ప్రసాదరావు గారు, యు.యమ్.రావుగారు, జి.కె.రావు, వెంకటకృష్ణ, రాధ ప్రభృతులతో నా బొంబాయి పర్యటన గూర్చి ప్రస్తావించాను. చివరకు ఒక సావనీర్ వేసి అడ్వర్‌టైజ్‌మెంట్సు వసూలు చేసి ఆపైకముతోనే ప్రారంభించ టానికి నిర్ణయం జరిగింది. వారు సావనీరు అమ్మచే ఆవిష్కరింప చేయించి వచ్చిన పైకము సుమారు17 వేల రూపాయిలతో కాలేజీ ప్రారంభింపపడింది. నేను ఎప్పుడు మద్రాసు వెళ్లినా మా బావగారైన బందా వెంకటేశ్వర్లుగారింట్లో దిగటం నా కలవాటు. అట్లాగే బొంబాయి నుంచి వచ్చినప్పుడు వారింట్లో నే దిగాను. మా సిస్టర్‌నన్ను ఏరా ? మాకు తెలియకుండానే మీ అమ్మాయి పెండ్లి చేసేస్తున్నావా ? అని అడిగింది. మా అమ్మాయి పెండ్లి ఏమిటి ? అది చిన్నపిల్ల దానికేమి పెండ్లి అన్నాను. కాదురా మాకు తెలిసిందిలే అన్నది. నేను

జిల్లెళ్ళమూడి చేరాను అమ్మ దగ్గరకు. అమ్మ పాదములకు వెళ్లి నమస్కారం చేశాను. అమ్మ "ఏరా ! నీకోసమే ఎదురుచూస్తున్నాము. అన్నంరాజు రామకృష్ణారావుగారు వారి పినతండ్రి మాధవరావు బాపట్లకు వెళ్ళినప్పుడు బాపట్లలో మీ ఇంటికి వెళ్ళారట. వెళ్లినపుడు వారు మీ అమ్మాయి వరలక్ష్మిని చూచారట. మీ అమ్మాయి వారికి చూపిన ఆదరణకు ముగ్ధులై ఈ అమ్మాయి మా ఇంటి కోడలు కావాలని వారు నిశ్చయించుకొని నాతో, రామకృష్ణతో ఈ ప్రస్తావన చేశారు. గోపాల్ బొంబాయి నుండి రాగానే ఒక మాట వాడికి చెప్పి నిశ్చయం చేద్దాంలే అన్నాను అన్నది" అమ్మ. ఈ విషయం మీ ఇంట్లో కూడా ప్రస్తావన చేసి మీ నాన్నగారిని ఒకసారి జిల్లెళ్ళమూడి రమ్మనమని చెప్పు అన్నది. అట్లాగే వాళ్లు జిల్లెళ్ళమూడి వచ్చారు. అమ్మ గదిలో సమావేశం జరిగింది. మాధవరావు గారు "అమ్మా! మాకు కట్నాలు అక్కరలేదు. పెండ్లి ఘనంగా జిల్లెళ్ళమూడిలో చేస్తే సరి" అన్నారు. దానికి మా నాన్నగారు "అమ్మా ! పెండ్లి చేయటానికి కావలసిన పైకము ఇప్పటికిప్పుడే సమకూర్చటం కష్టం. పొలాలు అమ్మకానికి పెట్టినా వెంటనే సరైనా ధర పలకటం కష్టం" అన్నారు. దానికి రామకృష్ణ "అమ్మా ! ఆ ఆర్థిక వసతి మేము ఎట్లాగో చూచుకుంటాము కాని ఇది వర్షాకాలము. వాన లేకుండా నీవు చెయ్యమ్మా !" అని అన్నాడు. అమ్మ "సరే డబ్బు సంగతి నీవు చూడు వాన సంగతి నేను చూచుకుంటాను" అన్నది. అప్పుడు లగ్నం అమ్మే నిర్ణయించింది. నిశ్చయ తాంబూలాలు పుచ్చుకోవటం జరిగింది. ఒకవారం రోజులలోనే పెండ్లి. రామకృష్ణ అప్పికట్ల వెళ్ళి డబ్బు ఏర్పాట్లు చేసాడు. పెండ్లి శుభలేఖలు ప్రింటు అయ్యాయి. పెండ్లి ఆహ్వానము మాతృశ్రీ పత్రికలో కూడా అచ్చువేశాను. 71లో శ్రీ విశ్వజననీపరిషత్ ప్రారంభించి మొదటి ఆర్గనైజింగ్ సెక్రటరీగా బాధ్యతలు తీసికున్న క్రొత్తలు, అప్పటికే 8 సంవత్సరాల నుండి అమ్మ సేవలో అతి క్లోజ్ క్వార్టర్స్‌లో వుండే వ్యక్తిగా అమ్మచే ఎన్నిక చేయబడిన వారిలో నేను ఒకడిని. అన్నంరాజు వారిది పెద్ద కుటుంబము. ఎక్కువ బలగం వున్నవాళ్లు. పెండ్లి ఏర్పాట్లు జరగడం ప్రారంభమయ్యాయి. ఆ పెండ్లికి వెయ్యి మందికి తగ్గ కుండా సోదరీసోదరులు వచ్చారు. అమ్మే స్వయంగా జరిపించే ఈ పెండ్లికి లోటు ఏముంటుంది? అన్నపూర్ణాలయ కళ్యాణవేదికపై జరిపించిన ఈ కళ్యాణం అతి శోభాయమానంగా వుంది. పెండ్లి జరిగింది. అందరూ భోజనాలు చేస్తున్నారు. ఆకాశంలో మబ్బులు క్రమ్మినవి. చల్లటి గాలి. నాకు భయం వేసింది. నేరుగా నేను వాత్సల్యాలయానికి వెళ్ళి చూచాను. ఆశ్చర్యం జిల్లెళ్ళమూడి ఒకగొడుగు క్రింద వున్నది. చుట్టూ జమ్ములపాలెం, 7వ మైలు, రేటూరు, అప్పికట్ల, ఒకటేమిటి

1 1/2 మైళ్ళ వ్యాసార్థంతో జిల్లెళ్ళమూడి గొడుగు చేత కప్పబడింది. చుట్టూ వర్షం, మేడ పై నుంచి క్రిందకు వచ్చాను అందరి భోజనాలై మొదట బ్యాచి చేతులు కడుక్కుంటున్నారు. అంతే భోరున వర్షం అరగంటసేపు ఊపిరాడకుండా కురిసింది. అమ్మ దగ్గరకు వెళ్ళాను. అమ్మ అంది చూచారా పెండ్లికి వాన లేకుండా చెయ్యమన్నారు. నా పని నేను చేసాను అని. అమ్మకు ప్రకృతిని కూడా శాసించే దివ్యత్వము ప్రకటింపబడింది. అమ్మగా తన బిడ్డలను, దైవంగా తన భక్తులను ఎట్లా కాపాడుతుందో ఇది ఒక చిన్న సన్నివేశం మాత్రమే. ఇక రామకృష్ణ తెచ్చిన పైకమును తర్వాత రెండు ఎకరాలు పొలం అమ్మి తీర్చివేశాము. అది వేరే విషయము. నా ఆప్‌సెన్స్‌లో కూడా తీసికొన్న నిర్ణయానికి దైవం ఎట్లా బాధ్యత వహిస్తాడో సున్నితంగా చూడవచ్చు.

- జులై, ***2008***



COURTESY VISWAJANANI TRUST

# శిష్టులు దుష్టులూ అందరూ అమ్మకు బిడ్డలే

జిల్లెళ్ళమూడిలో అమ్మ కాపురానికి వచ్చినప్పుడు మొదటిసారిగా ఆ గ్రామము మున్సిఫ్‌గారైన ఖగ్గా రామయ్య గారింట్లో కాపురం పెట్టారు. తర్వాత కోళ్ళపూడివారింటి దగ్గర, దాని తర్వాత స్వంతయింటికి చేరారు. ఆ రోజుల్లో గ్రామములోని కొంతమందికి అమ్మతో కాలం గడపటం అలవాటుగా ఉండేది. అట్లా అమ్మతో కాలం గడిపిన వారిలో వేల్పూరి చంద్రమ్మ ఒకరు. ఈ మధ్యలో ఒకరోజున మా ఇంటికి వచ్చి అమ్మతో తనకున్న పరిచయం జ్ఞాపకాలను గురించి నాతో ప్రస్తావించడం జరిగింది. ఆ రోజులలో నాన్నగారికి ఆవులు, ఎద్దులు వుండేవని, మంత్రాయి పాలేరుగా వుంటూ వ్యవసాయం చేస్తూ ఇంటిని కాని పెట్టుకొని వుండేవాడని, కనకమ్మ బామ్మ దసరాలలో అమ్మచే కలశం పెట్టించి పూజలు చేయించారని, ఒకరోజున కొబ్బరికాయ కొడితే అది కుళ్ళిపోయిందని, ఆ కుళ్ళిపోయిన దానినే అందరికి చూపించి ఆ కలశానికి నివేదన పెట్టిందని, ఇక కుళ్ళు పోయిందిలే అని దానిని తీసి మళ్ళీ మా అందరికి కొబ్బరి చిప్పలు చూపిస్తే అవి తెల్లగా పాలవలే ఉండేవని చెప్పింది. ఊళ్లో అందరిని వాళ్ళ వాళ్ళ అన్నం వండుకునేటప్పుడు ఒక గుప్పెడు బియ్యం విడిగా పెట్టి వారం రోజుల కొకసారి తెప్పించి ఆ బియ్యం అమ్మకిస్తే అవి పెట్టి గుడి కట్టించుకుందాం అనేది. అట్లాగే కొమ్మూరు డాక్టరుగారు సీతాచలంగారి ఆధ్వర్యంలో గుడికట్టటం ప్రారంభించారు. అప్పుడు రెడ్డి సుబ్బయ్య కూడా అమ్మదగ్గరే వుంటూ ఉండేవాడు. అప్పుడు నాకు పెళ్లయి పొత్తూరు వెళ్ళటం సంభవించింది. అక్కడకు వెళ్ళిం తర్వాత నానాఅగచాట్లు పడుతూ వుండేదాన్ని. నాకు తెలియకుండానే అమ్మ జ్ఞాపకం వచ్చి ఏడ్చేదాన్ని. ఒకసారి అమ్మ మంచం మీద పడుకొని వుంటే ఆ మంచం తీసికెళ్లి మున్సిఫ్ గారింటి గొందిలో పెట్టారు, ఖగ్గా చెంచయ్య వాళ్ళు. ఖగ్గా చెంచయ్య అమ్మకు కత్తి చూపిస్తే "నాన్నా! మీకు ఏమి కావాలి ? మీరు నాకు బిడ్డలు, మీకు ఏమికావాలంటే అవి తీసుకెళ్ళండి" అంది అమ్మ. దానికి వాళ్ళు "నీవే కావాలి" అన్నారు. ఆ మాట అనగానే వారి అన్నదమ్ములు ముగ్గురికి కళ్ళు కనపడలేదు. అప్పుడు వాళ్ళు అమ్మ కాళ్ళమీద పడ్డారు. కాళ్ళమీద పడగానే కళ్ళు కనపడటం మొదలు పెట్టాయట.

ఒక మిషన్ కుట్టే సాహెబ్ అమ్మ దగ్గరకు వచ్చి "అమ్మా నాకు అన్నం పెట్టు" అన్నాడు. అమ్మ మంత్రాయి చేత పెట్టించింది. "మంత్రాయి పెట్టితే

తినను నీవే పెట్టాల"న్నాడు. అమ్మ పెట్టింది. విస్తరి కూడా నీవే తీయమని అన్నాడు. అమ్మ ఇస్తరి తీయబోయింది. అప్పుడు వాడు అమ్మా ! అని అన్నాడు. ఏం నాయనా ! ఏం కావాలి అని అడిగింది. అమ్మా నాకు కళ్ళు కనబడటం లేదు అన్నాడు. అమ్మవాడికి చేయి అందిస్తే అమ్మ చేయి తగలగానే వాడికి కళ్ళు కనపడటం ప్రారంభించినవి. అపుడు వాడు అమ్మా నిన్ను గుర్తించలేకపోయానమ్మా అంటూ ఇంటికి వెళ్ళాడు తర్వాత వాడికి పక్షవాతం వచ్చి చనిపోయాడు అని ముగించింది.

ప్రస్తుతం హైమాలయం వెనుక అమ్మ పూరింట్లో. అమ్మ దగ్గర నేనుండే రోజుల్లో ఒకసారి అమ్మ ఒక ఉదంతం నాకు చెప్పింది. "నాన్నగారు బాపట్ల వెళ్ళారు. ఇంట్లో ఎవ్వరూ లేరు. అమ్మ బయట మంచం మీద పడుకుని ఉన్నదట. మంచం ప్రక్కనే రెడ్డి సుబ్బయ్య పడుకొని నిద్రపోతున్నాడు. అంత రాత్రివేళ అమ్మ పడుకున్నప్పుడు ఒకడు వచ్చి మంచం మీద పడుకున్న అమ్మమీద అమ్మను చెరచడానికి కాబోలు మీద పడుకున్నాడు. అమ్మ దానిని గ్రహించి కుడికాలిని మెల్లగా వెనుకకు తీసి వాడి పొట్టలో కాలు పెట్టి ఒక్క తన్ను తన్నింది. ఆ దెబ్బతో వాడు దూరంలో పడి అమ్మా అంటూ కేకపెట్టి పడ్డాడు. అమ్మ వెంటనే ప్రక్కనే పడుకున్న రెడ్డి సుబ్బయ్యను లేపి మొద్దు నిద్రపోతున్నావు అంటూ వాడిని చూపించింది. వాడి వెంట పడ్డాడు సుబ్బయ్య. కాని వాడు దొరక్కుండా పరిగెత్తాడు" అన్నది.

నాతో ఈ ఉదంతం చెప్పిన కొన్నాళ్ళకు. అమ్మ పూరింట్లోనే వంటింట్లో కూర్చుని నాకు అన్నం పెట్టుతున్నది. ఏవో అనేక విషయాలు చెప్పుకుంటున్నాము. ఇంతలో ఆ వంటయింటిలో నున్న చిన్న కిటికిలో నుంచి నాకు మువ్వల సత్యం కాఫీహోటలు ప్రక్కబాట నుండి నడిచి పోయే ఒకడిని చూపించి ఆ నడిచిపోతున్నాడే వాడేరా నేను నీకు మొన్న చెప్పిన వాడు అంది. ఇద్దరం వంగి ఆ చిన్న కిటికి నుంచి చూస్తూ వాడిమీద నా కున్న కోపంతో నాకు తెలియకుండానే ఓరి లంజకొడకా అన్నాను. అమ్మ వెంటనే "అయితే నీవో" అంది. నాకు కళ్ళు తిరిగి నంత పనైంది. జరిగిన ఉదంతం ఏమిటి? అటువంటి పరిస్థితిలోనూ ఈ విశ్వజననీ తెలిపే ఈ ప్రకటన ఏమిటి ? ఆశ్చర్యంగా అమ్మను చూస్తూ అమ్మ ఒళ్లో వాలిపోయాయి.

నాకు ఇటువంటి పదాలు కొన్ని 'ఊతపదాలు'గా వాడుకలో వుండేవి. ఈ దెబ్బతో అన్నీ ఊడ్చుకొని పోయాయి.

– **అక్టోబర్, 2008**

## "మానవుని మనుగడ నవగ్రహాల మీద కాకుండా రాగ ద్వేషాలనే రెండుగ్రహాల మీదనే ఆధారపడి వుంది"

1972, 1973, 1974లలో అమ్మపై పూర్తి నిడివి డాక్యుమెంటరీ ఫిల్మ్ మన ఆత్మీయులు, శ్రేయోభిలాషుల ఆర్థిక సహకారంతో అనేక కష్టనష్టాల మధ్య పూర్తి చేశాము. ఈ ఫిల్మును అనాలోచన చర్యగా డిస్ట్రిబ్యూటర్సు తగిన అడ్వర్‌టైజ్‌మెంట్ లేకుండా 5 కేంద్రాలలో all of a sudden 1975 మే లో రిలీజ్ చేశారు. అందుచేత అది ఒక commercial flap కావడానికి దోహదబడ్డది. దానికి తోడు 1975 డిసెంబరు 30వ తేదీ అర్థరాత్రి నక్సలైటు మెరుపుదాడి మరోక గొడ్డలిపెట్టుగా ఏర్పడింది. అదే సంవత్సరం మధ్యకాలంలో హైద్రాబాద్ ఉస్మానియా జనరల్ హాస్పిటల్‌లో అపస్మారక స్థితిలో చేరి 20 రోజులుండగా ఆపరేషన్ వద్దు వెంటనే discharge చేసి నెల్లూరు పంపవలసిందిగా అమ్మ డాక్టర్లను ఆదేశించటం వల్ల నేను బయటకు వచ్చాను. మొత్తానికి 1975 సంవత్సరం సంస్థకు మరియు ప్రత్యేకముగా నాకు ఒక Black year గా నిల్చిపోయింది. 1976లో అమ్మ జన్మ దినోత్సవాల సందర్భంగా మదరాసు వెళ్ళటం సంభవించింది. మదరాసు వెళ్ళినప్పుడల్లా మా బావగారైన బందా వెంకటేశ్వర్లు గారింట్లో వుండటం పరిపాటి. ఒకరోజు సాయంత్రంవేళ కాలక్షేపం కొరకు బీచ్‌కి వెళ్దామని బయలుదేరాను. జార్జి టౌన్ వరదాముత్తుయప్పన్ స్ట్రీట్ నుంచి ప్యారిస్ కార్నర్ రామకృష్ణా లంచ్ హోమ్ దగ్గరకు వెళ్తూన్న దారిలో ఒక లాడ్జీలో ఒక ప్రముఖుడైన పామిస్టును ఎమ్.జి.ఆర్.తోను, శివాజిగణేషన్, జెమినీ గణేషన్, కామరాజు నాడార్ మొదలగు ప్రముఖులతో ఉన్న పెద్ద బోర్డు పెట్టి వుంది. దాన్ని చూడంగానే ఆ పామిస్టును కన్సల్టు చేద్దామా అని అనిపించింది. లోపలికి వెళ్ళాను. గదిలో విభూతి రేఖలు ధరించి పెద్దబొట్టు పెట్టుకొని వున్న ఆయనను చూచాను. చాలా మంది అక్కడ వెయిట్ చేస్తున్నారు. అందరు వెళ్ళిన తర్వాత ఆయిన దగ్గరకు వెళ్ళాను. ఆయన నా చెయ్యి తీసుకొని పరీక్షగా చూచి ప్రస్తుతం నేను ఎదుర్కొంటున్న సమస్యలకు పరిష్కారంగా ఒక మహాశక్తి నీ అండన

వుండి కాపాడుతున్నదని, చలనచిత్రంకు చేసిన అప్పు మొత్తం తీరుతుందని గ్రహబలం బాగుండలేదని కనక పుష్యరాగం రాయితో ఉంగరం చేయించుకొని పెట్టుకోమని సలహా చెప్పాడు. అట్లాగే తర్వాత ఆ ఉంగరం ధరించటం జరిగింది. తర్వాత కొన్నాళ్లికి ఒక జ్యోతిష్కుడు పగడాల రాయితో ఉంగరం పెట్టుకోమని సలహా ఇచ్చాడు. సరే పెట్టుకున్నాను. 1992లో జరిగిన ఉదంతం సంస్థాపరంగా నాపై జరిగిన దాడి అనంతరం ఒకేసారి నవరత్నాలతో వుంగరం చేయించుకొని పెట్టుకుంటే అన్నీ సమస్యలకు పరిష్కారం జరుగుతుందని, నవరత్నాల ఉంగరం మీద మోజు పుట్టింది. సరే బంగారం కొట్లో 2000 రూపాయలు అడ్వాన్సు యిచ్చి చెయ్యమన్నాను.

ఖాజీపాలెంలో లక్ష్మీనృసింహస్వామి ఉపాసకులు శ్రీ కౌతా నరసింహమూర్తిగారు మా ఫ్యామిలీ మెంబర్స్ అందరికి గురుతుల్యులు. ఆయన మాటంటే వాళ్ళందరికి వేదవాక్కే. నేను 1992 తర్వాత బాపట్లలో వుంటూ వుండగా ఖాజీపాలెం ఎక్కువగా పోవటం ఆ స్వామి వారితో పరిచయం ఎక్కువైంది. ఆయన నన్ను ఎంతో ప్రేమగా గౌరవంగా చూచేవాడు. ఒకరోజున ఆయనతో ఈ నవరత్నాల ఉంగరాన్ని గురించి చెప్పాను. అడ్వాన్సు యిచ్చి ఆర్డరిచ్చానని ఒక 10 రోజులో ఉంగరం వస్తుందని చెప్పాను. వెంటనే ఆయన ఆ ఉంగరం ఆర్డరు కాన్సిల్ చేయ్యండని మీకు ఈ నవరత్నాలతో పనిలేదు మీకున్న రెండు వుంగరాలు చాలని చెప్పారు. నేను చాలా నిరాశకు లోనైనాను. ఇంత మోజుగా వుంగరం చేయించుకుందాం అనుకుంటే ఇదేమిటి ఇట్లా జరిగిందని విచారించాను. సరే ఆర్డరు కాన్సిల్ చేశాను. తర్వాత ఒకరోజు ఖాజీపాలెం వస్తున్నాను బస్సులో ప్రయాణం చేస్తున్నాను. దారిలో ఒక మెరుపులాగా ఒక ఆలోచన మనస్సుకు తట్టింది. మానవుని మనుగడ నవగ్రహాల మీద కాకుండా రాగద్వేషాలనే రెండు గ్రహాల మీదే ఆధారపడి వుంది అనే అమ్మ సూక్తి జ్ఞాపకానికి వచ్చింది. మనస్సుకు స్పష్టత చిక్కింది. ఖాజాపాలెం చేరాను. స్వామివారిని కలిసాను. మాటల సందర్భంగా ఆయనతో ఈ ప్రస్తావన తెచ్చాను. ఆయన మీరెప్పుడూ అమ్మ thought తోనే ఉంటారు కాబట్టి మీకు ఈ ఆలోచన కల్గింది అన్నారు.

అవును నిజమేకదా. అమ్మమాట వరాలమూట.

*– నవంబర్, 2008*

# అవగతము కావు తల్లీ

1975 డిశంబరు 30 అర్ధరాత్రి అమ్మ వుంటున్న ఇంటిమీద నక్సలైటు దాడి తర్వాత పోలీసు ఇన్వెస్టుగేషన్ ప్రారంభమయ్యాయి. అమ్మ అప్పుడు నాన్నగారింట్లో వుండేది. ఒకరోజు కర్నూలు నుండి ఇన్‌వెస్టిగేషన్ కొరకు నక్సలైట్ స్పెషల్ డి.యస్.పి. జోసెఫ్ అనువారు జిల్లెళ్ళమూడి వచ్చారు. అంతవరకు ఈ దాడి నక్సలైట్సు ముసుగులో స్టూవర్ట్‌పురం దొంగలు చేసారేమో అని ఇన్‌వెస్ట్‌గేషన్ ప్రారంభించారు. అనుమానస్థులైన 12 మంది యువకులను బాపట్ల సబ్‌జైలులో పెట్టి వాళ్ళను గుర్తుపట్టటానికి నన్ను జైలుకు తీసి కెళ్ళారు. ఆ పెరేడ్‌లో వారిని నేను చూసి వీరుకాదని చెప్పాను. తర్వాత జోసెఫ్‌గారు వస్తూ నక్సలైట్ ఆల్బం తెచ్చారు. వీరందరు చెఱుకుపల్లిలో పోలీసుస్టేషన్ దోచిన తర్వాత జిల్లెళ్ళమూడి వచ్చి అక్కడ 6 నెలలు ఉండి అక్కడే కాలేజి షెడ్‌లో పడుకుంటూ అన్నపూర్ణాలయంలో భోజనాలు చేస్తూ ఇక్కడ దాడికి ప్లాను చేశారు. ఆ నక్సలైట్స్ ఆల్బంలో అందరిని చూపించారు. నేను కొంతమంది ముఖులను గుర్తించాను. కారణం వీరంతా నాపై బరిశలు ఎత్తినవారే. జోసెఫ్‌గారు అమ్మ దర్శనార్థం అమ్మ గదిలో వచ్చి కూర్చున్నారు. అమ్మ నాన్నగారింట్లో గదిలో మంచం మీద కూర్చున్నది. మేమంతా ఎదురుగా చాపమీద వారితో పాటు కూర్చున్నాము. ఆయన అమ్మతో అనేక విషయాలను గూర్చి మాట్లాడుతున్నారు. అమ్మ ఆయనతో మాట్లాడుతూనే తన పాదాలకు పూజచేసిన పూలల్లోంచి ఒక ఎర్రమందార పుష్పాన్ని చేతుల్లోకి తీసుకొని ఒక్కొక్క పువ్వు రేకును తీసి, తన పాదాలపై వేసుకుంటున్నది. అట్లా వరుసగా ఐదు పూరేకులను విరిచి పాదాలమీద వేసుకొని మిగతా పూవును అట్లాగే క్రిందకు వదిలేసింది. ఆ మిగతా పూవును వదిలేసేటప్పుడు ఆ డి.యస్.పి.గారు అమ్మతో అమ్మా ఆ 6వ రేకును కూడా విరిచేసెయ్యి అని అమ్మ చర్యలను పరిశీలనగా చూస్తూ అన్నాడు. ఆ 5 రేకు లేమిటి? ఈ 6వ రేకేమిటో నాకు అర్థం కాలేదు. తర్వాత కొంతకాలమైన తర్వాత జిల్లెళ్ళమూడిలో దాడిచేసిన ప్రముఖులైన 5 గురిని ఎన్‌కౌంటర్‌గా చంపివేశారని పేపర్లలో న్యూస్ వచ్చింది. కాని ఇంకొక ప్రముఖుడు తప్పించుకొని బ్రతికే ఉన్నాడని విషయం వార్తలలో తెలిసింది. అప్పటికి గాని ఆ డి.యస్.పి. ఆ 6వరేకును కూడా విరిచేసెయ్యి అమ్మా! అని అమ్మను కోరిన కోరిక వివరం నాకు అర్థం కాలేదు. అమ్మచర్యలలోని అంతరార్థం తెలియటం అంత తేలికకాదుగా.

*– డిసెంబర్, 2008*

# చంపకాశోక పున్నాగ సౌగంధిక లసత్కచా

సుమారు 1971-72 సంవత్సరాలలో జిల్లెళ్ళమూడిలో అమ్మ వాత్సల్యాలయం హాలులో పరివేష్టించి విశాల జనబాహుళ్యమునకు దర్శనం ప్రసాదిస్తున్నది. ఆ సమయంలో బి.ఎ. చంద్రన్ అనే సోదరుడు క్రొత్తగా గుడియాత్తం నుండి ఆయన స్నేహితులతో వచ్చి అమ్మకు నమస్కరించి కూర్చున్నాడు. ఆయన అమ్మతో అమ్మా ! మిమ్ములను తిరుపతిలో చూడటం మళ్ళీ యిప్పుడే చూస్తున్నాను అని అన్నాడు. అమ్మ "నన్ను నీవు తిరుపతిలో చూడటం ఏమిటి నాయనా ! నేను ఇంతవరకు తిరుపతి రాలేదు. ఎక్కడకు వెళ్ళటం నాకు అలవాటు లేదు. కావాలంటే ఇక్కడ ఎవరినైనా అడుగు" అన్నది. అంతా అమ్మ ఎక్కడకు పోలేదన్నారు. కాని ఆయన మాత్రం ఎంతకూ ఒప్పుకోలేదు. నేను మిమ్మల్ని తిరుమలలో ఆలయంలో దర్శించాను. నాకు తీర్థం ఇచ్చి ప్రసాదం పెట్టారన్నాడు. అమ్మ సరే నీవు క్రిందకు వెళ్ళి అన్నపూర్ణాలయంలో భోజనం చేసి రమ్మన్నది. అమ్మ దగ్గర సెలవు తీసికొని అన్నపూర్ణాలయంకు వెళ్ళారు. అందరు క్రిందకు వెళ్ళిన తరువాత మెల్లగా అమ్మ దగ్గరకు వెళ్ళి "అమ్మా ! ఆయనకు తిరుపతిలో ఏం ప్రసాదం యిచ్చి వుంటావు ?" అని అన్నాను. అమ్మ "నాదగ్గరేమున్నదిరా షుగరేగా అదే ఇచ్చి వుంటాను" అన్నది. సరే నేను క్రిందకు వెళ్ళి అన్నపూర్ణాలయంలో భోజనం చేస్తున్న ఆ సోదరుని అమ్మ మీకు ఏమి ప్రసాదం తిరుపతిలో ఇచ్చింది అని అడిగాను. అతడు "పంచదార" అని సమాధానం చెప్పాడు.

అట్లాగే అమ్మకు విపరీతంగా తల పార్శ్వం నొప్పి వస్తూ వుండేది. దాంతో చాలా బాధపడేది అమ్మ. దానినే తన పిల్లలైన సుబ్బారావు, హైమ, రవికి కూడా ఈ ఆస్తి పంచింది. ఆ పార్శ్వపు తలనొప్పితో వాళ్ళు తల్లడిల్లేవాళ్ళు. ఆ బాధవర్ణనాతీతం. పాపం వాళ్ళు అట్లాగే భరించేవాళ్ళు.

1963లో రాత్రిపూట అమ్మ సేవలో నేను నిమగ్నమైన రోజుల్లో అమ్మకు ఈ తలనొప్పి ఎక్కువగా వస్తూ వుండేది. అమ్మ పూరింటిలో ఉన్న రోజులవి. అమ్మ ఆ ఇంట్లో వెనుక భాగంలో మంచంమీద పడుకొని వుంటే తల వెనుక క్రిందనే కూర్చొని అమ్మ రెండు కనుబొమ్మల క్రిందిభాగాన్ని కంటి కొలికల నుండి

సన్నగా మెల్లగా ఆ నరాలను రాస్తూ కూర్చుండేవాడిని. అపుడు నా నాసిక కొనలు అమ్మ తల పై మాడు మీద ఆనించి వుండేవి. అమ్మ తల నుండి సంపెంగ, మొగలి సన్నజాజి మొదలగు పూల సుగంధ పరిమళాలు వెదజల్లుతూ వుండేవి. వాటిని ఆఘ్రాణిస్తూ కనుబొమ్మల క్రింద సన్నగా రాస్తూ కూర్చొనేవాడిని. ఒక్కొక్కప్పుడు కళ్ళ ప్రక్కనున్న కణతలని, తలమాడును గట్టిగా వత్తమనేది. వాటిని గట్టిగా వత్తితే అవి spring action ఇస్తూ వుండేవి. అమ్మ శరీరము సుగంధభరితమైన వాసనలు వెదజల్లేది. అమ్మ చీరె కూడా అదే సువాసనలు. అమ్మ ఎక్కడకు కదిలినా ఆ సుగంధ తరంగాలు మనని తాకేవి. కొన్ని కొన్ని ప్రదేశాలలో అమ్మ పూజలు జరుగుతుంటే మధ్యలో ఈ సువాసనలు రావటం, కరెంటు పోవటం, అమ్మకు వేసిన పూలదండల నుండి పూవు క్రిందపడటం మొదలగునవి జరిగినప్పుడు అమ్మ అక్కడకు వచ్చింది అని అందరు అనుకోవటం ఒక ప్రత్యక్ష అనుభవమే.

నాన్నగారు ఏ వింజమూరో తన పనుల మీద పోయినప్పుడు అక్కడ అమ్మ దగ్గర మామూలుగా వచ్చేటువంటి సువాసనలు నాన్నగారు అనుభవించారు. అట్లా వచ్చినపుడు అమ్మ అక్కడకు తనను చూడటానికి వచ్చింది అని అనుకుండేవారు. ఆవిషయం నాతో చాలాసార్లు ప్రస్తావించారు కూడా.

అమ్మ స్నానం చేసిన నీటిని అప్పటి సోదరీ సోదరులు చాలా మంది పట్టుకొని స్నానం చేస్తూ వుండేవారు. ఆ నీటిని సీసాలతో భద్రపరచుకొని తీర్థంగా అనేక సంవత్సరాలు వాడుకొనేవారు. ఆ నీరు గంగా జలంలాగా ఎన్నాళ్ళైనా fresh గా వుండేది.

1956, 57, 58 సంవత్సరాలలో అమ్మ దగ్గరకు వచ్చిన వారికి పుట్టమట్టి ప్రసాదంగా అమ్మ ఇస్తే దానిని సీసాలలో ఇప్పటికీ భద్రపరచుకొని వున్నవారు వున్నారు. ఆ రుచి నేనూ చూచాను. ఆ మన్ను పిప్పరమెంటులాగా వాసనా, రుచిభరితంగా వుండటం అప్పటివారి అనుభవమే. నిజానికి ఆ పుష్పాలకు ఆ రంగు, రుచి, సువాసనలను కూర్చింది అమ్మే కదా !

– జనవరి, ***2009***

# మౌనపూజ

"మరుపేమరణం" అంది అమ్మ. ఏది మరవటం? నిన్న చేసిన భోజనములో కూర, పప్పు, పులుసు, పచ్చడా? ఇంట్లో జరుగుతున్న విషయాలా? ఏవి జ్ఞాపకం పెట్టుకోవాలి? ఏవి మర్చిపోయినా ఫర్వాలేదు అని ఆలోచిస్తే భగవంతుని మరవటం. నా బోటివాడు అమ్మను మరవటం అని నాకు తేలింది. నిజమే. అమ్మ భౌతికంగా కనుమరుగై దాదాపు 23 సంవత్సరాలైంది. నాకు-నిన్న విషయమే ఈ వేళ జ్ఞాపకం వుండదు. బజారు నుండి ఏమైనా తెచ్చుకుందామనుకుంటే కాగితం మీద వ్రాసుకోవాలసిందే. కాగితం మీద వ్రాసుకోకుండా జ్ఞాపకం వుంటుందిలే అని బయటకు వెళ్ళితే ఆ ఐయిటమ్ ఇంటికిరాదు. ఇక ఆ కాగితం ఎక్కడ పెట్టామో జ్ఞాపకం వుంటే అదే పదివేలు. అటువంటి జ్ఞాపకశక్తి హీనుడనైన నాబోటివాడికి అమ్మతో సంబంధం వున్న అన్ని విషయాలు ఇంకా జ్ఞాపకం వుండటం ఒక వరమే. అంటే ఇంతవరకు మరణం లేదన్నమాట.

అక్టోబరు నెల వచ్చింది అంటే ఆ కాలంలో జిల్లెళ్ళమూడిలో జరిగిన దేవీనవరాత్రులు జ్ఞాపకం రావలసిందే. నవరాత్రులువచ్చాయి అంటే జిల్లెళ్ళమూడికి వరదలు రావలసిందే. అది ఒక ద్వీపం అయ్యేది. గుండె లోతు నీళ్ళల్లో దిగి ఈదుకుంటూ పోవలసిందే. 1960 దశకంలో ఒకరోజు బాపట్ల గడియారం సెంటర్లో పూలకొట్టు వద్ద అధరాపురపు శేషగిరిరావు అన్నయ్య తారసిల్లాడు. ఏమండీ జిల్లెళ్ళమూడివస్తారా ? అని అన్నాడు. రాను అని అనలేకపోయాను. కాని అప్పుడు నాకు జిల్లెళ్ళమూడి వెళ్ళే ప్రోగ్రామ్ లేదు. సరే ఆయన అమ్మకు ఒక పెద్దబుట్ట పూలు, దండలు, పండ్లు తీసుకున్నాడు. ఇద్దరం బస్స్టాండుకు వెళ్ళాం. బస్సులు పెదనందిపాడు దాకా పోవటం లేదు. కాని ఏడవ మైలు వరకు నడుస్తున్నాయి. బస్ స్టాండుకు వెళ్ళాం. బస్సుస్టాండులో జిల్లెళ్ళమూడి వెళ్ళేవాళ్ళు నల్గురు తారసిల్లారు. గట్టి పిండాలే. అందరం కలిసి బస్సులో వెళ్ళి 7వ మైలు దగ్గర దిగి నడవడం ప్రారంభించాము. ఈ పూలబుట్టలు 4 దాకా వున్నాయి. అవి ఆ నలుగురు ఎత్తుకున్నారు. కొంతదూరం వెళ్ళేటప్పటికి వరదనీరు ప్రారంభమయ్యింది. వాళ్ళు వచ్చేటప్పుడు ఎండు సొరకాయలు ఆరేంజ్ చేసుకొని వచ్చారు. మా ఇద్దరిని ఆ సొరకాయల మీద పడుకోపెట్టి ఒకరి చేతులు ఒకరు పట్టుకొని వాళ్ళు ఈదుతూ మమ్మల్ని లాక్కెళ్ళారు. మాకు ఈతరాదు. అందుకే ఈ సొరకాయల ఏర్పాటు. జిల్లెళ్ళమూడి చేరాము. కుమారస్వామి మందిరంలో ఈ పూలబుట్టలు పెట్టి అమ్మ దగ్గరకు వెళ్ళాము. అమ్మ దగ్గర కాసేపు గడిపిన

తరువాత అమ్మ స్నానానికి వెళ్ళారు. మేము స్నానం చేసి మందిరంలో జరిగే పూజలో పాల్గొన్నాము. ఆ రోజు విజయదశమి కావటం వల్ల అమ్మ కిరీటం శంఖచక్రాలు త్రిశూలం మొదలగు అలంకారాలేమీ లేకుండా సాదాసీదాగా నవ్వుతూ సింహాసనం మీద కూర్చున్నది. మామూలుగా నవరాత్రులలో దుర్గాష్టమి, మహార్నవమికి అమ్మ కిరీటంతో శంఖచక్రాలు, త్రిశూలం ధరించి తేజోమయంగా, భయంకరంగా, ఎవ్వరూ అమ్మ సమీపంలోకి వెళ్ళడానికి సాహసింపని విధంగా సర్వాభరణ భూషితయై విరాజిల్లేది. ఆ లక్షణం వేరు. ఆ వైభవం వేరు. అటువంటి సమయంలో అమ్మకు పూజలు జరిగేటప్పుడు రాచర్ల అనంతరామయ్య గారు ఖండిక చదివేవారు. అది చదివేంతవరకు భక్తిభావంతో ఊగి పోయ్యేవారు. తర్వాత రాచర్ల లక్ష్మీనారాయణ, అచ్యుతుని రామకృష్ణశర్మగారు అమ్మపై వ్రాసిన అష్టోత్తర శతనామాలు చదువుతుండగా అందరు ఓం ఐం క్లీం హ్రీం శ్రీం అని బీజాక్షరాలు ఏకకంఠంగా పలుకుతూవుంటే అమ్మ ట్రాన్సులోకి వెళ్లి అనేక ముద్రలు భంగిమలతో విరాజిల్లుతుండేది. కొంతమంది పాటలు, దండకాలు చదివేవారు. ఆ వాతావరణము చూడవలసిందే కాని వివరించటానికి వీలులేనిది. మనం వేరొక దివ్యలోకంలో వున్నామా అన్నట్లుగా భావన వుండేది. ఆ దివ్యలోకం నుండి ఇప్పుడు ఈ భువిమీదకు దిగివచ్చి విజయదశమి పూజలో పాల్గొన్నాము. ఆ రోజు పూజ శేషగిరిరావు అన్నయ్యది. శేషగిరిరావు అన్నయ్య ఎప్పుడు ఖద్దరు ధోవతి, కండువా కట్టుకొని వుండేవాడు. ఆయన స్వాతంత్ర్య సమరయోధుడు. సహజంగా ఖద్దరు వేషధారి. ఆ రోజు అమ్మపూజ సమయంలో ఖద్దరు గూడకట్టు కట్టుకొని పైన ఖద్దరు తుండుగుడ్డ వేసికొని అమ్మ పాదాలు వద్ద కూర్చుని అమ్మకు ఇరువైపుల వున్న వెండి దీపపు సెమ్మెలలోని దీపాలు వెలిగించి ఒక వెండిపళ్ళెంలో అమ్మ పాదాలు ఉంచి కాళ్ళు కడిగి మంచి గంధంతో, కుంకుమతో పారాణి పెట్టి అమ్మకు దండలు వేసి ఒక్కొక్క పూవు తీసికొని అమ్మ పాదాలకు పేరుస్తూ ఆ బుట్టెడు పూలతో పూజచేసేవాడు. అది మానసపూజ. సహస్రనామాలు లేవు. అష్టోత్తరం లేదు. దండకాలు లేవు. ఏమీ లేవు.ఆ పూజ జరిగినంతవరకు నిశ్శబ్ద వాతావరణం. చీమ చిటుక్కుమన్నా వినపడుతుంది. ఆ పూజ అయ్యేటప్పటికి ఆయనపైన వేసుకున్న తుండుగుడ్డ తడిసిపోయ్యేది ఆ ఆనందభాష్పాలతో. అది ఒక దివ్య సన్నివేశం. అందులో అన్నీ దాగివున్నవి. పూజకు కావలసింది మనస్సు. ఆ మనస్సును అమ్మ పాదాలపై లయం చేసినప్పుడు ఆ తడిసిపోయింది ఆయన తుండు గుడ్డయేకాదు భక్తితో నిండిన ఆ మనస్సు ఆర్ద్రత. ఆ పూజ తర్వాత హారతి యిచ్చేవాడు. అప్పుడు అందరూ మంగళ హారతులు పాడేవారు. తర్వాత ప్రసాదవినియోగం జరిగేది.

– ఫిబ్రవరి, **2009**

# కోర్కె తీరింది

1983లో అమ్మకు 60 సంవత్సరాలు నిండిన తరుణంలో వజ్రోత్సవాలు జరపాలని నిశ్చయించాము. అప్పుడు అమ్మ పూర్తి నిడివిగల చిత్రము "జిల్లెళ్ళమూడి అమ్మ" 35 మిమి. నగరాలలోని సినిమా హాల్సులో వేసి అక్కడి నుండి సంస్థకు విరాళాలు సేకరించాలని ప్రయత్నాలు చేసాం. అందులో భాగంగా కాకినాడ పట్టణంలో కూడా అమ్మ చిత్రం థియేటర్‌లో చూపించాం. ఆ సందర్భంగా అమ్మ నాకు చెప్పిన మాట ఒకటి జ్ఞాపకం వచ్చింది. కాకినాడకు వెళ్ళి కాకినాడ దగ్గర పెందుర్తిలో పెమ్మరాజు సత్యనారాయణ గారి కుమారుడు శ్రీనివాస్ ఉన్నాడు. వాడిని ఎట్లాగైనా చూచిరండి అని. సరే ఒకరోజు కారులో పెందుర్తి బయలుదేరాము. పెందుర్తి వెళ్ళి అక్కడ ఆయన ఎక్కడ వుండేది వాకబు చేసాం. ఊరంతా తిరిగిన తరువాత ఎట్లాగో మెల్లిగా ఇల్లు కనుకున్నాము. పెమ్మరాజు సత్యనారాయణగారు బాలాత్రిపుర సుందరి ఉపాసకులు. అమ్మ చిన్నతనంలో బాపట్లలో చంద్రమౌళి చిదంబరరావుతాతయ్య వారింటికి ఎక్కువగా వస్తుండేవారు. అమ్మచరిత్రలో ప్రముఖంగా ఈయన గురించి ప్రస్తావించటం జరిగింది. ఈయన కుమారుడు శ్రీనివాస్. అమ్మకు చిన్నప్పటి పరిచయం. ఎందుకో ఆయనమీదకు అమ్మ దృష్టి మళ్ళింది. ఇంతకీ ఆయన ఉండే ఇంట్లో ప్రవేశించగా ఆయన మంచం మీద నుండి లేవలేని పరిస్థితిలో మంచంలో పడి వున్నాడు. ఆయన భార్య పిల్లలు ఆయనను వదిలి పెట్టి వెళ్ళిపోయారుట. ఆ ఇంటి ప్రక్క వాళ్ళు ఆయనకు గొంతులో నీళ్ళు పోస్తున్నారు. అదీ పరిస్థితి మేము వెళ్ళి చూచేటప్పటికి. అమ్మ ఇందుకుగాను ఆయనను చూడటానికి మనని పంపించింది అని అనుకొన్నాము. మేము వెళ్ళి మంచం మీద పడుకొన్న ఆయనతో జిల్లెళ్ళమూడి నుండి అమ్మ పంపగా వచ్చామని చెప్పాము. అమ్మ మిమ్మల్ని చూచి రమ్మన్నారు అన్నాము. అంతే ఆయన ముకుళితహస్తుడై అందరికి నమస్కరించి "ఎంత దయామయి అమ్మ. ఎటువంటి పరిస్థితిలో నన్ను చూడటానికి పంపింది" అంటూ కంటి వెంట నీరు కారుస్తూ ఒక్కసారిగా లేవపోయాడు. మేము లేవవద్దు పడుకోండి అంటూ వుండగా ఆ ప్రక్క ఇంటివాళ్ళు మాకు కుర్చీలు మంచినీళ్ళు ఇచ్చి ఆయన దైన్యమయిన స్థితిని గురించి చెప్పారు. అమ్మ ఆయనకు ఇచ్చిన ప్రసాదం ఆయనకు అందచేసాము. ఆయనకు కుంకుమబొట్టు పెట్టాము. మీ రూపములోనే అమ్మ నన్ను చూడటానికి వచ్చింది అంటూ ఆయన ఎంతో తృప్తిగా ఒక నిట్టూర్పు విడిచాడు. ఆయన ఆనందానికి అంతులేదు. అమ్మకు ఆయన దీనపరిస్థితిని తెలియచేసి తనలో కలుపుకోవలసిందిగా అర్థించానని చెప్పమన్నాడు. ఈ విషయాలను మేము జిల్లెళ్ళమూడి వెళ్ళిన తర్వాత అమ్మకు విన్నవించాను. అంతే ఒక నెలరోజులలో ఆయన పోయినారని తెలిసింది.

– మార్చి, **2009**

# ఆత్మావలోకనము

God is Love. ప్రేమే భగవంతుడు. నిష్కలంకమైన, నిష్కపటమైన, నిష్కామమైన ప్రేమ ఏద్దైతే వుంటుందో, ఎక్కడైతే వుంటుందో అదే భగవంతుడు. అటువంటి ప్రేమ ఒక్క తల్లికే వుంటుంది. అందుకే తల్లిని మించిన దైవం లేదన్నారు. అసలు దేవుడంటే ఎవరు ? ఇంతకీ నేనెవరిని? అనే ఆలోచన అమ్మకు చిన్నప్పుడే కలిగింది. తనను కన్నవారి కంటె తాను కన్నవారి మీదనే ఎక్కువ ప్రేమ ఉంటుంది ?" అన్న అమ్మకు సర్వసృష్టికి తానే అమ్మను అనే భావనతో విశ్వజననియై భాసిల్లింది.

ఒకరోజున తన చిన్నతనంలో బాపట్ల భావనారాయణస్వామి ఆలయానికి వెళ్ళి తిన్నగా గర్భాలయంలో ఒక మూల నిల్చున్నది. అర్చకుడు అమ్మను చూడకుండా తలుపులు వేసి వెళ్ళిపోయాడు. అమ్మ రాజ్యలక్ష్మి అమ్మవారి విగ్రహం దగ్గరకు వెళ్ళి దేవుడంటే విగ్రహాలా ? దేవుడు వేరూ, విగ్రహాలు వేరా ? విగ్రహాలే దేవుడా ? అని ఆలోచించుకుంటూ విగ్రహం కళ్ళకు పెట్టిన డిప్పలను లాగివేసి కన్నుల కోసం చూచింది. కనిపించలేదు. కట్టిన గుడ్డలువిప్పదీసింది. రాయిమాత్రం మిగిలింది. రాతికి పూసిన రంగులు చేతికి జిడ్డుగా తగిలాయి. అమ్మ పిలిచింది. రాయి పలుకలేదు. కదిలించింది. కదల లేదు. ఈ ఆలంకారమేనా దేవుడు ? ఈ సొమ్ములు చేసిన వాడు దేవుడా? ఈ చీరె దేవుడా ? ఈ రాయి చెక్కినవాడు దేవుడా? **వీటన్నింటిని దేవుడనుకొన్నవాడు దేవుడా** ? అని తనలో తాను అనుకొన్నది.

అమ్మ మన్నవలో చింతలతోపుకు వెళ్ళి ఒక చింతచెట్టు ఎక్కింది. ఒక కొమ్మ మీద నిల్చుంది. ఆ కొమ్మ విరిగింది. వెంటనే అమ్మ ప్రక్క కొమ్మ పట్టుకున్నది. ఆ కొమ్మ మీదకు ఎక్కి దాని చిట్ట చివరకు వెళ్ళి ఏమీ పట్టుకొనకుండా అక్కడ నిలబడి గ్రామం నలుదిక్కులా దృష్టి సారించింది. ఈ కొమ్మ యిప్పుడు విరగదేమి ? పైగా ఊరంతా చూపిస్తున్నది. అయితే ఈ కొమ్మ ఊరును చూపిస్తున్నదా ? నేనే చూడగల్గుతున్నానా ? మూడు ఉన్నా మూడూ నేనేగా. చెట్టు వున్నదని గుర్తించింది నేను. మరియొక కొమ్మను ఆధారంగా చేసికొన్నది నేను. చిటారు కొమ్మ ఎక్కింది నేను. ఊరు నలువైపులా చూచింది నేను. **ఇదంతా నేనేనని అనుకొన్నది నేను.**

జిల్లెళ్ళమూడిలో తన స్వర్ణోత్సవ సందర్భం ముందుగా ఒక్కసారిగా లక్షమంది ఒక పంక్తిలో భోజనాలు చేస్తుంటే వాళ్ళను చూడాలని కోరిక అమ్మకు కల్గింది. తన వజ్రోత్సవ శుభవేళ ఆ వూరిలోని పశువులన్నింటిని ఒక చోటికి చేర్చి వాటికి స్నానం చేయించి, పసుపు, కుంకుమ, పూలదండలతో అలంకరించి వాటిని తుష్టిగా, పుష్టిగా, జనపకట్టె, పచ్చిగడ్డి, ఉలవలు మొదలైన వాటిని దాణాగా పెట్టుకుంటూ

తన అవ్యాజ కరుణా కటాక్షవీక్షణంతో తన సహజ వాత్సల్యముతో ఒక్కొక్క దానిని నిమురుతూ తాను పొందిన ఆనందం వర్ణనాతీతం. వాత్సల్యాలయంలో కాకులన్నీ ఒక చోటకు గుంపులు గుంపులుగా వస్తే వాటికి బియ్యం విరజిమ్మేది అమ్మ. అవి ఆ గింజల కోసం ఎగురుతూ ఆ గింజలని తింటుంటే తాను పొందిన ఆనందం చూడవలసిందే. అదే సమయంలో సంవత్సరము, సంవత్సరపు లోపు పసిబిడ్డలను తమ తమ తల్లులు వారికి నూనె రాసి, నలుగు బెట్టి, స్నానాలు చేయించి, వారికి పాల సీసాలు, క్రొత్త బట్టలు, పౌడరు మొదలగు వాటితో అలంకరించి ఒక్కసారిగా ఒక లక్షమంది పిల్లలను గుడ్డఊయెలలలో వేసి ఊపుతూ వాళ్ళను చూచుకుంటూ వుంటే వారందరిని ఒక్కసారిగా తాను చూడాలనే తపనలోని ఆంతర్యం ఏమిటి ? అనే జిజ్ఞాస నాలో కలిగి ఆలోచించగా, ఆలోచించగా నా మెదడులో మెరిసిన మెరుపు.

"నేను మిమ్ములని కని మీ తల్లులకు పెంపుడిచ్చాను" అన్న అమ్మ తను పెంపుడిచ్చిన లక్షల మంది పిల్లలకు తన ఒక్క చేతిమీదుగా అన్నం పెట్టుకొనే దృశ్యం తాను పొందిన ఆనందం, అట్లాగే పశువులు ఒక్కసారిగా ఒక్కచోట దాణా తింటున్నప్పుడు తాను పొందిన అద్భుత ఆనందం, పక్షులు ఎగురుతూ కేరింతల పెట్టుతూ గింజలు తినేటప్పుడు పొందిన ఆనందం, అట్లాగే తల్లులందరు తమ పిల్లలను ఊయ్యాలలో వేసి ఒక్కసారిగా ఒక్కచోట ఊయ్యాలలు ఊపుతూ వారిలో తమను చూచుకుంటూ వారి వారి తల్లులు పొందిన ఆనందం, ఆ పిల్లలు తమ తమ తల్లులలో తమనే చూచుకుంటున్నప్పుడు పొందిన ఆనందం, ఈ ఒక్కతల్లిలో కల్గిన బ్రహ్మానందం. దానికి ఒక్కటే కారణం వారి వారిలో తనను చూచుకోవటమే. తనలో తనను చూచుకుంటున్నప్పుడు పొందే ఆనందం వంటి ఆనందం మరియొకటి వుండదు. ఈ ప్రక్రియ ద్వారా వారికి తెలియకుండానే వారు ఆత్మానుభూతిని పొందుతున్నారు. "ఆత్మావైపుత్ర నామాసి" అన్నట్లుగా. నీ బిడ్డలో నీవు ఏమి చూస్తున్నావో అదే అందరిలో చూడటమే బ్రహ్మస్థితి అన్న బ్రహ్మానందం మనం పొందటము కోసమే ఈ ప్రయోగశాల. ఈ బ్రహ్మానందం ఒక్క ప్రేమతోనే సాధ్యపడుతుంది. అంటే సర్వసృష్టిని తానుగా చూచుకుంటూ తనను తాను ప్రేమించటమే దీని పరమలక్ష్యం. అమ్మ జిల్లెళ్ళమూడిని ఒక ప్రయోగశాలగా ఎన్నుకున్నది అనిపిస్తున్నది. ఈ ప్రయోగం ఉపన్యాసాలతో, ఉపదేశాలతో జరిగేది కాదు. అందుకే అమ్మ ఉపన్యాసాలు చేయలేదు. ఉపదేశాలు లేవు. ప్రయోగశాలకు ఒక ప్రయోజనం వుండి వుండాలి. ఏమిటి ప్రయోజనం ? ప్రేమ ప్రయోగం. ఇక్కడకు వచ్చే వారిలో 90 ఏండ్లు గడ్డాల తాతలు కూడా అమ్మకు అడ్డాల పసిపాపలే.

ఈ ఆవరణలో మెలిగే వాళ్ళంతా అక్కయ్యలు, అన్నయ్యలుగా పిలువబడుతారు. అంటే అంతా తన వాళ్ళే అనే అర్థం. తను మూలమ్ ఇదం జగత్ అన్నది అమ్మ. అంతటికీ ఈ జగత్‌లో తనే మూలం అని అర్థం. ఏదైనా తన కోసమే చేస్తారు, ప్రేమించినా, ద్వేషించినా. ద్వేషానికి మూలం ప్రేమే. ఈ ప్రయోగశాలలో ద్వేషానికి తావు లేదు. కారణం తనను తాను ద్వేషించుకోరు కనుక, ఉన్నదంతా ప్రేమే. నీకున్నది నీవు తృప్తిగా తిని ఇతరులకు ఆదరణగా పెట్టుకో అన్నది అమ్మ. పెట్టుకో అనటంలో ఆ పెట్టటం నీ కోసమే. నీ తృప్తి కోసమే అని అర్థం. తల్లికి తప్పే కనపడదు అన్నది అమ్మ. ఎందుకు కనపడదు? తనకు వేరే అనేది లేదు కాబట్టి. ఈ ప్రయోగశాలలో వున్నవారు ఇదంతా నాదే. ఇందంతా నేనే అనే స్ఫురణతో సాధన చెయ్యాలి అని. సాధ్యమైనదే సాధన అయినా ప్రయత్నం చెయ్యటంలో తప్పు లేదు. యాగాలు చేస్తున్నారు. యోగాలు చేస్తున్నారు. తపస్సు చేస్తున్నారు. ఇటువంటి అనేక సాధనలు చేస్తున్నారు. వాడు వేరే వున్నాడు అనుకుంటే దానికి వాడి కరుణ కావాలి. ఆశ్చర్యకరవాసిని. అర్కపురవాసిని అయిన అమ్మ సాన్నిధ్యంలో ఈ ప్రేమ ప్రయోగం ఈ ప్రయోగశాలలో చేసి చూడండి. కృష్ణావతారంలో కృష్ణుడు ఈ పంథానే అనుసరించాడు. కృష్ణావతారం ప్రేమావతారమే. రాధాకృష్ణుల ప్రేమ ప్రత్యేకంగా చెప్పతగింది. రాధాకృష్ణుల ప్రేమ సామాన్యంగా అనుకుండే కామప్రవృత్తి కలిగించింది కాదు. "కృష్ణస్య హృదయం రాధా! రాధాయా హృదయం హరిః" కృష్ణుని హృదయమే రాధ. రాధ హృదయమే కృష్ణుడు. కృష్ణుడు పరమాత్మ అయితే రాధ జీవాత్మ. రాధాకృష్ణుల కలయిక జీవాత్మ పరమాత్మల అనుసంధానమే. ఈ రెండూ వేరు వేరు కాదు. అయితే కృష్ణావతారంలో ఈ ఘట్టము, ప్రేయసీ ప్రియులకు సంబంధించినట్లుగా కనబడుతున్నది. ఈ అవతారాన్ని ఎవరైనా పొరపడటానికి అవకాశమున్నది గాని, అమ్మ అవతరించటమే తల్లిగా, తొలిగా అవతరించింది. ఈ సర్వసృష్టికీ తల్లిని నేనే అని ప్రకటించింది. నేను అమ్మను మీరు బిడ్డలు అంది. అంతేకాదు మీరు నాకు అవయవాలు అంది. అంతేకాదు మీరు కానిది నేను ఏది కాదు అంది. మీరు నాలోనే పుట్టి, నాలోనే పెరిగి, నాలోనే లీనమౌతారు అంది. అటువంటి మాతృప్రేమ కృష్ణావతారంలోని ప్రేమకంటే విశిష్టతగా తల్లి ప్రేమే అయి వున్నది. ఈ ప్రేమావతారంలోని బిడ్డలుగా యున్న మనకు ప్రేమ తప్ప ఇంకేముంటుంది. తరచి ఆలోచించండి. **తరించండి, ప్రేమమూర్తులుగా జీవించుదాము.**

*(**13.1.09** భోగిరోజున జిల్లెళ్ళమూడిలో జరిగిన దోలోత్సవ సందర్భంగా నేను పొందిన అనుభూతి ఈ వ్యాసానికి మూలం)* *- ఏప్రియల్, **2009***

# నీ చరణాలు నే విడువనమ్మా!

త్వదన్యః పాణిభ్యా మభయ వరదో దైవతగణః
త్వమేకా నైవాసి ప్రకటిత వరాభీత్యభినయా
భయాత్త్రాతుం దాతుం ఫలమపిచ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవహి చరణౌ వేవ నిపుణౌ.

తా॥ భగవతీ ! లోకశరణ్యా ! నీ కంటే యితరులైన ఇంద్రాదులైన దేవతాగణం తమ హస్తాలలో అభయవరద ముద్రలను ధరించి ఉన్నారు. నువ్వు మాత్రం హస్తాలచేత వెల్లడింపబడిన వరాభయముద్రలను ధరించే దానవు కాదు కదా ! ఎందుకంటే, ఓ అంబా! నీ పాదాలు రెండుమాత్రమే భక్తులను భయం నుంచి రక్షించడానికి, కోరినదానికన్నా అధిక ఫలాన్ని ఒసగటానికి సామర్థ్యము కలవి కదా అని తెలియనవుతుంది. - సౌందర్యలహరి.

అమ్మను ఒకసారి శ్రీ అధరాపురపు శేషగిరిరావు అన్నయ్య మదరాసు తీసికెళ్ళి మెడికల్ చెకప్ చేయిద్దాం అనే తలంపుతో 1962లో అమ్మను, నాన్నగారిని, హైమను, రవిని, డాక్టర్ నారపురాజు శ్రీధరరావుగారిని, బెండపూడి యోగయ్యగారిని, రుక్మిణమ్మ అక్కయ్య మొదలగు వారిని మదరాసు తీసి కెళ్ళారు. అక్కడ డాక్టర్ మోహనరావు మొదలైన డాక్టర్లకు చూపించటం జరిగింది. విజయవాడలో విజయ డిస్ట్రిబ్యూటర్స్ మేనేజరు ధారా సత్యనారాయణ గారు, శేషగిరిరావు అన్నయ్యకు మంచి స్నేహితులు. పొన్నూరు గ్రామాన్నించి వెళ్ళి మద్రాసు భరణి స్టూడియస్‌లో, తర్వాత జెమినీ స్టూడియస్‌లో సౌండ్ ఇంజనీర్‌గా పనిచేసిన కోటేశ్వరరావు కూడా ఆయనకు స్నేహితులే. వారి పరిచయాలతో అమ్మను, వాహిని, విజయా స్టూడియోస్ అధినేత శ్రీనాగిరెడ్డిగారు వారి స్టూడియస్‌కు, బి.ఎన్.కె.ప్రెస్సకు, తీసికెళ్ళి చూపించి వారింట్లో వారి కుటుంబ సమేతముగా పూజచేసుకున్నారు. మదరాసులోనే సినిమా పరిశ్రమకు చెందిన శ్రీ పి.పుల్లయ్య, శాంతకుమారి, లక్ష్మీరాజ్యం, శ్రీధర్, సావిత్రి, జెమినీగణేశన్, కొంగర జగ్గయ్య, ఘంటసాల, పామర్తి, సుసర్ల దక్షిణామూర్తి, సీనియర్ సముద్రాల, కాంచనమాల మొదలగు అనేక సినిమా ప్రముఖులు అమ్మను దర్శించి వారి వారి ఇండ్లకు కూడా కొంత మంది తీసుకెళ్ళి పూజలు చేసుకొన్నారు. అప్పుడే రాజ్యం పిక్చర్సు అధినేత అయిన లక్ష్మీరాజ్యం, శ్రీధర్‌లు అమ్మను గూర్చి సీనియర్ సముద్రాలచే వ్రాయించిన "జననీ శివకామిని" అనే పాటను సుసర్ల దక్షిణామూర్తి సంగీత సారధ్యం వహించగా రికార్డు చేయించి నర్తనశాల సినిమాలో

ఉపయోగించుకున్నారు. దానికి నేషనల్ అవార్డు వచ్చింది. అమ్మను మహాబలిపురం కూడా తీసుకెళ్ళారు. అక్కడ సముద్రపు ఒడ్డున వున్న చిన్న చిన్న దేవాలయాలలో దేవతా విగ్రహాలు లేకుండా వుండేవి. అమ్మ ఆయా దేవాలయాలలోనికి ప్రవేశించి అక్కడే కూర్చుండేది. అమ్మకు అక్కడే పూజలు నిర్వహించారు. మహాబలిపురంలో కారు దిగగానే ఒక వృద్ధురాలు పాలు తీసికొచ్చి అమ్మకు సమర్పించింది. రోజూ అట్లాగనే ఎప్పటినుంచో అమ్మకు పాలు సమర్పించు కుంటున్నానని చెప్పితే ఆశ్చర్యపోవటం అమ్మ చుట్టువున్న పరివారం వంతు అయినది. అట్లా అమ్మ ఎంతమందికి దర్శనం ఇస్తున్నదో మనకు తెలియని విషయము. అమ్మ మహాబలిపురం వెళ్ళిన సందర్భంగా సినీనటి, గాయని అయిన శాంతకుమారి చిన్నికృష్ణుడు మీద పాటలు పాడుతుంటే అమ్మ తన ఒడిలో పడుకొని ఆమె చేత పాటలు పాడించుకొందని మురిసిపోతూ ఆమె నాకు పామర్తికి తన్మయత్వంతో చెప్పింది. అమ్మ మద్రాసు వెళ్ళిన సమయంలోనే శ్రీ జి.వి.సుబ్రహ్మణ్యం అడ్వకేటు Illford Photo film మేనేజరు నారాయణ మైలాపూర్‌లోని ఫోటో స్టూడియో అధినేత కుటుంబరావు గారు కూడా అమ్మను దర్శించారు. ఆ ముగ్గురు ఎక్కువగా జిల్లెళ్ళమూడి వస్తూ వచ్చినప్పుడు వాళ్ళు వాళ్ళ కెమెరాలతో వచ్చి రకరకాల ఫోటోలు తీస్తుండేవారు. ఆ ముగ్గురు రాగానే స్నానాలు చేసి, కెమెరాలు తీసికొని ఉదయం అమ్మను దర్శించి రాత్రి వాళ్ళు మళ్ళీ తిరిగి మదరాసు వెళ్ళేదాకా ఫోటోలు తీస్తూ అమ్మతో సత్కాలక్షేపం చేసేవారు. అప్పటికే బాపట్ల నుండి భాస్కరరావు అనే ఫోటోగ్రాఫర్, చీరాల నుండి డాక్టర్ పొట్లూరి సుబ్బారావు గారు ప్రత్యేకంగా కొన్ని వందల, వేల ఫోటోలు తీశారు. కాని ఎక్కడ అమ్మ అభయ, వరద హస్తాలతో వున్న ఫోటోలను నేను చూడలేదు. ఏ అవతారమూర్తుల ఫోటోలు చూచినా, మహనీయుల ఫోటోలు చూచినా వరద, అభయ ముద్రలతో లేనివారు గాని, వారి ఫోటోలు కాని కనబడవు. చాలామంది అమ్మఫోటోలు వరద, అభయ హస్తాలతో వున్నవి కావాలని అడిగేవారు. అందుకని నాకు అమ్మ వరద, అభయ హస్తాలతో ఉండే ఫోటోలే కావాలని కోరిక ఉండేది. ఒకరోజున అమ్మను అడిగాను. "అమ్మా! అందరు, వరద అభయ హస్తాలతో దర్శనం యిస్తుంటారు గదా! మరి నీవు ఎప్పుడు ఆ అభయహస్తం పెట్టినట్లు నే చూడలేదు. కారణం ఏమిటి ?" అని. అమ్మ" అవేమీ అవసరం లేదులే నాన్నా!" అని నిర్లిప్తంగా సమాధానమిచ్చింది. కాని నాకు కొరత తీరలేదు. ఒకసారి మదరాసు నుండి ఆ సోదరులు ముగ్గురు వాళ్ళ కెమేరాలతో జిల్లెళ్ళమూడి వచ్చారు. నేను వాళ్ళకు నా కోరిక తెలియచేసాను. ఎట్లాగైనా వరద, అభయముద్రలతో అమ్మ ఫోటోలు తీయండి అని. అన్నపూర్ణాలయం డాబా మీద ఉన్న వాళ్ళు అమ్మ చుట్టు పరివేష్ఠించి ఉన్నారు. వారి మధ్యలో ఉన్న అమ్మను క్రింద నేలమీద ఉన్న నేను ఒక్కసారి "అమ్మా !"

అని పెద్దగా కేకపెట్టాను. అమ్మ, క్రింద నున్న నన్ను చూచింది. ఒక్కసారి క్రింద నున్న నేను నా చెయ్యి పైకెత్తి అటూ, ఇటూ ఊపాను. అమ్మ కూడా చేయి పైకెత్తింది. అంతే వాళ్ళు ఫోటోలు తీసేశారు. అటువంటిది మొత్తం మీద, 3, 4 రకాల ఫోటోలు అభయహస్తంతో ఉంటాయేమో తెలియదు.

ఈ మధ్యకాలంలో నేను శ్రీ శంకరాచార్యుల వారి సౌందర్యలహరి పుస్తకం చదవటం జరిగింది. అందులో నేను పైన ఉదహరించిన శ్లోకాన్ని చూచిన తర్వాత అమ్మ అట్లా నిర్లిప్తంగా ఎందుకు సమాధానమిచ్చిందో నాకు అర్థమయింది. అమ్మ పాదాలలోనే అందరి కోర్కెలను తీర్చే వరదముద్ర ! భయాన్ని నివారించే అభయముద్ర నిండి నిబిడీకృతం కావటం వల్ల అమ్మ ప్రత్యేకంగా వరదాభయ ముద్రలు చేతులతో ప్రకటింపవలసిన అవసరం లేదు అని తెలుస్తుంది. అమ్మ పాదాలకు నమస్కారం చేస్తే చాలు. ఆ పాదాల వ్రేళ్ళకు ఎప్పుడూ ఉండే బంగారు ఆభరణాల మీద దేవతామూర్తులు పొదగబడి వున్నాయి. అమ్మను ఆ దేవతామూర్తులను కాళ్ళకు ధరించావేమమ్మా ! అని అడిగితే నా పిల్లలను దగ్గర పెట్టుకున్నాను అని అమ్మ సమాధానము చెప్పటం, అట్లా పెట్టుకోకపోతే నీ దగ్గరలేనట్లా అని అడిగితే **"వాళ్ళందరు కూడా మీకు సోదరులే అని మీకు చెప్పటం కోసం"** అని అమ్మ జవాబు.

ఆ దేవతామూర్తులందరు మీకు కూడా సోదరులే అని అమ్మ ప్రత్యేకంగా మనకు తెలయజేయటంలోని ఆంతర్యం అవలోకిస్తే ప్రతిఅవతారంలోను వారి వారి బృందం తోనే వారు అవతరిస్తారు. రామావతారం అంతే కృష్ణావతారం అంతే. అట్లాగే అమ్మ కూడా తన బృందాన్ని తన వెంట తీసికొచ్చింది. ఆ బృందంలోని వారిమే మనమంతా. అమ్మ విశిష్టమైన ప్రేమ అవతారం. అమ్మగా అవతరించింది. అసలు నేనెవరో నేనే తెలియచేస్తే గాని మీరు నన్ను తెలుసుకోలేరు. అందుకే నేను అమ్మను, మీరు బిడ్డలు అని తెలియచేసింది. అంతేకాదు మీరు నా అవయవాలు అంది. మరి యొక మెట్టుకు పోయి మీరు కానిది నేనేది కాదు అంది. అంతటితో ఊరుకోకుండా "నేను నేనైన నేను. అన్ని నేనులు నేనైన నేను" అంది. ఇంతా అని "మీరు నాలో మానవత్వం చూస్తారు. నేను మీలో దైవత్వాన్ని చూస్తాను" అంది. అదే మాయ, అదే తెర. తెరతీయగరాదా అని త్యాగయ్య కూడా మొరపెట్టు కున్నాడు. ఈ మాయ నుండి తెర తీసికొని బయటకు వచ్చి మనమెవరమో తెలుసుకోవటమే జ్ఞానం. అసలు ఎక్కడ నుండి వచ్చామో అక్కడకు చేరటమే ముక్తి. దానికి ఒకటే మార్గం. అమ్మ చరణాలే మనకు శరణ్యం. శరణాగతి తప్ప మనకు మార్గంలేదు. అందుకే రాజు అన్నాడు "నీ చరణాలు నే విడువనమ్మా" అని.

– *జూన్, 2009*

# అమ్మ - నన్ను చూడాలనే కోరిక

అవి బాపట్ల షరాష్‌బజారులో కంభంపాటి బుచ్చిరామకృష్ణయ్య గారింట్లో అద్దెకుండే రోజులు. ఆ యింటికి బయట చిన్న ప్రహరీగోడ, దానికి గేటు వుండేది. లోపలికి రాగానే వరండా. ఆ వరండాకు దక్షిణభాగంలో మేముండే వాళ్ళం. ఇది దాదాపు 1964లో జరిగిన వృత్తాంతము. ఆ టైంలో ఒకసారి నాకు టైఫాయిడ్ జ్వరం వచ్చి 21 రోజులు గడిచింది. ఆ జ్వరంలో చేసేది ఏమీ లేక, తోచక రామకృష్ణమఠం మద్రాసు వారు ప్రచురించిన వివేకానంద ప్రసంగములు 10 వాల్యూమ్యు 30 రూపాయలకే సెంటినరి సెలబ్రేషన్సుకు కన్సషన్ రేటుకు రాగా కొనుక్కొని చదవటం ప్రారంభించాను. దాదాపు 2 రోజులలో ఒక వాల్యూమ్ చొప్పున చదివేవాడను. డాక్టరు గారు ఇది చూచి అసలే టైఫాయిడ్ జ్వరం అందులో వేదాంతం పుస్తకాలు చదవటమేమిటి అని అనేవారు. నాకు తీరిక అప్పుడే. ఆ బుద్ధిపుట్టింది అప్పుడే. ఆ పుస్తకాలన్నీ చదివిన తరువాత నాకు వివేకానందుడు స్థాపించిన రామకృష్ణ మిషన్ లాంటి సంస్థను మనం కూడా స్థాపించాలని, వివేకానందుడు లాగా అమ్మను, అమ్మ ప్రవచనాలను, అమ్మ దారిచూపిన మానవుడే మాధవుడుగా చేసిన సేవలను దేశం దశదిశల, ప్రాక్ పశ్చిమాలకు వ్యాపింపచేయాలనే భావము నాకు కలిగింది.

అప్పటికే 1962 నుండి అమ్మ జన్మదినోత్సవ సంచికలు వరుసగా ప్రచురించి వీనికి శ్రీకారం చుట్టే ఉన్నాము. ఈ సమయంలో నాకు ఒక కోరిక కలిగింది. నాకు టైఫాయిడ్ జ్వరం తగిలి జిల్లెళ్ళమూడి వెళ్ళలేని పరిస్థితులలో వున్నానుగదా ఒక్కసారి అమ్మ వచ్చి నన్ను చూచి పోకూడదా ?అని. ఆ రోజులలో నేనే రాత్రుల పూట జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మను క్షణమైనా విడువకుండా తెల్లవార్లూ అమ్మదగ్గర వుండి అమ్మకు సేవలు చేసే రోజులు. మాకు అప్పటికే లక్ష్మీ ప్రసాద్ & కో అనే బుక్ షాపుకు యజమానిగా అత్రివాణి ప్రెస్ అనే ప్రెస్‌ను లీజుకు తీసుకొని బాపట్లలో పని చేస్తున్న రోజులు. మా పిన్ని తమ్ముళ్లైన మా మేనమామలు, రుద్రవరపు పార్ధసారధి, వాసుదేవరావు నా దగ్గరే వుంటూ వుండేవారు. వాళ్ళు అట్లా వుంటూ వుండేవారు కాబట్టే నేను షాపు విడిచి జిల్లెళ్ళమూడికి ఎక్కువగా వెళ్ళటానికి వసతి ఏర్పడ్డది. అప్పటికి మాకు మామూలు పుస్తకాలు, స్టేషనరీ కాకుండా హిగ్గిన్‌బాదమ్సు డిస్ట్రిబ్యూటర్స్‌గా, ఫారిన్, బుక్స్, మేగజైన్సు రావటమే

కాకుండా ఆ ప్రాంతంలో నుండే అగ్రికల్చరల్, వెటనరరీ కాలేజీల లైబ్రరీలకు, జిల్లాల, ప్రాంతీయ లైబ్రరీలకు పుస్తకాలు సప్లయి చేస్తూ వుండేవాళ్ళం. అదే కాకుండా బర్మాషెల్ కంపెనీ అగ్రికల్చరల్ కెమికల్సుకు సబ్ డిస్ట్రిబ్యూటర్స్‌గా కూడా వుండేవాళ్ళం. ఆ ప్రాంతంలో ఏకైక బుక్‌షాపు మాది. ఇప్పటికి అప్పటి మా కష్టమర్సు అయిన విద్యార్థులు, అధ్యాపకులు, లాయర్లు, డాక్టర్లు, రైతులు మా సేవలను ఇంతవరకు మర్చిపోలేదు అని చెప్పితే అది అతిశయోక్తి కాదు. గుంటూరు జిల్లాలో మొదటిసారిగా పొలాల తెగుళ్లకు యేరియల్ స్ప్రేయింగ్ విమానం మీద మందు చల్లే ప్రక్రియ రావుసన్సు అధినేత రావుల రాఘవరావు సహాయ సహకారములతో నిర్వహించిన ఘనత మాకు వుంది.

ఇంతలో ఒక రాత్రి దాదాపు 8-30, 9 గంటలకు మా పార్థసారథి, వాసుదేవరావు మా ఇంటికొచ్చి ఆ రోజు జరిగిన వ్యాపార లావాదేవీలను గూర్చి నాతో ముచ్చటిస్తున్నారు. ఆ వరండాలో మా నాన్నగారు, మా పిన్ని అటూ, యిటూ మంచాలు వేసికొని పడుకున్నారు. వారి మధ్యలో నడవటానికి వీలైన దారి వున్నది. ఇంతలో బైట తలుపు చప్పుడైంది. అమ్మ తలుపు తీసుకొని లోపలికి వచ్చిందట. మా నాన్నగారు, పిన్ని మంచాల మీద నుండి లేచి "బాలూ ! అమ్మ వచ్చిందిరా ! లోపలికి వస్తున్నది" అని అన్నారు. నా సంతోషానికే పట్టపగ్గాలు లేవు. మా మేనమామలిద్దరు లేచి నిల్చున్నారు. నా మంచం ప్రక్కగా. నేను కూడా మంచం మీద నుండి లేచీలేవనట్లున్నాను, అమ్మ రాకకై నిరీక్షిస్తూ. ఎంతసేపు చూచినా అమ్మలోపలకు రాలేదు. "నాన్నగారూ ! అమ్మ ఏదండీ" అన్నాను. "అమ్మ లోపలకు వచ్చింది గదరా" అని ఇద్దరూ అన్నారు. మరి అమ్మ ఏది ? మంచం మీద నుండి నేను మెల్లగా దిగి బయటకు వెళ్ళి చూచాను. బయట తలుపుతీసి వున్నవి. ఆ బజారులో జనసంచారం లేదు. నాకు జ్వరం తగ్గి పథ్యం పెట్టిన తరువాత నేను జిల్లెళ్ళమూడికి వెళ్ళి అమ్మతో "అమ్మా ! నేను టైఫాయిడ్ జ్వరంతో 21 రోజులు మంచం మీద పడి వున్నా నీవు నన్ను చూడటానికి రాలేదు గదమ్మా!" అని అతిదీనంగా, బాధతో అన్నాను. "నేనెందుకు రాలేదు" నేను వచ్చాను నిన్ను చూచాను. కావలసి వుంటే మీ నాన్నని, మీ పిన్నిని అడుగు" అంది అమ్మ. అవును నేను కోరుకుంది అమ్మ నన్ను చూడాలని కాని నేను అమ్మను చూడాలనేది కాదుగదా!

"మీరు ఏది కోరుకుంటే అదేఇస్తాను కోరుకోకపోతే మీకు ఏం కావాలో అదేఇస్తాను" అన్నారు గదా అమ్మ.

**- జులై, 2009**

# బందరు సూరికి లాలిపాట

బందరు అనేటప్పటికి బందరు సూరి జ్ఞాపకం రాక తప్పదు. ఆయన అప్యాయత, నగుమోము మన కట్టెదుట నిల్వక మానదు. ఆయన ఎప్పుడూ ఒంటరివాడు కాదు. ఆయనతో పాటు ఒ.వి.జి. సుబ్రహ్మణ్యం, నవకళాప్రసాద్, హెచ్.కృష్ణారావు, లిప్టన్ మాధవరావు, భావనారాయణ నా మదిలో తారట్లాడుతుంటారు. నేను సంస్థ కొరకు విరాళాల సేకరణకు వెళ్ళినపుడు నేను సూరింట్లోనే దిగేవాడిని. వెళ్ళిన పని ఆయనకు చెప్పేవాడిని. అన్నయ్యా ! ఇక్కడ బందరులో ఎంత expect చేస్తున్నావు అనేవాడు. ఏదో 30 వేలు రూపాయిలు అనేవాడిని. సరే ఇక నాకు వదిలేయి. ఇక వెళ్దాం పద అని ఈ మిత్రబృందానికి ఫోన్లు చేసేవాడు అక్కడ నుండి ఇద్దరం బయలుదేరే వాళ్ళం. వసూళ్ళు 20వేలు మాత్రమే అయినా యనుకోండి, అన్నయ్యా ! అమ్మకు ఆ మిగతా రూ.10 వేలు నేనిచ్చి అమ్మ కోరిక తీరుస్తాను అనేవాడు. అంత పని చేసేవాడు.

జనవరి1వ తేదీ వచ్చిందంటే ఈ బందరు బృందం పెద్ద కేక్‌తో పూలు, పూలదండలతో కార్లో దిగినట్టే. అట్లా జనవరి ఫస్టు అమ్మ ఒడిలో సేద తీరేవాళ్ళు. 1974 అమ్మ చైత్రయాత్రలో అందరూ తలా ఒక మోటారు సైకిలు వేసుకొని అమ్మ జండాలు ఆ బైక్‌లకు కట్టు కొని రెండు వరసలతో అమ్మ canvoy కు Pilots లాగా ముందర నడుస్తుంటే ఆ బందరు వీధుల్లో ఏ రాష్ట్ర గవర్నరో, ఏ రాష్ట్రపతియో నగరంలోకి వెళ్ళుతున్నట్లుండేది. అమ్మ బస సూరివాళ్ళింట్లోనే. అమ్మ దర్శనం హిందూకాలేజి గ్రౌండ్సులో. లక్షలమంది పిన్‌డ్రాప్ సైలన్సుగా అమ్మ దర్శనం చేసికొనేవారు. ఎంతటి క్రమశిక్షణ ఎంతటి ఆర్గనైజేషన్ ఎబిలిటి. అమ్మ బందరులో వున్నంత కాలం కలకలమే. రోజూ పండుగయే. ఇక అమ్మ, అమ్మతో వచ్చిన బృందం నాలుగు కార్లు ఒక వేన్ వుండేది. వీరందరికి వసతి, భోజన ఏర్పాట్లు ఈ బందరు బృందమే చూచుకొన్నది. అమ్మ బందరు ట్రిప్ అయిపోయింది. అమ్మే ఇంకో వూరుకు ప్రయాణం. అమ్మను అమ్మతో వచ్చిన సోదరీ సోదరులను సాగనంపటానికి బందరు ఊరి బయట దాకా వచ్చి వీడ్కోలు చెప్పుతున్నారు. ఆ సమయంలో అమ్మను వాళ్ళు వదలలేరు. వాళ్ళను అమ్మ వదలలేదు. ఇది అమ్మకే

పరిమితం గాదు. అమ్మతో వచ్చిన అక్కయ్యలు, అన్నయ్యలు ఒకరి నొకరిని ఆలింగనము చేసికొని బహుబాధా హృదయతప్తులై ఒకరి నొకరు వదలక వదలలేక ఒక్కొక్కరి కనులు సాగరమై వర్షించాయి. ఇక అమ్మ సంగతి చెప్పక్కరలేదు. ముఖము ఎర్రగా కందగడ్డ అయినది. అమ్మ కనుల వెంట రాలే అశ్రుబిందువులు ఆనందము, బాధా మిశ్రమములు. ఆ అన్యోన్య ప్రేమతత్పరత అనుభవించ వలసినది, చూడవలసినదేకాని వ్రాయగలిగినదికాదు.

అమ్మ మనమరాలైన స్వీటీని తన ఏకైక కుమారుడైన దేవీచరణ్‌కు చేసుకొని అమ్మతో బాంధవ్యము పొంది ఈ ఇంటికి వియ్యంకుని హోదాలో ఈ జిల్లెళ్ళమూడికి అడుగు పెట్టిన వేళ ఆ ముఖములో ఉన్న తళతళలు చెప్పనలవి కాదు. ఆ కళ్యాణవేళ సూరీ ! నీవిప్పుడు ఈ ఇంటికి వియ్యంకుడుగా వచ్చావు అన్నాను. దానికి సూరి అన్నయ్యా "నేను ఈ ఇంటికీ అమ్మకూ ఎప్పుడూ సేవకుడునే. నన్ను మీరు బందరు సూరి అంటేనే నా కిష్టం. మీకు ఎప్పుడు బందరు సూరినే అన్నాడు.

ఈ వివాహమైన ఒక సంవత్సర కాలం తర్వాత సూరి అమ్మలో ఐక్యమయ్యాడనే వార్త మాకు చేరింది. నేను, రవి, శేషు, స్వీటీ కారులో బందరు చేరాము. ఫిజికల్ డైరెక్టర్‌గా హిందూకాలేజిలో సూరి స్ఫూర్తితోనే చేస్తున్న లాలా అక్కడే ఉన్నాడు. అందరం కలసి బచ్చుపేటలో సూరి వున్న ఇంటికి చేరాము. సూరి నిద్రపోతున్నట్లే వున్నాడు. ఆ ముఖములో ఆ చిరునగవు, గాంభీర్యం తాండవిస్తూనే యున్నవి. నగరంలోనివారు, కుటుంబ సభ్యులు, శ్రేయోభిలాషులు, బంధువులు, ఆయన లాయరు కనుక బార్ అసోసియేషన్ వారు, పార్టీలు అందరు ఆయన చుట్టూ వున్నారు. ఇంతలో వీనుల విందైన అమ్మ మీద డాక్టర్ శ్రీధరరావు గారు వ్రాసిన లాలిపాట "లాలి శ్రీ మాతృమూర్తీ! అతిలోక సౌందర్య రాజ్యవర్తీ!" అంటూ శ్రావ్యంగా వినపడుతున్నది. ఈ సమయంలో ఈ పాట ఏమిటి ? అని పరికిస్తే అమెరికాలో ఉండి ఇక్కడకు సకాలంలో రాలేక ఈ దారుణ వార్తను విని వారి అమ్మాయిలు రత్నం అనసూయ, హైమ కోరస్‌గా పాడిన ఈ పాట ఇంటర్నెట్ ద్వారా మైక్‌లో వారు అక్కడ పాడుతుండగా ఇక్కడ వినపడేటట్లు ఒక మైక్ ఆయన మీద, ఆయన వింటూ నిద్రపోతున్నట్లుగా అమర్చబడి ఉన్నది. ఆ కోరస్‌ను ఇక్కడ వున్న వారి మూడవ కుమార్తె కామేశ్వరి (కాము) కుమారుడు దేవీచరణ్, భార్య సావిత్రి మొదలగు వారి కుటుంబ సభ్యులంతా వారి గళం కూడా కలిపారు. అది ఒక విచిత్ర సన్నివేశం.

తండ్రిపోయినారని విని విలపించవలసిన ఆ కుటుంబం ఆయన శాశ్వత నిద్రకు జోలపాడుతున్నారు. ఆయనకు ఆయన కుమార్తెలు, ఆయన నిద్రపోయేటప్పుడు ఈ అమ్మ జోలపాట పాడి నిద్దురపుచ్చేవారుట. అందుకే ఈ లాలిపాట. ఈ దృశ్యాన్ని కాంచిన అక్కడ నున్న వారందరకీ కళ్ళల్లో నుంచి వస్తున్న ఆ అశ్రుధారలను, ఆపుదామన్నా ఆపుకోలేకపోయారు.

ఈ సంఘటన ఆ కుటుంబ సభ్యులకు అమ్మ మీద వున్న అచంచలభక్తి విశ్వాసాలకు పరాకాష్ఠ.

అమ్మపాట పాడటానికి శ్రావ్యమైన గొంతులు మనకు వుండవచ్చును గాని,ఆ తరుణంలో తన తండ్రి పోయిన వార్త విని విలపించక ఆయన శాశ్వత నిద్రకు లాలిపాట పాడటం అపూర్వం.

– ఆగష్టు, ***2009***



# పాముల నరస్సయ్య

అది దాదాపు 1984 సంవత్సరం కావచ్చును. అమ్మ అన్నపూర్ణాలయ నిర్వహణకు ఒక కోటి రూపాయలు కార్పస్ ఫండ్ వుంటే నిర్వహకులు తడువుకోకుండా నిశ్చింతగా వుండవచ్చు అని ఒక ఆలోచన చేసి ఒక్కొక్కరి దగ్గర రూ. 5,000/- తక్కువ కాకుండా వసూలుచేస్తే ఎవరికీ పెద్దభారము లేకుండా వుండగలదు, అని నన్ను, ఇంకా కొంతమంది సోదరులను గుంటూరు పంపింది. గుంటూరులో జి.టి.డి.రామచంద్రరావు గారిని మొదటి సారిగా ఈ స్కీము క్రింద కలిశాము. ఆయన వంతుగా రూ. 5000/- చెక్కు ఇచ్చారు. అదే కాకుండా పోలిసెట్టి వారివద్దకు, బొమ్మిడాల వారి వద్దకు ఇంకా పొగాకు కంపెనీల యజమానులవద్దకు మమ్ములను తీసికొని వెళ్ళారు. వాళ్ళు మార్చి ఆఖరులో ఖర్చుపెట్టవలసిన ఫండు అయిపోయినందువలన తర్వాత సంవత్సరం ఇస్తామన్నారు. ఇటువంటి ప్రయత్నంలో భాగంగా అమ్మ వాత్సల్యాలయంలో తన దిండు క్రిందనే ఒక బైండు పుస్తకం పెట్టుకొని తను స్వతంత్రముగా అడుగగలవారి చేత 1116 రూపాయిలు యిచ్చు లాగున ఆ పుస్తకంలో వ్రాయించింది. వచ్చిన వాళ్ళను డొనేషన్ అడగటం అమ్మకు అంత యిష్టం వుండేదికాదేమో. అమ్మ 10 వేలు అప్పుగా యివ్వరా తర్వాత ఇస్తానులే అనేది. అమ్మ 10 వేలైనా 20 వేలైనా అడిగితే యివ్వలేనని ఎవ్వరూ అనలేరు. ఎట్లాగైనా యిస్తారు కాని అమ్మ అప్పుగానే అడిగేది.

అది ఇప్పుడే కాదు. అన్నపూర్ణాలయ భవన నిర్మాణంలోనూ, అందరింటి నిర్మాణంలోనూ తన పిల్లలకు అన్నం పెట్టుకోవటలోను దాని కొరకు అవసరమైతే అప్పు చేయటంలోనూ అమ్మ గర్భతీపి తప్ప అన్యమెరుగదు. "నేను పెట్టుకోకపోతే నేను చిక్కిపోతాను. మీరు తినకపోతే మీరు చిక్కిపోతారు" అన్న అన్నపూర్ణ ఈ తల్లి. ఒకసారి నెల్లూరు 'ఇన్‌కంటాక్స్ ఆఫీసరు దగ్గర మన విశ్వజననీ పరిషత్ అయ్యే అసెస్మెంటుకు ఆడిటర్ లేకుండా నేనే హాజరు కావలసి వచ్చింది. కారణం అది టైమ్‌బార్ అసెస్మెంటు. అడ్జర్నమెంటు యివ్వరు. సరే హాజరైనాను. ఆ నెల్లూరులో ఐ.టి.ఒ.గారు కూడా క్రొత్తగా ఛార్జి తీసికున్నారు. ఆయనకు అక్కడ మనదే మొదటి అసెస్మెంటు. ఎకౌంటు పుస్తకాలన్నీ చూచారు. బాలన్సు షీట్సు చూచారు. మన ఫైలంతా ఆయన దగ్గరే వుంటుంది కనుక ఆయన ఒక చిన్న అనుమానాన్ని వ్యక్తపరిచారు. అప్పటి బ్యాలెన్సు షీటు ప్రకారం మనము 12 లక్షలు అప్పులో వున్నాము. లక్షలలో అప్పులు చేసి అన్నదానం చేయవలసిన

అవసరం వున్నదా ? అని అడిగారు. ఈ అప్పులు 1980 నుండి బ్రాటోవరుగా వస్తున్నది. మన ఆడిట్ లెక్కల ప్రకారం 1971-72 నుండి అన్నపూర్ణాలయ నిర్వహణ జరుగుతూనేయున్నది. ఒకసారి ఇన్‌కంటాక్సు కమీషనర్ శ్రీ రామారావుగారు హైదరాబాద్ నుండి అమ్మను దర్శించటానికి వచ్చారు. అట్లాగే వాసుదేవరావుగారు ఎండోమెంట్సు మినిస్టర్ కూడా మరొకసారి వచ్చారు. వాళ్ళు మన స్టోర్సు చూపమని నన్ను అడిగారు. వెళ్ళి స్టోర్సు చూపించాను. అప్పటి కది రేకుల షెడ్. అందులో 10 రోజులకైనా సరిపడే వస్తువులు లేవు. ఇక్కడకు ఎంతమందైనను రావచ్చును. ఎంతమందైనను పోవచ్చును. ఇద మిత్థమైన నెంబరు తెలియదు. ఎప్పుడొచ్చినా, ఎంతమంది వచ్చినా అన్నంపెడ్తారు. ఇంతవరకు అన్నం లేకుండాపోయిన వారు లేరు. విచారిస్తే ఈ సంస్థకు భోజనం పెట్టటానికి కావలసిన స్థిరచరాస్తులు ఏమీ కనబడలేదు. మరి ఎట్లా నిర్వహిస్తున్నారు? అని అడిగారు. అదే లక్షణమైన ప్రశ్న. ఈ ప్రశ్నకు చెప్పే దీటైన జవాబు లేదు. కారణం ఈ నిర్వహకులకూ తెలియదు. అదే అమ్మ మహిమ. అమ్మ మహిమలు చెయ్యదు. మరి అన్నపూర్ణాలయ నిర్వహణ ఆగదు. వందలమంది, వేలమంది, లక్షలమంది, కోట్లమంది ఇక్కడ అన్నం తింటూనే ఉన్నారు. "నీకున్నది నీవు తృప్తిగా తిని ఇతరులకు ఆదరణగా పెట్టుకో" అంటుంది అమ్మ. ఇక్కడ నేనేమీ పెట్టటంలేదు. మీ అన్నం మీరు తింటున్నారు అంటుంది అమ్మ. కారణం ఇది అందరిల్లు కావటమే. ఈ ఆస్తులు మనవి. ఈ అప్పులు మనవి. దీని బాధ్యతా మనందరిది. లక్షమంది ఒక పంక్తిన భోజనాలు చేసిన పుణ్యభూమి ఇది. మనబాధ్యత మనం తెలుసుకుంటే అమ్మ కోరిన కోటిరూపాయల కార్పస్ ఫండ్, అన్నపూర్ణాలయ భవననిర్మాణానికి కావలసిన ఒకటిన్నర కోట్లు రావటం పెద్ద లెక్కేంకాదు. శ్రీశ్రీశ్రీ విశ్వంజీమహారాజ్ అమ్మ కళ్యాణ దినోత్సవ సందర్భంగా 5.5.09న జిల్లెళ్ళమూడిలో ప్రసంగిస్తూ మీరందరూ కలసి వచ్చినవారిని ఆదరిస్తూ అందరిని ప్రేమిస్తుంటే ఇక్కడ మీరు తలపెట్టిన ప్రాజెక్టులకు, కార్యక్రమాలకు కోట్లు కురిపిస్తుంది అమ్మ. ఇది సత్యం. నేను మీ అందరిని స్వయంగా చూచాను. నాకు చాలా ఆనందం వేసింది అని తన ప్రవచనాన్ని ముగించారు.

ఇంతకీ గుంటూరులో అప్పుడు కార్పస్‌ఫండ్ వసూళ్ళు జరుగలేదు. కారణం అమ్మకు సీరియస్‌గా వున్నదని, వున్నవాళ్ళు వున్నట్లుగా రమ్మనమని జిల్లెళ్ళమూడి నుండి కబురు. రాచర్ల లక్ష్మీనారాయణగారి ఫోను. ఆయన కారులో పోతున్నారట. నీవు వస్తే నిన్ను తీసికొని పోతానని. లక్ష్మీనారాయణగారి కారొచ్చింది. కారు ఎక్కాను. కారు బయలుదేరింది. పెదనందిపాడు మార్గంలో దూసుకొని పోతున్నది. లక్ష్మీనారాయణగారు మొదలు పెట్టారు. గోపాల్! నేను జిల్లెళ్ళమూడి వెళ్ళేటప్పటికి

ఎట్లావుంటానో తెలియదు. కనుక నీకు చెప్పుతున్నాను అని అమ్మకు ఒక వేళ జరుగరానిది జరిగితే జరుగవలసిన ఏర్పాట్లను గూర్చి సవిస్తరంగా నాకు చెప్పటం మొదలు పెట్టాడు. 'అతిస్నేహం దుశ్శంకను సూచిస్తుంది' అని అభిజ్ఞాన శాంకుతలంలో అన్నట్లు స్వామీ ! ఇక ఆపు. నాకు చెప్పబోకు, నీవు ఒళ్ళు తెలియకుండా వుండేవాడవు, నేను తెలిసి వుండేవాడనా? అని గట్టిగా అన్నాను. జిల్లెళ్ళమూడి చేరాం. వాతావరణ మంతా ప్రశాంతంగా వుంది. అమ్మ వాత్సల్యాలయంలో దక్షిణభాగం విశాలమైన ప్రదేశంలో చల్లటి గాలిలో సాయంకాలం మంచంమీద కూర్చుని చక్కగా కబుర్లు చెప్పుతున్నది. ఆ ఆరుబయట ప్రదేశంలో కూర్చొన్న అనేకమంది సోదరీసోదరులు ఆనందిస్తున్నారు. అమ్మను చూచాం. నమస్కరించాం. మేమూ కూర్చుని ఆ కబుర్లలో మునిగిపోయాం.

నెల్లూరులో డాక్టర్ యస్.వి.సుబ్బారావు గారు ప్రముఖవైద్యులు. మనము వాళ్ళింటికి వెళ్తే మనని పలకరించటానికి హాస్పిటల్ నుండి ఇంట్లోకి రావటానికే గగనమయ్యేది. అమ్మ నెల్లూరు వెళ్ళినపుడు వారింటిలోనే బస. అది యొక చిన్న అన్నపూర్ణాలయంగా రూపొందింది అమ్మ అక్కడ వున్న నాళ్ళు. నెల్లూరు వారు పరిసర ప్రాంతాల వారు వేలల్లో అమ్మదర్శనం వారింట్లోనే చేసుకునేవారు. ఆయన అమ్మకు పర్సనల్ ఫిజిషియన్. ఒకసారి జిల్లెళ్ళమూడిలో అమ్మకు సీరియస్ అయింది. డాక్టర్ సుబ్బారావుగారిని తీసికొని రమ్మని అమ్మ ఆదేశం. నెల్లూరు బయలుదేరాము. డాక్టర్ గారింటికెళ్ళి డాక్టరు గారితో వచ్చిన విషయం చెప్పాను. డాక్టర్ సుబ్బారావుగారు వెంటనే హాస్పిటల్‌కు తాళాలు వేసి తన కుటుంబసభ్యులందరితో కారులో బయలుదేరారు. దారిపొడుగునా మేము వెళ్ళేటప్పటికి అమ్మకు ఎట్లా వుంటుందో అనే ఆదుర్దా. జిల్లెళ్ళమూడి చేరాము. అమ్మ వాత్సల్యాలయంలో మంచం మీద కూర్చుని అందరితో నవ్వుతూ పరిహాసాలాడుతూ ఆనందంగా కబుర్లు చెప్పుతున్నది. మమ్ములను చూడంగానే డాక్టరుగారిని రా నాన్నా ! రా ! అని తన ఒడిలోకి తీసుకున్నది. అమ్మా ! నీ కెట్లా వున్నదమ్మా ! అని డాక్టరు గారు అమ్మను అడిగారు. అమ్మ నీవు ఎప్పుడైతే నెల్లూరులో బయలుదేరావో అప్పుడు నా అస్వస్థత మటు మాయమైంది. "నీవు పాముల నర్సయ్యవురా" అంది. ఆ కాలంలో ఎవరికైనా పాముకరిస్తే ఆ పాములనర్సయ్యకు ఫోన్ చేసేవారు. ఫోనుచేసిన 10 నిమిషాలలో వాడికి తగ్గి కులాసాగా వుండేవాడు. అందుకే నెల్లూరు డాక్టర్‌గారిని పాముల నర్సయ్య అంది అమ్మ. మన అదృష్టం కొద్దీ మనం అమ్మను చూడవలసిన యోగం వుంటే ఏదో విధంగా పిలిపించుకొనేది. ఇది ఎందరికో వున్న అనుభవమే.

– సెప్టెంబర్, **2009**

# అనుకరణ

అవి 1960 దశకంలోని రోజులు. అమ్మ పూరింట్లోనే ఉండి వచ్చిన బిడ్డలందరకు దర్శనం ఇస్తున్న సమయం. అమ్మ ఆ పూరింటిలోనే హాలులో కూర్చుండేది. హాలు నిండినప్పటికి వచ్చిన వారందరిని లోపలికిరా, నాన్నా! కూర్చోండి అనే అంటుండేది. అది యొక పుష్పక విమానం. ఎంతమంది వచ్చినా అందులోనే సర్దుకొనేవాళ్ళు. ఒక రోజు గుంటూరు నుండి గోవిందరాజుల దత్తుగారు ఒక కారులో బషీరుబాబా అనే పేరుగలవారితో సహా అమ్మ దర్శనార్థమై వచ్చారు. ఆరోజు అమ్మకు మామూలుగా పూజ చేయించే రామకృష్ణ లేడు. వాడి స్థానంలో నేను అమ్మకు పూజలు చేయిస్తున్నాను. వచ్చిన వారు నాకు కబురు చేసారు. అమ్మకు పూజలు ముగించిన తర్వాత ఒక బషీర్ బాబాగారు వచ్చి హారతి యిస్తారు, ఆయన వచ్చేదాకా హారతి ఆపండి అని. ఆయన స్నానం చేసి వస్తారని చెప్పారు సరే అన్నాను. పూజలన్నీ దాదాపు అయిపోయినవి. ఆయన 5 నిమిషాలలోనే తిరిగి వచ్చారు అమ్మకు హారతి ఇవ్వడానికి. "మీరు స్నానం చేసి వస్తానన్నారు గదా అప్పుడే వచ్చారేమ"ని అడిగాను. వారు విభూతి స్నానం చేసి వచ్చారని చెప్పారు. వారు అమ్మ దగ్గరకు వచ్చి అమ్మ పాదాలకు నమస్కరించి అమ్మను తదేకంగా చూస్తూ ఒక్కసారి తన చేతిని గాలిలో ఊపారు. గుప్పిట బిగించారు. టప్ మని శబ్దం వచ్చింది. ఆయన అరచేతిలో ముద్ద కర్పూరం వున్నది. దానిని వెలిగించమన్నారు. నిప్పుల పుల్లతోనే, నేను దానిని వెలిగించాను. అట్లాగే అమ్మను చూస్తూ వారు హారతి యివ్వపోయారు. ఒక్కసారి తిప్పేటప్పటికి అది ఆరిపోయింది. మరల వెలిగించారు. మరల మరోసారి హారతి ఇవ్వపోయారు. అది ఆరిపోయింది. మరల మూడవసారి వెలిగించాను. అప్పుడు హారతి ఇచ్చారు. అమ్మకు నమస్కారం చేసారు. అమ్మను క్షమించామ్మా ! అని అన్నారు. అమ్మ "నాన్నా ! అర్థరూపాయి పెట్టితే వచ్చే కర్పూరానికి ఇంతగా ఎందుకు చేసావు" అని సన్నగా మందలించారు. అందరినీ అన్నపూర్ణాలయానికి వెళ్ళి భోజనం చేసి రమ్మనమని సంజ్ఞచేసి లోపలికి స్నానానికి వెళ్ళారు. అమ్మకు ఇటువంటి ప్రదర్శనలు నచ్చేవి కాదు.

ఒకరోజున పూరింటి బయటనున్న బావి వద్ద ఒక కారు వచ్చి ఆగింది. ఆ కారులో నుండి కిరీటము పెట్టుకొని, శూలం చేతిలో ధరించి ఒకామె క్రిందకు

దిగింది. ఆ కారులో నుండి దాదాపు 5, 6 గురు ఆమెతో పాటు వచ్చారు. అందరు బావి దగ్గర కాళ్ళు కడుక్కొని కుమారస్వామి మందిరంలో కొచ్చి కూర్చున్నారు. ఆమెకు అక్కడ వున్న కుర్చీవేసారు. అప్పుడూ అమ్మ దగ్గర నేనే ఉన్నాను. నేను వాళ్ళ దగ్గరకు వెళ్ళి భోజనం చేసి వచ్చారో లేదో కనుగొన్నాను. వారందరు భోజనాలు చేసి వచ్చామని చెప్పారు. గుంటూరు నుండి వచ్చారుట. వారితో వచ్చిన మన్నవ మంగమ్మగారని ఒకావిడ 1958లలో అమ్మ దగ్గర గజేంద్రమ్మ, కృష్ణవేణమ్మలతో కలసి అమ్మకు స్నానం చేయిస్తూ వుండేదట. అమ్మ ఆమెకు కొన్ని శక్తులిచ్చిందని, కొన్ని స్థితులిచ్చిందని స్థితి మహోత్సవం కూడా ఆమె భక్తులు చేస్తూ వుంటారట. ఆమె అమ్మదర్శనార్థమై ఇప్పుడు ఇక్కడకు వచ్చింది. వాళ్ళు పూలు, దండలు పూజకు కావలసిన వన్నీ తెచ్చుకున్నారు. వాళ్ళకు మంచినీళ్ళు అవి ఇచ్చి అమ్మను సాయంత్రం దర్శించవచ్చని చెప్పాను. అమ్మతో ఆమెను గూర్చి చెప్పాను. ఆమె "జిల్లెళ్ళమూడి అమ్మ" అనే పేరుతో విరాజిల్లుతుందని అదివరకే విన్నాను. సాయం సంధ్యా సమయంలో అమ్మను దర్శించడానికి అమ్మ పూరింట్లో వెనుక భాగంలో మంచం మీద కూర్చున్న సమయంలో లోపలికి వచ్చారు. అమ్మ ప్రక్కనే మంచం క్రింద నేను కూర్చున్నాను. ఆమె లోపలికి వచ్చి అమ్మ పాదాలకు నమస్కరించి మెడలో దండవేసి పూలతో పూజించి అక్కడే క్రింద కూర్చొన్నది. మిగతా వారంతా అమ్మకు నమస్కరించి పూలు వేసుకున్నారు. అమ్మ వారిని మీరంతా ఎక్కడ నుండి వస్తున్నారు అని అడిగింది. గుంటూరు నుండి వస్తున్నామని చెప్పారు. పుట్టపర్తి వెళ్ళావా? అని ఆ మంగమ్మగారిని అమ్మ అడిగింది. ఆమె వెళ్ళలేదని చెప్పింది. మిగతా వారిని ఉద్దేశించి ఏరా పుట్టపర్తి వెళ్ళలేదా అని గట్టిగా అడిగింది. వెళ్ళామని చెప్పారు. అక్కడ జిల్లెళ్ళమూడి అమ్మ వచ్చింది అని చెప్పారా లేదా ? వాళ్ళు బయటకు వెళ్ళగొట్టారా? లేదా? అని గర్జించింది. వాళ్ళు తలకాయలు ఊపారు. సిగ్గులేదూ ? జిల్లెళ్ళమూడిఅమ్మ పేరుతో ఎందుకు వెళ్ళావు ? నీకు జిల్లెళ్ళమూడిఅమ్మ అంటే గొప్పేమో కాని నాకు లేదు. నేను జిల్లెళ్ళమూడి కరణం, నాగేశ్వరరావుగారి భార్య అంటేనే నాకు గొప్ప. నీవు కాలేవు గదా అని అన్నది. జిల్లెళ్ళమూడి అమ్మ అంటే ఎవరో ఏమిటో తెలిసిన వారందరికి బాగా తెలుసు. నీవు ఈ పిచ్చి పిచ్చి పనులు చేయవద్దు. నీకు కావలసిస్తే ఏ రాజరాజేశ్వరి అనో, లక్ష్మి అనో, దుర్గ అనో నీ ఇష్టమొచ్చినట్లుగా పేరు పెట్టుకో. వారెవరో ఎవరికి తెలియదు. జిల్లెళ్ళమూడి అమ్మ అనే పేరుతో మాత్రం నీవు తిరగొద్దు అని గట్టిగా మందలించింది. అప్పటి నుండి

ఆమె మన్నవ రాజరాజేశ్వరి అనే పేరుతో వ్యవహరించటం మొదలు పెట్టింది. ఇట్లా చాలా మంది జిల్లెళ్ళమూడి అమ్మ అనే పేరుతో తిరుగుతూ వుండేవాళ్ళు. ఒకసారి నర్సరావుపేటలో కూడా ఇట్లాగే జిల్లెళ్ళమూడి అమ్మ పేరు వుండే ఆవిడను నాన్నగారు చూచి వచ్చారుట. ఏమిటా చూద్దామని నాన్నగారు వెళ్ళితే నాన్నగారిని ఆమె సాదరంగా లోపలికి ఆహ్వానించి కుర్చీ వేసి సకల మర్యాదలు చేసి "ఏమండీ మన సుబ్బారావు, హైమ, రవి కులాసాగా ఉన్నారా? జిల్లెళ్ళమూడిలో అంతా బాగున్నారా" అని అడిగిందని నాన్నగారు ముసి ముసి నవ్వులతో నాకు అమ్మకు ఆ ఉదంతం చెప్పారు. అమ్మ వేషభాషలతో వ్యవహరించటం, అమ్మను అనుకరించటం వాళ్ళ ప్రత్యేకత. కాని సృష్టి స్థితి లయకారిణి, శక్తి స్వరూపిణి అయిన అమ్మను ఆ ఆధ్యాత్మిక శేముషీ వైభవాన్ని అనుకరించటం ఎవరితరం ? - **అక్టోబర్, *2009***

## తల్లికి బిడ్డ సొమ్ము - బిడ్డకు డబ్బు సొమ్ము

జిల్లెళ్ళమూడిలో నక్సలైట్ ఎటాక్ సందర్భంగా నక్సలైట్లు మారుణాయుధాలతో నన్ను బరిసెలతో చంపపోగా నేను బరిసెలకు చెయ్యి అడ్డం పెట్టి అమ్మా ! అని కేకవేసాను. దానికి వాడు "నిన్ను, నీ అమ్మా బొమ్మా ఎవ్వరూ రక్షించలేరు. ఇప్పుడు నీవు నా చేతిలో చస్తున్నావు" అంటూ గుండెలలోకి బరిసెను వేశాడు. ఆ బరిసే నా చేతికి ఉన్న ఉంగరము మీద పడి జారుకుంటూ చొక్కాను చీల్చుకుంటూ పోయింది. తర్వాత నన్ను లోపలికి తీసికొని వెళ్ళి నా మీద బరిసెలు మొదలగు మారుణాస్త్రాలతో బంధించి అక్కడ ఉన్న బీరువాను బ్రద్దలు కొట్టి అమ్మ నగలన్నీ దోచుకొని వెళ్ళారు. వారు వెళ్ళిన తర్వాత బయట వరండాలో చూడగా ఆవరణ పొగతో నిండి యుండి నిర్మానుష్యమై యున్నది. అప్పుడు డాక్టర్ కోన సత్యం తలుపులు తీసికొని వాళ్ళ ఇంటిలో నుండి బయటకు వచ్చి అమ్మ దగ్గరకు నన్ను తీసికెళ్ళాడు. అపుడు అమ్మ "నీ కేక నాకు వినపడింది నాన్నా". "కాని వీళ్ళు నా కాళ్ళు పెనవేసికొని నన్ను ఇక్కడ నుండి కదలనివ్వలేదు" అన్నది. "నీవు భౌతికంగా రాకపోతే ఏమమ్మా! నన్ను కాపాడావుగా అన్నాను. కాని నేను చూస్తూవుండగా వేలరూపాయిల నీ సొమ్మంతా దోచుకొని వెళ్ళారమ్మా! చూస్తూ కూడా నేనేమి చేయలేక పోయాను" అన్నాను. అప్పుడు అమ్మ "సొమ్ముపోతే పోయిందిలే నాన్నా! నాకు బిడ్డదక్కేడు చాలు" అంది. "సొమ్ము పోతే ఎవరో ఒకరు ఇస్తారు. కాని బిడ్డపోతే ఎవరిస్తారు?" అని అంది అమ్మ. "అమ్మకు బిడ్డ సొమ్ము; బిడ్డకు డబ్బు సొమ్ము". ***నవంబర్, 2009***

# స్వర్గ ధామం

మోహన్ ఒక పారిశ్రామికవేత్త, సాహిత్యాభిలాషి, ఆతడు అందగాడు తండ్రి చనిపోవటం వల్ల వారి ఎస్టేట్‌కు అతడే యజమాని. ఆతని మేనత్త కూతురు శారద. ఈమె డిగ్రీపూర్తి చేసుకొని, సంగీత, నృత్య కళాశాలలో విద్య నభ్యసిస్తున్నది. ఆమె యౌవనవతి, అందగత్తె. ఆమెకు తండ్రి చిన్నప్పుడే పోవటం వల్ల ఆమె తల్లితో సహా మోహన్ ఇంట్లోనే వుంటూ వుంటుంది. మోహన్ తన మేనకోడలైన శారదను గాఢంగా ప్రేమించాడు. ఆమె చదువు సంధ్యలు పూర్తి అయిన తర్వాత వివాహం చేసుకోవచ్చులే అని మిన్నకున్నాడు. కాని ఆయన వయస్సులో నున్నటి వంటి కామ ప్రవృత్తి ఆయనను నిద్రపోనివ్వటం లేదు. ఆయనకు ఆమె తప్ప వేరే లోకం లేదనట్లుగా మసలుతున్నాడు. కాని శారద సత్యం అనే సంగీత, నృత్య కళాశాల ప్రిన్సిపాల్, గానకళావిశారదుడు, స్ఫురద్రూపి యైన మరియొక యువకుని మనసార ప్రేమించింది. ఇది తెలిసిన మోహన్ కోపోద్రిక్తుడై తన ప్రేయసి ప్రేమిస్తున్న సత్యాన్ని ఆమె మీద వున్న మమకారంతో, అహంకార పూరితమైన ఆవేశంతో తన దారికి అడ్డులేకుండా చేసుకోవటానికి అతనిని హత్య చేయించాడు. అతనికి శిక్షపడింది. శిక్ష అనుభవించి ఇంటికి చేరాడు. సంఘంలో తనకున్న పేరు ప్రతిష్టలు గంగలో కలిసాయి, తనను అందరు నిరాదరంగా చూస్తున్నారు. ఇటువంటి సమయంలో శారదను పెండ్లిచేసుకుందామని, తాను జాగ్రత్తగా వుంటానని ఆమెను ఒప్పించటానికి శతవిధాలా ప్రత్నం చేసాడు. కాని తన ప్రేయసియైన శారద అతనిని అసహ్యించుకొన్నది. తన జోలికివస్తే నీకదేగతి పడుతుందని హెచ్చరించింది. తాను ప్రాణ సమానంగా ప్రేమించిన యువతి, చిన్నప్పటి నుండి తన దగ్గరే పెరిగిన తన మేనకోడలు తిరస్కరించటంతో తట్టుకోలేకపోయాడు. పశ్చాత్తాప మనస్కుడై కుమిలి, కుమిలిపోయాడు. తనకు ఎంత ఆస్తి వున్నప్పటికి, హోదా వున్నప్పటికి, సంఘంలో మానమర్యాదలు పోయిన తర్వాత బ్రతకటమే కష్టసాధ్యమైంది. తనకు మనశ్శాంతి కరువైంది. శాంతి కోసం ఆశ్రమాలు, తీర్థయాత్రలు చేయటం ప్రారంభించాడు. ఆ తీర్థయాత్రలలో తన మనస్సును ఆహ్లాదపరచిన ఒక పుణ్యక్షేత్రంలో నున్న వారి దివ్య ప్రేమకు ఆకర్షితుడయ్యాడు. ఆ ప్రేమకు ఎటువంటి కామ ప్రవృత్తి లేదు.

స్వచ్ఛందంగా ఏ కోదరులవలె మెలగటం చూచాడు. ఇన్ని సంవత్సరాల నుండి సరియైన తిండి లేక, నిద్రలేక, ఆదరణ లేక సంఘంలో బహిష్కృతుడైన వాడివలే బ్రతికిన వాడికి ఇక్కడ నున్న ఒక ఆలయం ఒక పెన్నిధి అయింది. ఆ ఆలయంలోకి అడుగుపెట్టాడు. గుడిగంటలు కొట్టాడు. ఆ ఆలయ పూజారి ఇతనిని చూచి లోపలికి ఆహ్వానించాడు. శాంతికోసం వెతుకుతూ, భాధాతప్తమైన అతన మనస్సునకు కొంత ఊరట కల్గింది. తన వృత్తాంతం ఆ పూజారితో మనస్సు విప్పి చెప్పుకున్నాడు. బాధ కొంత ఉపశమించింది. ఆ పూజారి అడిగాడు మరి ఆమెను నీవు ఎందుకు ఏమీ అనలేకపోయావు? అని. ఆమె మీద నాకున్న మమకారం నన్ను కట్టి వేసింది అని జవాబిచ్చాడు. ఇంకా ఆలయంలోకి వెళ్లుతునే పూజారి మళ్ళీ అడిగాడు, నీవు ప్రేమించిన సౌందర్యవతిలో నిన్ను ఎక్కువగా ఆకర్షించింది ఏది ? అని. ఆమె వక్షోజాలు అని సమాధానం. అంతకంటె నిన్ను ఆకర్షించింది ఇంకేమైన వున్నదా ? అని పూజారి అడిగాడు. ఆమె ముఖ సౌందర్యం అని జవాబిచ్చాడు. ఇంకా ఆలయంలోకి వెళ్లుతునే ఇంకా అంతకంటె ఆకర్షించింది ఏమైనా వున్నదా ? అని అడిగాడు. ఆమె మనో సౌందర్యం అని జవాబిచ్చాడు మోహన్. ఆలయ గంటలు కొట్టుకుంటూ లోపలికి యింకా వెళ్ళారు. అది గర్భాలయము. లోపలికి అడుగుపెట్టాడు. అక్కడంతా కటిక చీకటిగా వుంది. అది ఒక అమ్మవారి ఆలయం. అమ్మ అక్కడే ప్రతిష్ఠితయై ఉన్నది. ఆ చీకటిలో అమ్మవారిని వెతకటం ప్రారంభించాడు. ఆ గర్భాలయంలో కన్యాకుమారి ఆలయంలో లాగా మినుకు మినుకు మంటూ ప్రమిదలలో నూనె పోసి వత్తులు వెలిగించిన కాంతిలో అమ్మవారు అస్పష్టంగా కనబడుతున్నారు. పూజారి అమ్మవారికి కర్పూరహారతి ఇచ్చాడు. ఆ కర్పూర హారతి వెలుగు ఆధారంగా అమ్మవారిని చూచాడు. అమ్మవారు దేదీప్యమానంగా తన ఒడలు పరవశించేటట్లుగా సౌందర్యంతో విరాజిల్లుతున్నది. ఆ స్నిగ్ధ సౌందర్యపురాశిని చూడటానికి ఈ కళ్ళచాలవు. ఆ చూచేది ఈ కళ్ళతోనేకాదు. ఇంతటి సౌందర్యం అతడెప్పుడు చూడలేదు. అది వరకు తను సౌందర్యరాశి అనుకొన్నది ఇప్పుడు వెల వెల పోతున్నది సూర్యుని దగ్గర దివిటీ వలె. ఆ అమ్మ ఈతనిని ఆ మూలాగ్రం తీక్షణంగా చూస్తున్నట్లున్నది. ఆమె వంక తనూ తదేకంగా చూస్తూనే యున్నాడు. ఆమె చూపుల అగ్నిజ్వాలలో తన కామ క్రోధ మద మాత్సర్య, అహంకార, మమకారాలన్ని దగ్ధమై బూడిద అయినవి. ఆమె చల్లటి కరస్పర్శ అతని నుదుటిపై పడింది. అంతే అతని స్వస్వరూపాన్ని అతనే చూచుకున్నాడు. మీరు కానిది నేను

ఏదికాదు అని అమ్మ అన్నట్లుగా ఇప్పుడు తన సౌందర్యానికి తనే ముగ్ధుడైనాడు. ఆ అమ్మ సౌందర్యంలో తనూ కరిగిపోయాడు ఆమెలో కలిసిపోయాడు.

కోలారు బంగారు గనులలో బంగారం లభ్యమౌతుంది. ఆ భూమాత మనకు బంగారం ఇచ్చేటప్పుడు వాటితో పాటు అనేకమైన మిశ్రిత పదార్థాలు కలిపే ఇస్తుంది. 24 వన్నెల గల బంగారపు ముద్దను ఇవ్వదు. ఆ గనిలో లభ్యమైన బంగారపు మిశ్రమాన్ని వివిధ రకాలైన పద్ధతి మార్గముల ద్వారా శుద్ధిచేసిన గాని బంగారం లభ్యము కాదు. ఆ శుద్ధి చేసిన బంగారాన్ని కూడా అగ్నిలో పుఠం పెట్టి సమ్మెట వ్రేటులతో గాని 24 వన్నెల బంగారం రాదు. అట్లాగే కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలతో, అహంకార, మమకారాలతోను జ్ఞానం కలిపి భగవంతుడు జీవికి పుట్టుకతోనే ఇస్తాడు. జ్ఞానమనే అగ్నిలో పుఠం పెట్టి వాటిని దగ్ధం చేస్తే తప్ప వాటిలో కలిపి ఇచ్చిన జ్ఞానం మిగలదు. ఇది చేయవలసింది వాటిని ఇచ్చినవాడే. అదీ వాడి కరుణతోనే జరగాలి. ఇవ్వన్నీ యిచ్చింది వాడే అని తెలుసుకోవటం జ్ఞానం. వాడు, తను వేరుగా లేరు. వాడు తను కావటమే మోక్షం. తను అన్నిట, అన్నిగా వాడిలో తను లీనమై తను సర్వంగా కావటం మోక్షం.

*- డిశంబర్, 2009*



# ఆత్మసాక్షి

అది 15 నవంబరు 2009. ఆ రోజున నేను పబ్లికేషన్సు ఎకౌంట్స్ చేసుకుంటు కూర్చున్నాను. డే బుక్, కాష్ టాలీ కాలేదు. 1600/- రూ. తేడా వస్తున్నది. ఎన్నిసార్లు చూచినా అలాగే వస్తున్నది. రెండు రోజుల క్రితం క్యాష్ సరిపోయింది. మరి ఈ రెండు రోజులలో నాకు తెలిసి ఏమీ ఖర్చు పెట్టలేదు. మరి ఈ తేడా ఏమిటి ? ఎన్నిసార్లు చూచినా ఆ తేడా తేడాయే. ఏమీ తోచలేదు. ఆ 1600రూపాయిలు నేను కట్టవలసిందే. లేకపోతే రూ. 1600/- ఏ ఖర్చు అయినా వోచర్ వ్రాయవచ్చును. నన్ను అడిగేవాళ్ళు లేరు. ఈ విషయం ఎవరికీ తెలియదు, నేను చెప్పితే తప్ప. మరి ఏం చేసేటట్లు. ఖర్చురాద్దామా అంటే మనస్సు ఒప్పుకోవటం లేదు. దీనికి సాక్షి వుండరా ? ఎందుకుండరు ఉన్నారు. అదే మనస్సాక్షి. ఇంతకూ నేనెవరూ? అన్ని నేనులు, నేనైన నేనులో ఒక నేనును. అన్ని నేనులు నేనైన నేను అయిన నేను కూడా దీనికి సాక్షియే. అంటే ఆత్మసాక్షి. కనుక మనం చేసే మంచి, చెడులు పాపపుణ్యాలు మనకు తెలిసే జరుగుతున్నాయి. దానినే కాన్షస్‌నెస్ అంటారు. ఏది మంచి? ఏది చెడు ? ఏది పుణ్యం ? ఏది పాపం ? అని ఆలోచిస్తే నాకు తోచింది, ఒక వ్యక్తికి కాని, లేక సంఘానికి కాని, జీవి లేక జీవులకు కాని నష్టం జరిగితే లేక హాని జరిగితే అది చెడు లేక పాపం. లాభం జరిగితే లేక మేలు జరిగితే అది మంచి లేక పుణ్యం అనబడుతోంది. మరి వీటన్నింటికి మనమే కర్తృత్వం వహించి మనమే చేయ కలిగితే తెలిసి ఎందుకు చెడు చేస్తాం? పాపం చేస్తాం ? అన్నీ మంచే చెయ్యవచ్చు గదా ? పుణ్యాలే మూటకట్టుకోవచ్చు కదా! దీనికి శాస్త్రాలు, మీ పూర్వజన్మలో మీరు చేసిన పాపపుణ్యాలు ఈ జన్మను శాసిస్తున్నాయి అంటున్నాయి. మరి శివుని ఆజ్ఞ లేకుండా చీమైనా కుట్టదు - అని అంటున్నారు కదా ? సర్వాంతర్యామి, సర్వవ్యాపి అయిన పరమాత్మ ఎరుక లేకుండా ఏ జీవియైన వ్యవహరించగలదా? ఆ జీవి కూడా పరమాత్మ అంశయే కదా ? అందుకే అమ్మ "తోచిందేదో చెయ్యి తోపించేవాడు వాడేగా" అంది. మరి తోచిందల్లా మనం చెయ్యగలమా ? చేస్తే మనకు అసాధ్యాలనేవి ఏమి వుంటాయి? మరి అన్నీ సాధ్యమవుతున్నాయా ? లేవు. కనుక సాధ్యాసాధ్యాలు మన చేతులలో లేవు. "చేతులు మనవి కాబట్టి చేతలు మనవి అని అనుకుంటున్నాము" కాని ఆ చేతలన్నీ

ఆ పరమాత్మ కనుసన్నలలోనే నడుస్తున్నాయి అనేది పరమసత్యం. ఆ పరమాత్మ సర్వాంతర్యామి కనుక ప్రత్యేకంగా మనకు ఈ చర్మ చక్షువులకు కనపడుట లేదు. వాడు కాలంగానే కనపడుతున్నాడు. ఆ కాలస్వరూపిణియే కాళిక, వాడే విష్ణువు, వాసుదేవుడు, విశ్వేశ్వరుడు, పరంజ్యోతి, పరమాత్మ, పరబ్రహ్మ, పేరు ఏదైనా సర్వవ్యాపి అనియే. అర్థం. అమ్మ కూడా "అమ్మ అంటే ఈ జిల్లెళ్ళమూడిలో ఈ మంచం మీద కూర్చున్న అమ్మయే కాదు, అంఆ అంటే అంతులేనిది, అంతా అయినది, అడ్డులేనిది, అన్నిటికీ ఆధారమైంది" అని నిర్వచనం ఇచ్చింది. అందుకే మన చేతుల్లో ఏమీ లేదు కాబట్టి "తోచిందేదో చెయ్యి చేయించేవాడువాడేగా" అని అమ్మ ఇచ్చిన సందేశంలోని గూఢార్థం.

- ఫిబ్రవరి, *2010*



# ఏక మేవా ౨ ద్వితీయం బ్రహ్మ

బ్రహ్మజ్ఞానము అనగా ఏమిటి ? జ్ఞానము అనగా తెలుసుకోవటం. బ్రహ్మజ్ఞానము అంటే బ్రహ్మను తెలుసుకోవటం, బ్రహ్మగా తెలుసుకోవటం. అసలు బ్రహ్మ ఎవరు ? బ్రహ్మ సర్వాంతర్యామి, సర్వవ్యాపి, వాడినీ పరబ్రహ్మ, పరమాత్మ, విష్ణువు, సర్వేశ్వరుడు, నారాయణ, వాసుదేవ అంటారు. అంటే సర్వవ్యాపి అని అర్థం. అటువంటి బ్రహ్మను తెలుసుకోవటం బ్రహ్మజ్ఞానమంటారు. వాడు సర్వాంతర్యామి కాబట్టి వాడు కుల, మత, లింగ, జాతి, వర్ణ, దేశ, విదేశీ అనే తేడా లేకుండా అందరిలోను, అంతటా, ఒక్కటిగానే ఉంటాడు. మానవులకు బ్రతకటానికి కావలసిన నీరు, నిప్పు, గాలి, దేహములో ప్రవహించే రక్తము వాటికీ ఈ వివక్షత లేదు. ఒకసారి ఒక హాస్పిటల్లో ఒక వేదపండితుడైన, నిష్ఠాగరిష్ఠుడైన, బ్రాహ్మణోత్తముడు రోగిగా చేరాడు. ఆయన చావు బ్రతుకులలో ఉండవలసిన పరిస్థితి ఏర్పడ్డది. ఆయనకు దాదాపు 8 సీసాలు రక్తము ఎక్కించ వలసి వచ్చినది. ఆ రక్తము వెంటనే ఎక్కిస్తేనే గాని వారు బ్రతకరని డాక్టర్లు మరీ మరీ చెప్పుతున్నారు. వారికి కావలసిన రక్తము గ్రూపు సామాన్యముగా దొరికేది కాదు. డాక్టర్లు, వారి బంధువులు దానికోసం సర్వప్రయత్నం చేసారు. కాని అటువంటివారు తారసపడలేదు. వారి బంధువులలో కొంత మందికి ఈ గ్రూపు ఉన్నవారు ఉన్నారు. కాని వారి రక్తము తీయటానికి వారు సుతరామూ ఒప్పుకోలేదు. ఇంతలో అక్కడకు వచ్చిన వారిలో కొంతమంది మానవతాదృక్పథంతో తోటివారి పరిస్థితిని బట్టి తాము ఐచ్ఛికంగా తమ రక్తం ఇవ్వటానికి సిద్ధపడ్డారు. వారు మాల, మాదిగ, ఎరుకల మొదలగు కులాలకు చెందినవారు. అయినప్పటికీ ఆయన ప్రాణం దక్కటం అత్యవసరం కాబట్టి ఆ రక్తం స్వీకరించటానికి ఒప్పుకున్నారు. వారి రక్తము వీరికి ఎక్కించారు. ఆయన బ్రతికారు. కనుక అందరి మానవులలో వున్నది ఒకటే రక్తము గ్రూపు తేడాలతో. అందుకే మాలల్లో ఉన్నది రక్తము కాదా? నీలో ఉన్నది పాలా ? అని మహాత్మాగాంధీ అన్నారు. కనుక మానవులందరు కుల, మత, వర్ణ వివక్షత పాటించటం పాడికాదు. అందరిలో ఉన్న రక్తము ఒక్కటే. అదే జీవులకు ప్రాణాధారమైంది. ఈ సత్యము ఆస్తికులకు గాని, నాస్తికులకు గాని ఒక్కటే అనే సత్యసంకల్పంతో అమ్మ జిల్లెళ్ళమూడిలో అన్నపూర్ణాలయం స్థాపించింది. ఈ ఇంటికి అందరిల్లు అని పేరు పెట్టింది. ఇక్కడ ఎటువంటి వివక్షతలు పాటించకుండా ఒక్క బంతిన భోజనం చేయవచ్చు. ఈ నిత్యాన్న వితరణను అన్నదానము అని అనలేదు. కారణము అమ్మ

తన పిల్లలకు తాను అన్నం పెట్టుకోవటం దానం ఎట్లా అవుతుందని ప్రశ్నించింది. మరి వీరంతా ఆమె పిల్లలా ? అవును. "నేను అమ్మను మీరు బిడ్డలు. నేనే మిమ్ములను కని, మీ తల్లులకు పెంపుడిచ్చాను" అంది. అనటమే కాదు. అందరినీ అంతగా ప్రేమించింది. తాను ఒక ప్రేమమూర్తిగా, మాతృమూర్తిగా అవతరించింది. ఈ మాతృప్రేమ అవధులు లేనిది. ఈ ప్రేమను అందరు వివక్షత లేకుండా ఆమెలో చూచారు. ఆమె ప్రేమను చవిగొన్నారు. "మీరంతా ఒక్కసారిగా ఒకే బంతిన ఒక లక్షమంది భోజనము చేస్తుంటే నేను చూడాలని తన చిరుకోరికను వెలిబుచ్చింది. అంతే తన 50 వ జన్మదినోత్సవ సందర్భంగా స్వర్ణోత్సవాలుగా ఒక లక్షన్నర మంది 60 ఎకరాల పొలాలలో షామ్యానాల క్రింద భోజనాలు చేస్తుండగా ఒక జీపులో ప్రయాణించి బంతుల మధ్యగా తిరుగుతూ ఆ భోజనం చేస్తున్నవారిని చూస్తూ ఆనందంతో పులకరించిపోయింది. అందరినీ తన వాత్సల్యంతో ఆశీర్వదించింది. "మీరు నా బిడ్డలే కాదు నా అవయవాలు" అన్నది. మీరు లేనిది నేను ఏదీ కాదంది. నేను ఈ జిల్లెళ్ళమూడిలో ఈ మంచం మీద కూర్చున్న అమ్మయే కాదు, అంఆ అంటే అంతులేనిది అడ్డులేనిది అంతా అయినది. అన్నింటికీ ఆధారమైనది, ఆది అంతాలు లేనిది, అంతటా వ్యాపించి యున్నది" అని తన సర్వవ్యాపకత్వాన్ని ప్రకటించింది. సర్వవ్యాపకమైనవాడు బ్రహ్మ. ఆ బ్రహ్మ ఎక్కడో లేడు. వాస్తవంగా బ్రహ్మ పదార్థం కంటికి కనబడేది కాదు. అది అనుభవైకవేద్యము. అది అవాఙ్మానసగోచరం అయిన బ్రహ్మ. అయినప్పటికి ఇప్పుడు ఇక్కడే మన కన్నుల ముందరే నడయాడు దేవతవలే కనపడుచున్న "నేను నేనైన నేను. అన్ని నేనులు నేనైన నేను" అని తాను అందరిలో 'నేను'గా అంతర్యామిగా వుంటూ అందరిలో తన బ్రహ్మత్వాన్ని చూచుకుంటూ అందరిని బ్రహ్మలుగనే పరిగణించింది. కనుక మనలో నున్న "నేను" పరిమిత దేహానికి సంబంధించింది కాదు. అది అందరిలో నున్న "నేను"గా ప్రకాశించుచున్న "నేను" సర్వవ్యాప్తమైనది. సర్వాంతర్యామి అయినది. అప్పుడు "నేను" ఎవరో కాదు. ఆ పరబ్రహ్మనే అనే స్ఫురణ కలుగుట జ్ఞానం. ఈ 'నేను' పరిమితమైన ఈ దేహానికి చెందుతుంది. ఈ 'నేను'ను ఆ "నేను"కు మధ్య ఒకే తెర, మాయగా ఉండటం వలన అసలు "నేను"ను తెలుసుకోలేకున్నాము. ఈ "నేను" ఆ "నేనే" అనే భావం ప్రస్ఫుటంగా, నిరంతరం ఉన్నట్లైతే తాను బ్రహ్మమే అవుతాడు. సర్వంతర్యామి అవుతాడు. సర్వవ్యాపి అవుతాడు. వాడు వేరే కాదు, వాడు నేను ఒకటే అన్న స్ఫురణ కలుగుతుంది. అప్పుడు రెండు లేవు. ఒక్కటే "ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ". "అహం బ్రహ్మోఽస్మి." – **ఏప్రియల్, 2010**

# ఎరుక లేక ఎరుగ లేరు

అమ్మను వేదాంతం అంటే ఏమిటి? అని అడిగితే "చెప్పేవాడికి వినేవాడికి తెలియనిది" అని సమాధానం చెప్పారు. మరి ఇంతకీ చెప్పేవాడికి తెలియదా? మరి ఎందుకు చెప్తున్నట్లు? తెలిసింది అని అనుకొని. ఏమి తెలిసింది? భగవంతుని గురించి, ఆయన తత్వాన్ని గురించి. ఆయన తత్వాన్ని గూర్చి చెప్పటమే ఫిలాసఫీ. ఇంతకు ఆయన ఎవరు? ఆయన దేవుడు. "దేవుడంటే దేవులాడినా దొరకని వాడు" అంది అమ్మ. ఎందుకు దొరకడు?" ఎందెందు వెదకి చూచిన అందందే కలడు" అన్నాడు ప్రహ్లాదుడు. వెదకటానికి ఎక్కడకన్నా పోతేగదా? మరి ఎందుకు కనపడడు? "ఈ సృష్టిలో ఏది చూచినా, ఏది తాకినా, ఏది విన్నా 'అది' తప్ప నాకేదీ కనపడటం లేదు నాన్నా" అన్నది అమ్మ. ఇంతకి "అది" ఏది? ఈ సర్వసృష్టి అన్నమాట. ఇది భౌతికమైనది. నశించేది, మారేది అంటారు. ఏది సర్వకాల సర్వావస్థలయందు వుంటుందో, ఏది సర్వవ్యాప్తమైనదో, ఏది సర్వమునకు ఆధారంగా వుంటుందో, ఏది సర్వము తానైయుంటుందో అదే పరబ్రహ్మము. అదే పరమాత్మ. అదే ఆ "అది". "అది" "ఇదే" అని అన్నది అమ్మ తన వంక బొటన వ్రేలు చూపుతూ.

అమ్మ అంటే ఈ జిల్లెళ్ళమూడిలో ఈ మంచం మీద కూర్చొన్న అమ్మే కాదు. అమ్మ అంటే 'అంతులేనిది, అడ్డులేనిది. అంతా అయినది. సర్వమునకు ఆధారమైనది. అర్థముకానిది' అని నిర్వచనము ఇచ్చింది. అటువంటి అమ్మను తెలుసుకోవటానికి ఆమె తెలియవలసిందేకాని మనం తెలుసుకోవటం మన వల్లకానిపని. అందుకే అమ్మ "నేను అమ్మను మీరు బిడ్డలు. అంతే కాదు మీరు నా అవయవాలు కూడా. మీకే కాకుండా ఈ సర్వచరాచర సృష్టికి నేను అమ్మనే" అని తెలియచేసుకుంది. అంటే ఆమె విశ్వజనని, సర్వసృష్టికారిణి, అని అవగతం అవుతున్నది. అటువంటి విశ్వజననికి మనం బిడ్డలము. అమ్మా! నీవు రాజరాజేశ్వరి అవతారంట కదా అంటే "మీరు కానిది నేను ఏదీ కాదు" అంది. అంటే మీరంతా "అదే" అని స్ఫురింప చేస్తుంది. కాని "లడ్డు అవడం కంటే రుచి చూడటంలోనే ఆనందం వుంది" అంది. అందుకే ఆ లడ్డు రుచి చూపించటానికే మీరు నాకు బిడ్డలు అంది. ఒక చెంప లడ్డు కూడా మీరు కాకపోలేదు అని స్ఫురింప చేస్తూ మీరు నానుండి ఉద్భవించి, నాలోనే పెరిగి, నాలోనే లీనమౌతారు. మీరు నా ఒడిని విడిచి ఎక్కడకు

పోలేరు" అనే అమ్మ Assurance మనకు Insurance. ఇంత ఘంటాపథంగా చెప్పిన అవతారము ఎవరున్నారో ఆలోచించండి. ఎవరిని చూచినా కర్మలు, జన్మలు, జన్మపరంపరలు. ఈ పరమపద సోపానము నుండి ఎప్పటికి బయట పడతారో? ఎన్ని అవతారాలు రావలసి యున్నదో? అంచనా వేయలేని విషయము.

అటువంటి తరుణంలో తల్లిగా మనల్ని తరింప చేయటానికే, మనము అసలు ఎవరమో తెలియ చేయటానికే, అమ్మ అవతరణ.

ఒకసారి అమ్మ పూరింటి వరండాలో స్తంభాన్ని అనుకొని నిలుచున్నది. ఆ స్త ాన్నే ఆనుకొని మదరాసు సోదరులు పార్థసారథి అయ్యంగారు క్రింద కూర్చొని పుస్తకము చదువుకుంటున్నారు. అప్పుడు అమ్మ అన్నది "పాపం వీడు కావలసిన వాడిని ప్రక్కనే పెట్టుకొని పుస్తకాలలో వెతుక్కొంటున్నాడురా?" అని.

అందుకే కాబోలు రాజమ్మగారితో సంభాషణలో గురువు అవుతామనుకొన్న రాజమ్మగారికి కూడా తన నిజ దర్శనాన్ని యిచ్చి తానెవరో తెలియచేసింది. అమ్మ కనుక తానెరుక చేసుకుంటే తప్ప మనము ఎరుగలేము.





# అమ్మ నామంతో ఉచ్ఛ్వాస నిశ్వాసాలు

నేను పూరింట్లో అమ్మకు పరిచర్యలు చేస్తూ రాత్రిల్లు అమ్మ దగ్గరవున్న రోజులవి. ఒకరోజురాత్రి దాదాపు 12 గంటలవుతుంది ఏమో! అమ్మకు జ్వరము 104 డిగ్రీలు దాకావచ్చి వళ్ళు మాడిపోతున్నది. అమ్మపడుకునే యున్నది. అమ్మా! ఇంత జ్వరము వున్నది గదా ఏదైనా మందు ఏస్తే బాగుంటుందమ్మా! అని అన్నాను. అమ్మ శేషగిరిరావు అన్నయ్య ఎక్కడున్నాడో చూచి వాడిని అడుగు, మందు చెప్తుతాడు, అన్నది. ఆయన ఎక్కడ పడుకున్నారో తెలియదు. అది మన మెయిన్ బిల్డింగు కట్టడం జరిగే రోజులు. అందులో చలికాలం అందుకొని వరుసగా అన్నిచోట్ల ఆచీకటిలోనే చూచుకుంటూ అన్న పూర్ణాలయం దగ్గర వరకు వెళ్ళాను. అప్పటికి జిల్లెళ్ళమూడికి కరెంటు రాలేదు. అక్కడకు వెళ్ళేటప్పటికి మూలుగుతున్నట్లుగా శబ్దం వినబడుతున్నది. ఆ శబ్దాన్ని ఆధారంగా చేసుకొని పయనించాను. ఆ శబ్దం నన్ను అన్నపూర్ణాలయం మేడమీదకు దారి తీసింది. పైకి వెళ్ళేటప్పటికి అక్కడ నాలుగు మంచాలు వరుసగా ఎత్తి ఉన్నవి. ఒక రెండు మంచాల మధ్యలో దుప్పటి కప్పుకొని నిద్రపోతున్నాడు శేషగిరిరావు అన్నయ్య. గాఢ నిద్రలో వున్నాడు ఆయన నుండే దంపుడు బియ్యం పోటువేసినట్లుగా అం ఆ, అం ఆ అని ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు పలుకుతున్నాయి. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఇది సాధన చేస్తే వస్తుందా? ఎట్లా వస్తుంది? ప్రతిక్షణం అమ్మనామం మన శ్వాస నిశ్వాసాలతో పలికితే అది అబ్బుతుందేమో! నాకు నిజంగా ఆయనను డిస్టబ్ చేయాలని అనిపించలేదు. కాని తప్పదు. మెల్లిగా ఆయన తలవద్ద కూర్చొని ఆయన చేయిపట్టుకున్నాను లాభంలేదు. స్పర్శ తెలియటంలేదు. సరే ఒక్కసారి అన్నయ్యా! అని పిలిచాను పలుకలేదు. గట్టిగా చెయ్యి పట్టుకొని అన్నయ్యా అని కుదిపాను. ఆ! అని ఒకసారి లేచి ఏమండి ఏమిటి? అని అన్నాడు. అమ్మకు అని చెప్ప పోతున్నాను ఏమైంది? అమ్మకు అని ఆదుర్దాగా అడిగాడు. ఏమి లేదు జ్వరం 104 డిగ్రీలు వుంది. వళ్ళు మసలుతుంది. ముందు ఏమైనా చెప్తారా! అని అన్నాను. హోమియోలో మందుపేరు చెప్పారు. అమ్మ దగ్గరకువచ్చి ఆయన చెప్పిన మందు అమ్మతో చెప్పాను. అమ్మ అక్కడవున్న హోమియోమందుల చస్టు నుండి ఆ మందు తీయమంది. మందు అమ్మకు వేసాను. తర్వాత అమ్మ పడుకొన్నది. ప్రొద్దున్నే లేచింది. జ్వరం తగ్గింది. ఉదయం 5 గంటలకల్లా అమ్మ లేచి ముఖ ప్రక్షాళనచేసికొని

మంగళ సూత్రాల తీర్థం తీసికొని కాపీ త్రాగటం అమ్మకు అలవాటుగా వుండేది. అమ్మతోపాటే మేంకూడా కాఫీత్రాగేవాళ్ళం. అప్పుడే శేషగిరిరావు అన్నయ్య వచ్చారు. ఆయనకూడా మాతోనే కాఫీత్రాగుతున్నప్పుడు అమ్మ జ్వరం సంగతి మరల చెప్పాను. అయితే నన్ను ఎందుకు లేపలేదు అని అడిగారు. జరిగిన విషయం చెప్పాను. కాని ఇది ఏదీ ఆయనకు జ్ఞాపకం లేదు. ఏమందు చెప్పాను. అని ఆతృతతో అడిగారు. చెప్పిన మందుపేరు చెప్పాను. సరేబాగానే చెప్పానే అన్నారు. మరి ఇది ఇయన చెప్పకపోతే అమ్మే ఆయనచేత చెప్పించినట్లా!





# సంస్థలు - ఆవశ్యకత - పురోగమనము

చీరాల సోదరుల కోరిక మేరకు 1958లో అన్నపూర్ణాలయ నిర్వహణకు ప్రత్యేకమైన గాడిపొయ్యిలో అమ్మ నిప్పువేసినప్పుడే సంస్థల నిర్మాణానికి శ్రీకారం చుట్టబడింది. 1960 దశకంలో శ్రీ అధరాపురపు శేషగిరిరావు అన్నయ్య జిల్లెళ్ళమూడి వచ్చే యాత్రికులకు వసతి సౌకర్యార్థం తిరుమల తిరుపతిలో వలె సత్ర నిర్మాణం చేబట్టి 10 ప్రత్యేక పోర్షన్ను గ్రౌండ్ ఫ్లోర్‌లోను యాత్రికుల భోజన సౌకర్యార్థం అన్నపూర్ణాలయ భవన నిర్మాణంచేపట్టటం జరిగింది. ఆ నిర్మాణాలలో అప్పటికే కొన్ని కారణాల వల్ల అమ్మ సన్నిధిలో కుటుంబాలతో వచ్చి అమ్మ దగ్గర నివాసం ఏర్పరచుకొన్న వారిలో పోతుకూచి విద్యాసాగర్, భార్య రాజ్యలక్ష్మి పిల్లలు జ్యోత్స్న, రమణ, సావిత్రి, ఝాన్సీ, రవి, రావూరి లక్ష్మీనరసింహం వారి పిల్లలు రావూరి ప్రసాద్, లక్ష్మీనారాయణ, రమ, వాణి, యార్లగడ్డ భాస్కరరావు, తాతయ్య, చంద్రమ్మ, యార్లగడ్డ రాఘవయ్య గారి కుటుంబసభ్యులు మరియు సత్యవతి అక్కయ్య జానకి, వర్ధని మొదలైన సోదరీ సోదరులు సింగుపాలెం నుండి వచ్చిన వారిలో ముఖ్యులు. వల్లూరి లక్ష్మీనరసమ్మ, సత్యం వారి కుటుంబసభ్యులు, మల్లాది శారదాంబ, కస్తూరి, మహదేవ్, కటిక కోటేశ్వరరావు, హనుమయ్య, నంబులు, రాజు బావ, ప్రభావతి, వల్లూరి రామమోహనరావు, బాల, మన్నవ రామారావు, చిదానందం, బెండపూడి యాగయ్య, రుక్మిణమ్మ, రావిపాటి గజేంద్రమ్మ, దాసుగారు, కృష్ణవేణమ్మ, వసుంధర, వరలక్ష్మి అన్నపూర్ణ, మరియు అధరాపురపు శేషగిరిరావు అన్నయ్య గారి కుటుంబ సభ్యులు, రామకృష్ణ, గోపాలకృష్ణ, రాధాకృష్ణ పన్నాల మొదలగు వారు ఐచ్ఛికంగా వారి వారి సేవలను అమ్మ సేవగా భావించారు. అందరూ సుప్రభాత, సంధ్యావందన కార్యక్రమాలలోను, అక్కడకు వచ్చే యాత్రికులకు అక్కడ స్థిరనివాసులు ఏర్పరచుకున్న కుటుంబాల వార్కి త్రాగుటకు మంచినీళ్ళు, స్నానపానాదులకు, అమ్మ స్నానానికి కావలసిన నీళ్ళు చెరువునుండి కావిళ్ళతో తీసికొని రావటం, సోదరులు విద్యాసాగర్‌గారు, రాధాకృష్ణరెడ్డి శింగుపాలెం తాతయ్య మొదలగువారు ఒంటెద్దు బండితో చిన్న నీళ్ళ పీపాతో నీళ్ళు తేవడం, మనకున్న పొలాలను యార్లగడ్డ భాస్కరరావు అన్నయ్య, సింగుపాలెం తాతయ్య, మొదలగు వారు సంస్థ తరపున స్వంత వ్యవసాయం చెయ్యటం, దుక్కి దున్నటం, నాట్లు కోతలు, కుప్పలు వేయటం కుప్పలు నూర్చటం, పశుపోషణ. సత్రనిర్మాణములోను అన్నపూర్ణాలయ కట్టడములకు సంబంధించిన

ఇటుకలు, ఇసుక, సిమెంటు మొదలగు వాటిని లారీలలో తెచ్చుటలోను, నాన్ టెక్నికల్ జాబ్స్ అన్నింటిని ఆడపని మొగపని అనే తేడా లేకుండా పాల్గొనటం ఇక్కడకు వచ్చే అతిథి అభ్యాగతులను అన్నయ్యా, అక్కయ్యా అని హృదయ పూర్వకప్రేమతో పలకరిస్తూ, అమ్మ దర్శనానికి వచ్చే వారికి సహకరించటం వసుధైక కుటుంబాన్ని తలపించింది. ఆ రోజులను స్వర్ణయుగం అని ఆనాటి వాళ్ళు ఇప్పుడు అంటూ ఉంటారు.

1966లో మాతృశ్రీ ఇంగ్లీషు, తెలుగు మాసపత్రికలు, అమ్మను గురించిన సాహిత్యం ప్రచురించటానికి సాహిత్యం స్వయంగా ప్రింటు చేసుకోవటానికి 'మాతృశ్రీ పబ్లికేషన్సు అనే ప్రొప్రయిటరీ సంస్థ శ్రీ అధరాపురపు శేషగిరిరావు అన్నయ్య పేరుతో ప్రారంభింపబడింది. వాటి మేనేజ్‌మెంటు పనులు నేను, ఎడిటోరియల్ పనులు రామకృష్ణ బాధ్యత వహించాము. 1968లో శేషగిరిరావు అన్నయ్య కొన్ని పరిస్థితుల ప్రభావం వలన వీటికి దూరంగా పోవలసి వచ్చింది. అందుకుగాను ఆయన ఈ ప్రొప్రయిటరీ సంస్థను మాతృశ్రీ పబ్లికేషన్సు ట్రస్టు అనే సంస్థను స్థాపించి ఆ ట్రస్టుకు కె.బి.జి.కృష్ణమూర్తి అను నన్ను మేనేజింగ్ ట్రస్టీగా, కొండముది రామకృష్ణ తంగిరాల కేశవశర్మ, ఎక్కిరాల భరద్వాజ, శ్రీపాదగోపాల కృష్ణమూర్తి గార్లను ట్రస్టీలుగా ఉంచారు. పత్రికలు ఇంగ్లీషుకు భరద్వాజ, తెలుగునకు కొండముది రామకృష్ణను, మేనేజింగ్ ఎడిటరుగా రెండు పత్రికలకు నన్ను నియమించారు. ఆయన పై సంస్థలను వదిలిపోయే సమయానికి 1 లక్షరూపాయల బాకీ పడాల్సి వచ్చింది. ఆ బాకీలన్ని అమ్మ సత్రం అనే పేరుతో అమ్మ పేరుననే చేయబడ్డవి. అన్నీ తానై ఈ సంస్థలను అంతవరకు నిర్వహించిన ఆయన ఒకసారిగా బయటకు పోవటం వల్ల బాకీదార్లు ఆయనను అడిగితే నా స్వంతానికి చేయలేదు అమ్మనే అడగండి అని అన్నారుట. బాకీల వత్తిడి అమ్మకు ఎక్కువైంది. కొంతమంది అమ్మకు రిజిస్టరు నోటీసులు ఇచ్చారు. ఆ రిజిష్టరు నోటీసులు చూసి నేను కలత చెందాను. ఈ వసతి గృహాలు మనందరికోసం, వీటికి బాధ్యత మనమే వహించాలి, గాని అమ్మను గురి చేయటం సరియైన పని కాదు. అని నాకు అనిపించి అమ్మా ! వాటన్నింటికి బాధ్యత వహించవలసింది వాటిని, అనుభవించేవాళ్ళు. కనుక దానిని ఒక రిజిష్టరు సంస్థగా రూపొందించి ఈ బాధ్యతలు ఆ సంస్థకు అప్పగించవలసిన ఆవశ్యకత ఎంతైనా వున్నదమ్మా అన్నాను. అమ్మ అయితే ఆ పని నీవే చెయ్యి అంది. నీకు తోడుగా మచిలీపట్నంలో ఎల్.ఐ.సి.లో పనిచేస్తున్న కేశవశర్మను పిలిపించు

అని అన్నది. సరే కబురు చేద్దాం అని అనుకున్నాను. కాని ఆరోజు సాయంత్రమే కేశవశర్మ జిల్లెళ్ళమూడికి అనుకోకుండా వచ్చాడు. ప్రొద్దునే నిన్ను గూర్చి అనుకున్నాను నీవు వచ్చావురా అంది అమ్మ కేశవతో. ఏమిటమ్మా విశేషం అన్నాడు కేశవ. నీవు ఎన్నాళ్ళు శెలవు పెట్టావు ? నీకు మచిలీపట్నం నుండి బాపట్లకు ట్రాన్స్‌ఫర్ కావాలంటే ఏమి చెయ్యాలి ? అంది అమ్మ. నాకు ట్రాన్స్‌ఫర్ గావాలంటే శేషగిరిరావు అన్నయ్య ఒక మాట చెప్పితే అవుతుందని అన్నారు. ఇంక మార్గం లేదా అన్నది అమ్మ. అదే సులువైన పద్ధతి అన్నాడు కేశవ. అయితే నీవు ఒక వారం శలవు ఎక్స్టెండ్ చెయ్యి. దానితో పాటు బాపట్లకు ట్రాన్స్‌ఫర్ అప్లికేషన్ పెట్టు. ఇదిగో ప్రసాదము. మీ డి.ఎమ్.కు పంపు అన్నది. అయితే శలవు శాంక్షన్ అయింది. ట్రాన్స్‌ఫర్ విషయంలో ఆలోచిస్తామని అమ్మ ప్రసాదం పంపినందుకు కృతజ్ఞతలు చెప్పుతూ కేశవకు వాళ్ళ డి.ఎమ్. నుండి లెటరు వచ్చింది. అంతే రెండు నెలల్లో ట్రాన్స్‌ఫర్ వచ్చింది. బాపట్లలో చేరాడు.

శేషగిరిరావుగారు ఈ వసతి గృహం గ్రౌండ్ ఫ్లోర్ బిల్డింగ్ కన్‌స్ట్రక్షన్ టైమ్‌లో టైప్లీయాక్షన్‌కు సిమెంటు, ఐరన్ కొనుగోళ్ళకు పైకం అమరక అమ్మ దగ్గర ఏడుస్తూ కూర్చుండేవాడు. అమ్మ ఏదో దారి చూపేది. లేదా రెండు మూడు సార్లు అమ్మ బంగారం గాజులన్నీ నా ఒడిలో దూసిపోసి ఆంధ్రాబ్యాంకుకు వెళ్ళి బాపట్లలో అప్పు తీసికొచ్చి ఆయనకు ఇమ్మన్నేది. అట్లా అనేకసార్లు శ్రీ రాచర్ల లక్ష్మీనారాయణగారి దగ్గర, ఇతర్ల వద్ద కూడా అప్పులు సంస్థ నిర్వహణకు తెప్పించేది. శ్రీ శేషగిరిరావు అన్నయ్యకు తీవ్రమైన జ్వరం తగులుతున్నా ఆయన లెక్క చేయక ఈ పనులకు నిమగ్నమయ్యేవాడు. ఆయనకు తోడుగా సంస్థ పనులకు నన్నుకూడా ఆయనతో పంపిస్తూ వుండేది. ఆయన వ్యక్తిత్వమే వేరు. ఆయన స్వాతంత్ర్య సమరయోధుడు, పొన్నూరు మున్సిపల్ మొదటి ఛైర్మన్‌గా ఎన్నికైయున్నవాడు. ఆర్.టి.సి. కార్మికుల యూనియన్‌కు ఛైర్మన్‌గా పనిచేసినవాడు. ఏ అధికారిని కలవాలన్నా, మంత్రులను కలవాలన్నా నేరుగా వారి దగ్గరకు దూసుకొనిపోయేవాడు. ఆయనకు అడ్డంకులు ఉండేవికాదు. ఆయన ఎక్కడకు పోయినా ఆయన దగ్గర అమ్మ ఫోటో గంధపు చెక్కతో చేసిన ఫ్రేములో అమర్చబడి వుండేది. గంధపు సాంబ్రాణికడ్డీలు, స్టాండ్ కూడా గంధందే. గంధ పరిమళం వెదజల్లుతూ వుండేవి. అమ్మకు ఊదువత్తులు వెలిగించకుండా బయటకు వెళ్ళేవాడుకాదు. ఎక్కడకు పోయినా అమ్మ కుంకంపొట్లాలు దగ్గరే వుండేవి. అటువంటి ఆయన దగ్గర అమ్మ నాకు ట్రైనింగ్ ఇప్పించింది.

శేషగిరిరావు అన్నయ్య ద్వారా చేసిన అప్పులు రామకృష్ణ , రామకృష్ణ తీసికొచ్చిన అప్పులు శ్రీ రాచర్ల, దినకర్ మొదలగు ప్రభృతులు ఐచ్ఛికంగా ముందుకు వచ్చి వారి వారి అప్పులు తీర్చారు. 2000 సంవత్సరానికి దాదాపు అప్పులు 10 లక్షల దాకా ఉన్నవి. అమ్మ తను కోరుకున్న బిడ్డల కోసం అప్పులమ్మ అయింది తిరుపతి వేంకటేశ్వరస్వామివారి లాగానే.

ఒకసారి ఒక ఇన్‌కంటాక్సు ఆఫీసరు మన ఎకౌంట్సు అసెస్‌మెంటు జరుగుతున్న సమయంలో అమ్మ ఇన్ని అప్పులు చేసి అన్నదానం చేయటం అవసరమా ? అని అడిగారు. దానికి నేను అమ్మ “దీనిని అన్నదానం అని నేను అనుకోలేదు, నా పిల్లలకు పెట్టుకోవడం నా బాధ్యత అనే చెప్పింది” అన్నాను. ఒకసారి శ్రీ ఎ.వాసుదేవరావుగారు. ఎండోమెంట్సు మినిష్టర్‌గా జిల్లెళ్ళమూడి వచ్చారు. వారు నన్ను మీ సరుకుల స్టోర్సు చూపించమన్నారు. చూపించాను. ఇంతేనా అన్నారు. ఇంతమంది వస్తారు, ఇంతమంది వెళ్తారు అని ముందుగా తెలిస్తే ఏర్పాట్లు చేయవచ్చు. కానిఎంతమంది వస్తారో, ఎంత మంది పోతారో తెలియకుండా అన్నపూర్ణాలయం ఎట్లా నడుపుతున్నారని అడిగేడు. అది మనం నడపటం కాదు ఇది ప్రత్యక్షంగా అన్నీ అయిన అమ్మే అన్నపూర్ణేశ్వరియై నడుపుతున్నది అని అన్నాను. 1968 సంవత్సరమునకు సంస్థాపరంగా గాని, ఎకౌంట్సు సిస్టం గాని వుండేది కాదు. వాటిని ప్రారంభం చేయించే అదృష్టం అమ్మ నాకు కల్పించింది. 1968లో మాతృశ్రీ పబ్లికేషను ట్రస్టు ఏర్పడిన తర్వాత విశ్వజననీ పరిషత్ అనే పేరుతో అన్ రిజిష్టర్డు సంస్థను అమ్మ ప్రెసిడెంట్ గాను, నేను సెక్రటరీగాను, రామకృష్ణ ట్రెజరుగా ఏర్పరచటం జరిగింది. ఈ సంస్థ లావాదేవీలకుగాను స్టేట్‌బాంక్ బాపట్ల బ్రాంచిలో మేము ముగ్గురం సంతకాలు చేసి అకౌంటు ప్రారంభించాము. ఈ సంస్థకు శ్రీ విశ్వజననీపరిషత్ అనే పేరు పెట్టాను గాని పరిషత్ అంటే ఏమిటి అని తెలుసుకోవాలని డిక్షనరీ చూచాను. అందులో ఒక జ్ఞాని ఉన్నా అది పరిషత్తే లేక ముగ్గురు పండితులున్నా పరిషత్తే అని ఉన్నది. విశ్వజననియే పరిషత్‌గా నున్న ఈ విశ్వజననీ పరిషత్ సార్థక నామమైంది.

అమ్మ నన్ను, రామకృష్ణను ఈ సంస్థలకు వారిద్దరు పునాదిరాళ్ళు అని చెపుతూ వుండేది. కాని ఈ సంస్థల పునాదిలో అనేకమంది సోదరీసోదరులు నిమగ్నమై యుండటము మనం మరువరానిది.

ఇది యొక ఇంటర్నేషనల్ ఆధ్యాత్మిక సంస్థగా రూపొందుతుంది. ఇది అన్ని ఆధ్యాత్మిక సంస్థలకు హెడ్ క్వార్టర్స్ కాగలదని, అందరూ ఒకరు నొకరు ప్రేమించు కుంటూ, వచ్చిన వారిని ప్రేమిస్తూ అందరూ కలసి మెలసి వుంటే ఆర్థిక ఇబ్బందులు ఎటువంటివి లేకుండా ఇక్కడ జరిగే అభివృద్ధికి, ప్రాజెక్టులకు కార్యక్రమాలకు కోట్ల రూపాయలు అమ్మ కురిపిస్తుందని స్వయంగా ఈ సంస్థను చూచిన నాకు సంతృప్తి కలిగిందని శ్రీశ్రీశ్రీ విశ్వంజీ మహారాజ్ అమ్మ కళ్యాణ మహోత్సవానికి 5.5.2009న విచ్చేసిన సందర్భముగా తన సందేశములో తెలియచేసారు. అటువంటి అభిప్రాయాన్నే శ్రీశ్రీశ్రీ పూర్ణానందస్వామివారు, సత్‌గురువు శివానందమూర్తిగారు వెలిబుచ్చియున్నారు. కనుక దానికి తగిన విధంగా అమ్మ మనలను నడపించును గాత!

అమ్మ ఒక వసుధైక కుటుంబాన్ని ఏర్ప'రచి ఈ ఇంటికి అందరిల్లు అని పేరు పెట్టింది. ఈ అందరింటిలో ఏర్పరచిన అన్నపూర్ణాలయము తీరు తెన్నులు కూడా చూస్తే ఇది వేద యుక్తంగా యున్నదనిపిస్తుంది.

అధర్వవేద సంహిత 3వ కాండ, 5వ సూక్తము, 7వ మంత్రమునకు అర్థము ఇలా ఉన్నది.

"నేను మిమ్ము కలసి మెలసి ఒకే కార్యము చేయువారిని, కలసి మెలసి భుజించువారిని చేయుచున్నాను. ఈ వశీకరణ కర్మచే మిమ్ము వశము నందుంచు కొనుచున్నాను. స్వర్గమున దేవతలు ఒక్కొక్కరకంగా అమృతమును రక్షించుచు సుమనస్కులై ఉంటున్నారు. అదే విధముగా మనసులు రాత్రింబవళ్ళు కళ్యాణకరములు అగును గాక ! అని.

– *మే, 2010*



# తీరని కోరిక

అది కొంత కాలం అమ్మ దగ్గర ఉంటున్న తర్వాత జరిగిన ఉదంతం అమ్మ నాతో "నాన్నా ! నాకు చాలా కాలంగా తీరని కోరిక ఒకటి వున్నది. అది ఎప్పుడైనా తీరుతుందా అని అన్నది. ఏమిటమ్మా ! అది నేను తీరుస్తాను అని అన్నాను. తీరుస్తావా ? అని మరల అన్నది. ఏమిటో ఆలోచనలేకుండానే చెప్పమ్మా ! నేను తీరుస్తానని అమ్మ అతిదీనంగా అడిగిన ఆ కోరికను గురించి అడిగేను నేను. "నేను ఎప్పుడైనా నాన్నగారి గుండెల మీద హాయిగా పడుకొనే రోజు వస్తుందా?" అని తన అపూర్వమైన తీరని కోరికగా అడిగింది. నిజంగానే ఆరోజు వస్తుందా ? అనేది నాకు ఉన్న హండ్రెడు డాలర్ల ప్రశ్న! తప్పక తీరుతుందని నాకున్న తీరని ఆశ ! కాని అమ్మతో సంశయ పూర్వకంగా కాక నిశ్చయంగానే తీరుతుందని అన్నాను. ఇది జరిగి దాదాపు 20 సంవత్సరాలైన తర్వాత నాన్నగారికి హార్టు ఎటాక్ వచ్చి నాన్నగారి ఇంటి గదిలోనే నాన్నగారు నా ఒడిలో పడిపోయారు. నేను మోయలేనే మో అనుకుంటుండగా శేషు తన ఒడిలోకి కొంత షేరు చేసింది. ఆ మంచం ప్రక్కగా తెల్లవార్లూ కూర్చున్న విద్యార్థిని కుమారి ఆండాల్ వెంటనే ప్రక్కగదిలో అప్పుడే పడుకున్న డాక్టరు ఇనజకుమారిని లేపింది. ఆమె వచ్చి చేయవలసిన ప్రథమ చికిత్స చేసింది. వెంటనే ఈ వార్త ఆవరణమంత దావానలంగా వ్యాపించింది. వెంటనే నాన్నగారి మంచాన్ని వాత్సల్యాలయానికి తరలించారు. వాత్సల్యాలయంలో అమ్మ మంచం ప్రక్కలో నాన్నగారి మంచం ఆనించి వేసారు. అమ్మ మొఖం నాన్నగారిని ఆ స్థితితో చూచి ఎఱ్రగా కందగడ్డలాగా అయింది. అమ్మ నాన్నగారి మంచం మీదనే కూర్చుని నాన్నగారి గుండెలమీద వ్రాలిపోయింది. ఆ గుండెల మీద నుండి కొన్ని గంటల సేపు దాకా లేవలేదు. నాన్నగారి గుండెల మీద పడుకొన్న అమ్మను నేను జూచి నిశ్చేష్టుడనయ్యాను. నోట మాట లేదు. ఆ దృశ్యం చూడలేక నేను క్రిందకు ఆఫీస్‌కుపోయి వికలమైన మనస్సుతో నాన్నగారికి తర్వాత జరుపవలసిన కార్యక్రమంలో నిమగ్నమైనాను. ఆ దృశ్యం కొంతకాలం దాకా నా మనోనేత్రంపై నిలచిపోయి వుంది.

# ఏమని కోరేది - నిన్నేమని కోరేది

నన్ను ఈ ఈతి బాధలనుండి తొలగించమని అడుగుదామనుకొంటే "బాధ లేని బ్రతుకు చావుకంటే హీన"మన్న నిన్ను ఏమని అడిగేది

- ఏమని కోరేది - నిన్నేమని కోరేది.

నాకు అన్నము, ధనము, సుఖశాంతులు ఇవ్వమని అడుగుదామనికొంటే నీకు జీవితము ఇచ్చేటప్పుడే "జీవిత పర్యంతం జీవితాంతము వరకు జీవిత విధానాన్ని నిర్ణయించే ఆ పుట్టుక ఇచ్చాను". "నిర్ణయించినవాడు కూడా ఆ నిర్ణయానికి బద్ధుడే" అన్న నీతో, ఏమని అడిగేది.

ఏమని కోరేది - నిన్నేమని కోరేది.

నీవు ఎప్పుడూ నన్ను చూచుకుంటున్నావు కనుక "నీ సంసార బాధ్యతలు నేను చూచుకుంటాను. నీ పిల్లలంతా రత్నాలురా ! నీ కంటే భాగ్యవంతుడెవరు ?" అన్న నిన్ను,

ఏమని అడిగేది

- ఏమని కోరేది - నిన్నేమని కోరేది.

ప్రభాతసేవలో నేనూ పాల్గొని వందమందిలో ఒకడినై పాడుతుంటే "నీ గొంతు నాకు వినపడుతూనే ఉన్నది" అన్న

నిన్ను, ఏమని అడిగేది

- ఏమని కోరేది - నిన్నేమని కోరేది.

నీ సుప్రభాత సేవకు నేను రాకపోతే "ఈరోజు సుప్రభాతం చేసినట్లుగా నాకు అనిపించలేదురా" అన్న నిన్ను, ఏమని అడిగేది

- ఏమని కోరేది - నిన్నేమని కోరేది.

"అమ్మ అంటే ఈ జిల్లెళ్ళమూడిలో ఈ మంచం మీద కూర్చున్న అమ్మే కాదు. అంఆ అంటే అంతులేనిది. అడ్డులేనిది, ఆది అంత్యాలు లేనిది, అంతా అయినది" అని చెప్పి నాకు నీ జీవిత సత్యాన్ని విడమర్చే విశ్వరూప దర్శనాన్ని ప్రసాదించి, "ఈ దర్శనం నాకు ఎందుకిచ్చావమ్మా ?" అని అడిగితే "ఏమో ! అట్లా ఇద్దామనుకున్నాను. ఇచ్చాను", అన్న నిన్ను, ఏమని అడిగేది

- ఏమని కోరేది - నిన్నేమని కోరేది.

నీ నామ సంకీర్తనముతో, నామజపముతో హోమము చేద్దామనుకుంటే జపాలు, హోమాలు, యజ్ఞాలు, యాగాలు ముక్తినివ్వవు అన్న రమణమహర్షి ప్రవచనం విన్న తర్వాత నిన్నేమని అడిగేది

- ఏమని కోరేది - నిన్నేమని కోరేది.

నీ నామమంత్రంతో తపస్సు చేసి సమాధి స్థితిని పొందుదామని అనుకుంటే సమాధిస్థితి ముక్తినివ్వదు. అని మహర్షి అన్న తర్వాత నిన్నేమని అడిగేది

- ఏమని కోరేది - నిన్నేమని కోరేది.

వేదాలు, శాస్త్రాలు, ఉపనిషత్తులు చదివి జ్ఞానం సముపార్జిద్దాం అని అనుకుంటే "జ్ఞానము మోక్షమునకు కారణము కాదు. మోక్షము కూడా జ్ఞానమునకు ఫలముకాదు" అన్న మహర్షిని చదివింతర్వాత నిన్నేమని అడిగేది

- ఏమని కోరేది - నిన్నేమని కోరేది.

నీవెవరో తెలుసుకో ? అన్న మహర్షి ప్రశ్నవిన్న తర్వాత "నేను నేనైన నేను - అన్ని నేనులు నేనైన నేను" అన్న నీ జవాబు ఎంత సరియైనదో తెలుసుకొని ఆ నేను, నేనుగా భావిస్తే చెప్పటానికి భాషమౌనమే - మౌనమే నీ భాష - ఓ మూగమనసా ! అన్నప్పుడు నిన్నేమని అడిగేది

- ఏమని కోరేది - నిన్నేమని కోరేది.

నదులన్నీ సముద్రములో కలిసి తన అస్థిత్వాన్నే పోగొట్టుకున్నట్లు నన్ను నీలో కలుపుకొని నా అస్థిత్వాన్ని పోగొట్టవా ? అని అడిగేదా ? నిన్నేమని అడిగేది

- ఏమని కోరేది - నిన్నేమని కోరేది.

అమ్మా ! నన్ను నీలో కలుపుకో- అని హైమ కోరినట్లుగా కాక కోరికలు లేని స్థితి నాకు కావాలి అని అడుగుదామని అనుకుంటే "కోరికలు లేని స్థితి నాకు కావాలి అని కోరుకోవటం కూడా కోరికే" అన్న నీతో నిన్నేమని అడిగేది

- ఏమని కోరేది - నిన్నేమని కోరేది.

అందరికీ సుగతే- అని నీవు ప్రకటించిన తర్వాత మీరు నాలోనే పుట్టి, నాలోనే పెరిగి, నాలోనే లీనమౌతారు అని, నీవు అన్న తర్వాత కూడా ఇంకేమని అడిగేది

- ఏమి కోరేది - నిన్నేమని కోరేది.

- మార్చి, 2010

# ఆత్మ సందర్శనము

ఆత్మ దర్శించేది కాదు. ఆత్మ సర్వంతర్యామి. అంతటా వ్యాపించింది. అది కానిది లేనిది లేదు. కనుక ఇది ఎక్కడో ఒక్కచోట వుంటుందని దాని దర్శనాలు పొందవచ్చు అనునది భ్రమయే. ఇది శక్తిలాంటిది. శక్తిని చూడటానికి వీలుపడదు. శక్తి ఏదో ఒక దానిని ఆలంబన చేసికొనే వుంటుంది. మరి ఆత్మకు ఆలంబన ఏది? అది "నేను నేనైన నేను" అన్ని నేనులు నేనైన నేనుతో" ఆలంబన చేసుకొని వుంటుంది. మరి ఆ నేను ఎట్లా తెలుస్తుంది. అందకనే ఆ "నేను ఎవరో తెలుసుకో" అన్నారు మహర్షి రమణ. ఆ తెలుసుకోవటమే జ్ఞానం. తెలుసుకొనేవాడిని జ్ఞాని అంటారు. కాని జ్ఞాని అజ్ఞాని అని లేరు అంటారు. జ్ఞానం కావటమే కొని తెలుసుకోవడం ఏమీ ఉండదు అంటారు రమణ మహర్షి. జ్ఞానం శఖ్తి లాంటిది అన్నాము కదా! ఆ శక్తిని తెలుసుకొంటానికి చూడటానికి వీలుగా సాకారంచేసి రూపంగా చిత్రీకరించారు ఆ సాకారం చేసిన శక్తినే మహాశక్తి, మూలపుటమ్మ, రాజరాజేశ్వరి, లలిత, మహాకాళి, మహాసరస్వతి, దుర్గా అనే పేర్లతో పిలుస్తున్నారు. వీటి నిజ స్వరూపం చూడాలంటే ఆ అసలు నేనును తెలుసుకొంటే అన్నీ ఆ నేనుగానే భాసిస్తాయి. "అందుకనే అన్ని ఆలయాలలో దర్శించేది దర్పణంలో మనని మనం చూసుకొన్నట్లే. అది మనం లేనిదే దర్శించేది లేదు. అన్నీ "నేను" కావలసిందే. ఇది తన ఆత్మానుభవం వల్లే తెలుస్తుంది. కాని మాటల్లో వ్యక్తం చేయలేము. "వేదాంతం చెప్పేవాడికి తెలియదు. వినేవాడికీ తెలియదు" అనే అమ్మసూక్తికి నిజమైన ఆంతర్యం ఇదేనేమో!





## కొండముది బాలగోపాలకృష్ణమూర్తి

గోపాలన్నయ్య వ్రాసిన ఈ రచనలలో అమ్మ ఆయనకు ఇచ్చిన అనుభవాలు, గత యేబదియేళ్ళుగా అందరింటి చరిత్రలో జరిగిన సన్నివేశాలలో అడుగడుగునా గోపాలన్నయ్య ఎలా ఉపకరణంగా అమ్మ అనుగ్రహించింది మనకు కళ్లకు కట్టినట్లు కనిపిస్తుంది.

గోపాలన్నయ్యకు అమ్మ ఇచ్చిన హామీ, కరావలంబ స్తోత్రము చదివే అంధుడు సిరిగిరి సుబ్బారావుకు అమ్మ చేయూత నివ్వడం, అందరింటిపై నక్సలైట్లు పడ్డప్పుడు అమ్మ గోపాలన్నయ్యను ఎలా రక్షించిందీ, శేషగిరిరావు అన్నయ్య శ్వాస నుండి అమ్మ శబ్దం ఎలా వినిపించిందీ, నెల్లూరు డాక్టర్ శిష్ట్లా సుబ్బారావు గారు ఎలా పాముల నరసయ్య అయ్యిందీ, అమ్మది అసలైన కమ్యూనిజం ఎలా అయ్యిందీ, ఎక్కడనుండి అయినా అమ్మకు మన కేక ఎలా వినిపిస్తున్నదీ, అమ్మపెట్టిన గోరుముద్దలతో పళ్లాలకు పళ్లాలు అన్నయ్యలు ఎలా తిన్నదీ, జిల్లెళ్లమూడిలో హనుమంతుడి సమాధి, అమ్మ పెట్టిన గుప్పెడు బియ్యపు పథకమే పరివర్తన చెంది అందరింటికి ఎలా మూల మయ్యిందీ, అమ్మ చూపించిన విశ్వరూప సందర్శనము, ఇలా ఎన్నో, ఎన్నెన్నో ఈ గ్రంథములో ఉన్నాయి.

నిన్న తిన్న కూర ఈరోజు జ్ఞాపకముండదు. అలాంటిది గోపాలన్నయ్య తన జ్ఞాపకాల మడతల్లోంచి ఎన్ని ఆణిముత్యాలు మనముందు కుప్పపోసాడో.. ఏరుకోగలవాడికి ఏరుకున్నంత... మీదే ఆలస్యం.... గ్రంథంలోకి వెళ్లండి.

- పబ్లిషర్స్